ఫిబ్రవరి 2013
రూ. 10/-

# చతుర



జన్మదిన ప్రత్యేక సంచిక

★ పి. ఎస్. నారాయణ చక్రాయుధం .. 6

★ చతుర ప్ర. జ. .. 122

# మూడున్నర దశాబ్దాల

# విపుల ☆ ☆ చతుర



అనంత కాలప్రవాహంలో ముప్పై అయిదేళ్లన్నది చాలా తక్కువ కావచ్చు. కానీ రెండు సాహితీ పత్రికలు మూడున్నర దశాబ్దాలుగా పాఠక దేవుళ్ల ఆదరాభిమానాలే ఆలంబనగా ముందుకు సాగడం అరుదైన విషయం, అపురూప విషయం.

**విశ్వకథా వేదిక విపుల**

**నవ నవలాకేతనం చతుర** ఆ అరుదైన, విశిష్టమైన గౌరవాన్ని దక్కించుకున్నాయి.

ఓ వినూత్న ప్రయోగంగా 1978 ఫిబ్రవరిలో మొదలైన వీటి విజయ ప్రస్థానం ముప్పై అయిదేళ్లు ముగించుకుని ఈ సంచికలతో ముప్పై ఆరులోకి ప్రవేశించాయి.

విశ్వ కథా మందారాల్ని, భారతీయ కథా మకరందాల్ని తేటతెలుగులో తెలుగు పాఠకులకు అందించడమే లక్ష్యంగా కుసుమించిన 'విపుల' మరిన్ని వన్నెచిన్నెలతో వికసించి కొత్తతరం పాఠకుల్ని కూడా అలరిస్తోంది.

అతి తక్కువ ఖరీదులో అత్యుత్తమ నవలల్ని పాఠకులకు అందించాలనే సంకల్పంతో మొగ్గ తొడిగిన 'చతుర' నవలతోపాటు మరెన్నో ఆకర్షణీయ శీర్షికలతో సాహితీ సౌరభాల్ని వెదజల్లుతోంది.

ఇప్పటికి అక్షరాలా నాలుగు వందల ఇరవై సంచికలను అందించి 421వ సంచికలుగా మీ ముందుకు వచ్చాయి ఈ తెలుగువారి ఇంటింటి జంటపత్రికలు. ప్రారంభ సంచిక నుంచి క్రమం తప్పకుండా మొదటి తారీఖుకల్లా మార్కెట్‌లో విడుదలవడం కూడా వీటి రికార్డే. ఇది 'ఈనాడు గ్రూపు'కే సాధ్యమంటారు అభిమాన పాఠకులు.




పాఠకుల ఉత్తమాభిరుచికి పట్టుగొమ్మలైన విపుల/ చతుర ఎందరో రచయితలు, కథకులు, అనువాదకులకు పుట్టిళ్లు అన్న విషయం విదితమే.

వీటి ప్రస్థానం మరింత ఉజ్జ్వలంగా కొనసాగడానికి మీ అండాదండా నిరంతరం మా వెంటే ఉంటాయని ఆశిస్తూ..

\- సంపాదకులు

# శ్రీ IIT రామయ్య ప్రవేశ పరీక్షకు శిక్షణ ఇచ్చే సంస్థల్లో No.1









Since 2001

అకాడమి

**HO: Road No.3, KPHB**
**Hyderabad -72**
**Branch: Dilsukhnagar**

- 2001లో IIT రామయ్యగారు ప్రారంభించిన సంస్థ
- 2012లో రామయ్య, కృష్ణమూర్తి, శ్రీమెగా, డెల్టా, స్పెషల్ కోచింగ్, నానో, ఎవరాన్, సంజీవనిలలో మొత్తం 1628 సీట్లు సాధన
- రోజుకి 6గం. కోచింగ్.
- Special doubts clarification sessions
- 3 ప్రింటెడ్ బుక్స్ 1. Study material 2. Ramaiah 10 yrs old papers with solutions (chapter wise breakup) 3. Expected questions with solutions
- 25 experienced lecturers
- Model tests
- హాస్టల్ వసతి కలదు.
- CBSE వారికి 30.3.13, SSC వారికి 7.4.13 నుండి క్లాసులు ప్రారంభం

## రామయ్య ప్రవేశ పరీక్షల్లో TOP 10 లో నిలిచిన మా విద్యార్థులు


Ram Kumar
2002


Nanda Kishore
2004


Sampath Rushi
2005


Y.P. Manohar Reddy
2006


B. Tejaswi
2008


M. Chakradhar
2008


Sourabh Rao
2009


Rahul Dopeswar
2009


P.V.Teja Ganesh
2009


J. Apoorva
2010


K. Akhil
2010


Sashikanth Reddy
2010


V. Sai Sravya
2011


Praneeth Reddy
2011


Narendra Bade
2011


Kunal Patnaik
2011


Divya Sri
2012


G. Kalyan
2012


K. Avinash
2012


M. Surya
2012

రూ. 1000 + రామయ్య అప్లికేషన్ నిమిత్తం రూ. 100 మొత్తం రూ. 1100/- పంపించి సీటు రిజర్వ్ చేసుకోవలెను.

Contact for More Details:
**040-2315 6744, 99850 72333,**
**98490 62995, 98490 61668**
visit us at: **www.srisriacademy.com**

# మనసున ఉన్నదీ...



★ శ్రీదివ్య ముఖచిత్రంగా వచ్చిన జనవరి 'చతుర' మమ్మల్ని బాగా ఆకట్టుకున్నది. 'నేను పుట్టింది నీ కోసమే' నవల ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. చిరంజీవి పాత్రను కథలో మల చిన తీరు, పాత్ర చిత్రణ ఆకర్షించింది. శంకరం-భవానీల అల్లరి సంభాషణలు, చిరంజీవిని పవిత్ర తనవాడిగా చేసుకున్న తీరు, చివరికి తన కడుపున పుట్టిన కూతురి విషయంలో ఆమె తీసుకున్న నిర్ణయం.. అన్నీ బాగున్నాయి. ఈ మధ్య కాలంలో ఇలాంటి చక్కటి నవలను వేరెక్కడా చదవలేదనే చెప్పవచ్చు. ఉర్దూ సాహిత్యానికి 2008లో జ్ఞానపీఠ్ అవార్డు పొందిన షహర్యార్ జీవిత విశేషాలు తెలుసుకుని ఆనందించాం.

– *కరణం శివానందరావు, బెంగళూరు*

★ జనవరి సంచికలో 'చతుర ప్ర.జ'లో పాఠకుల ప్రశ్నలకు అవధాన సరస్వతి డాక్టర్ మేడసాని మోహన్ జవాబులు సముచితంగా, విజ్ఞానదాయకంగా ఉన్నాయి. 'నేను పుట్టింది నీ కోసమే' నవలలో ప్రేమలు, పెళ్లిళ్లు విఫలమైన యువతీ యువకుల మనోభావాలను, మనోవేదనలను, వారి విముఖతలను రచయిత్రి చక్కగా ఆవిష్కరించారు. 'కథ వెనుక కథ'లో 'గొడుగు' కథను ఒకేఒక్క రోజులో రాసి బహుమతి పొందిన కాటూరి త్రివిక్రమ్ నిజంగా అభినందనీయులు. 'కొత్తగాలులు' ప్రతినెలా కొత్తకొత్తగా వీస్తూ మా మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తున్నాయి.

– *బి. శాంతి, విజయవాడ*

★ 'కొత్తగాలి'లో వచ్చిన చిరుకవితలు చాలా చక్కగా ఉండి, మళ్లీ మళ్లీ చదివింపజేశాయి. వాణిశ్రీ 'ఉంగరాలవేళ్లు' అనే చతురకతలో కొస మెరుపు చక్కగా అమరింది. నెపోలియన్ సమయోచిత చాతుర్యం అతని హాస్యోక్తులలో వెల్లడయింది. యుద్ధరంగంలోనే కాకుండా మాటల రణరంగలోనూ ఆయన తన ఘనాపాటినని నిరూపించుకున్నాడు. మేడసాని మోహన్ అవధానంలోనే కాకుండా సందేహ నివృత్తిలోనూ సవ్యసాచిలా ఉన్నారు. హిరణ్మయీదేవి నవల 'నేను పుట్టింది నీ కోసమే'లో కథనం, కథలో తారసపడే అనేక చిన్న విషయాలను విశ్లేషించిన తీరు బాగుంది. 'కథ వెనుక కథ' లో 'బడుగుకు పట్టిన గొడుగు' చాలా హృద్యంగా ఉంది.

– *డా. శివభూషణం, కర్నూలు*

★ యువత ఆలోచనలను అద్భుతంగా ఆవిష్కరించిన వాలి హిరణ్మయీ దేవి నవల 'నేను పుట్టింది నీ కోసమే' ఆద్యంతం ఆకట్టుకుంది. 'చతుర ప్రపంచం', 'కొత్తగాలి' బాగున్నాయి. 'చతుర ప్ర.జ' ద్వారా పౌరాణికపరమైన సందేహాలకు జవాబులు తెలుసుకుంటున్నందుకు సంతోషంగా ఉంది.

– *భాగ్యశ్రీ, పొన్నూల్*

★ జనవరి సంచికలో 'నేను పుట్టింది నీ కోసమే' నవల చదివాక 'కొందరు పుట్టింది చక్కటి రచనలు చేయడానికే' అనిపించింది. చిరంజీవి, పవిత్ర పాత్రలు ఎంతో ఆకట్టుకున్నాయి. అటు తిరిగి, ఇటు తిరిగి 'ఆ మరదలు పుట్టింది బావకోసమే' అన్న ముగింపు సహజంగా నప్పింది. రచయిత్రికి అభినందనలు.

– *శ్రీ పెరంబుదూరు నారాయణరావు, హైదరాబాద్*

★ 'కథ వెనుక కథ' ద్వారా రవీంద్ర త్రివిక్రమ్ 'గొడుగు' కథ ఆవిర్భవించిన తీరు తెలుసుకున్నాం. ఒకేరోజు రాత్రి అంత గొప్ప కథను రాయడం ఆశ్చర్యపరచింది. 'నేను పుట్టింది నీ కోసమే' నవల ఎక్కడా అసభ్యతకు తావులేకుండా హాయిగా చదివించింది. 'చతురంగం', 'చతుర ప్ర.జ' బాగా ఆసక్తిని రేకెత్తిస్తున్నాయి. 'నెపోలియన్' చతురోక్తులు చదివించాయి.

– *కె. రాధ, బెంగళూరు*

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

సంపుటి -36 సంచిక - 1
421వ సంచిక, పేజీలు : 132
ఫిబ్రవరి 2013

# చతుర




✦ **మనసున ఉన్నదీ...** 4

✦ **ప్రవేశిక** 74

✦ **ప్రవేశిక విజేతలు** 85

✦ చతుర ప్ర. జ. 122

✦ జ్ఞానపీఠాలు - *49* 126

✦ **చతురంగం - 23** 130

✦ **ఎడిసన్ చతురోక్తులు**

సేకరణ : బద్దీగం


✦ ముఖచిత్రం : బేబీ ఆనికా జోహ్రా

చివరి కవర్ : మాస్టర్ ఆశ్రిత్

పుస్తకాలంకరణ : రాజు యాట

**'సు**స్మిత అనే అమ్మాయి పైనుంచి దూకి ఆత్మహత్య చేసుకుంది. ఆమెశవం పిచ్చిమొక్కల్లో పడివుంది' అంది వార్డెన్.

'శవాన్ని ముందు చూసింది ఎవరు?' అడిగాడు ఇన్‌స్పెక్టర్.

'వాచ్‌మెన్ చూసి నాకు చెప్పాడు. వెంటనే మీకు ఫోన్ చేశాను. చాలా మంచమ్మాయి.. ఎందుకిలా చేసుకుందో?' అంది వార్డెన్.

'ఆమెది ఆత్మహత్యేనని మీరెలా చెప్పగలరు?' తీక్షణంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

'పైనుంచి దూకడంతో ఆత్మహత్యే అనుకున్నాం' అంది వార్డెన్ కంగారుగా.

'మరి అంతెత్తునుంచి మనిషి కిందకి పడ్డప్పుడు హాస్టల్‌లో ఉంటున్న వారెవరికీ ఏమాత్రం శబ్దం వినిపించలేదా?' అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ఇంతకీ ఆ అమ్మాయిది హత్యా? ఆత్మహత్యా?

క్షణక్షణం ఉత్కంఠతో చదివించే **పి.ఎస్. నారాయణ** నవల

**చక్రాయుధం**

చతుర జన్మదిన కానుక!

6వ పేజీలో..

బొమ్మలు : రాకేశ్

ఓ రాజకీయ నాయకుడి కొడుకును ఒక సాధారణ
మహిళ జుట్టు పట్టుకుని ఈడ్చుకుంటూ
పోలీస్ స్టేషన్‌కు తీసుకొచ్చి పడేసింది.
'వీడో నాయకుడి కొడుకు. కేస్ నమోదు చేసుకోండి'
అందామె ఇన్‌స్పెక్టర్‌తో.
'ఏ నేరం చేశాడు వీడు?' అడిగాడు ఇన్‌స్పెక్టర్.
'ఒంటరి ఆడపిల్లల్ని తీసుకువెళ్లి బలవంతాన అనుభవిస్తాడు.
వీడి పాలిట పడ్డవాళ్లలో నా కూతురూ ఉంది' అందామె.
'ఇంతకీ మీ పేరేమిటమ్మా?' ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.
'మా పెద్దలు పెట్టిన పేరు మృదుల. నా కూతురికి జరిగిన
అన్యాయం తర్వాత చండికగా మార్చుకున్నాను.
నేనో ఉపాధ్యాయురాలిని' అందామె.

ఆ తర్వాతేం జరిగింది?
సమాజాన్ని విషతుల్యం చేస్తున్న రాజకీయ నాయకుల
అరాచకాలపై పి.ఎస్. నారాయణ సంధించిన

# చక్రాయుధం

చతుర జన్మదిన కానుక!



రాత్రి ఎనిమిది గంటలయింది. ఏ క్షణానైనా వాన పడవచ్చు అన్నట్లుగా ఆకాశాన్ని మబ్బులు కప్పివున్నాయి. మట్టి వాసనతో చల్లటిగాలి వీస్తోంది.

ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ పోలీస్‌స్టేషన్‌లో తన సీట్లో కూర్చొని వున్నాడు. ఎదురుగ్గా బెంచీల మీద అయిదుగురు మగపిల్లలు, ఒక ఆడపిల్ల వున్నారు. భయంతో మూలుగుతున్నది అందులోని ఇద్దరు మగపిల్లలే. ఆడపిల్లయితే కత్తిరించుకున్న జుట్టును మాటమాటకూ వెనక్కు నెట్టుకుంటూ పక్కన కుర్రవాళ్ళతో గుసగుసలాడుతోంది.

ఆమె మాట్లాడినప్పుడల్లా పక్కనే నిల్చున్న హెడ్‌కానిస్టేబుల్ పెదాలపై చూపుడు వేలు పెట్టుకొని 'మాట్లాడవద్దు' అన్నట్లుగా సైగ చేస్తున్నాడు. ఆ అమ్మాయి కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా వుండి తరువాత మళ్ళీ మెడవంచి పక్కవాడి చెవి దగ్గర నోటికి పని కల్పిస్తూనే వున్నది.

"ఇంకెంతసేపు అంకుల్! మమ్మల్ని ఇక్కడ కూర్చోబెట్టేది... మా నాన్నకు తెలిసిందంటే వచ్చి గోల చేస్తాడు... మీరు తట్టుకోలేరు!" అన్నది బెంచీ మీద కూర్చున్నదల్లా లేచి, ఓ అడుగు ముందుకువేసి.

ఆ అమ్మాయి పేరు రాగిణి. బి.టెక్ మూడో సంవత్సరం చదువుతోంది. మిగతా పిల్లలు కూడా ఇంజనీరింగ్ చదువుతున్న వాళ్ళే. అందరిదీ ఒకే కాలేజీ.

మగపిల్లలలో కొందరు భయంగా రాగిణి వంకే చూస్తున్నారు. కళ్ళనీళ్ళు పెట్టుకునో, కాళ్ళు పట్టుకునో స్టేషన్ నుండి బయటపడాలనేది వాళ్ళ కోరిక. అప్పటికి అరగంట అయింది వాళ్లక్కడకు వచ్చి. ఒక్కడే ఒక్కడు మాటకు ముందు తలెగరేస్తున్నాడు. పేరు వెంకట్. అదేదో మామూలు విషయమే అన్నట్లుగా నిర్భయంగా మాట్లాడుతున్నది రాగిణి. వాళ్ళకు తోడు అసలు ఏమీ జరగలేదన్నంత నిర్లిప్తంగా కూర్చున్నాడు మరో కుర్రాడు. అతడి పేరు రాజు. మిగతా అందరూ గుండెలు చిక్కబట్టుకు కూర్చున్నారు. వాళ్ళకు పోలీసులంటేనే భయం.

ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ మాట్లాడలేదు. కూర్చున్న కుర్చీలోనుంచి లేవనూ లేదు. రాగిణి వంక చూస్తూ 'కూర్చో' అన్నట్లుగా సైగ చేశాడు. ఓ కానిస్టేబుల్ వాళ్ళ పేర్లూ, అడ్రసులూ, ఫోన్ నంబర్లు రాసిన పుస్తకాన్ని తెచ్చి అతడి ముందు పెట్టాడు. దాన్ని చేతిలోకి తీసుకుంటూనే, మొదటి పేరు వంక చూశాడు.. 'చంద్రశేఖరం'.

"చంద్రశేఖరం ఎవరు?" అంటుండగానే, పీలగా వున్న యువకుడు లేచి నిలబడ్డాడు. ప్రశాంత్ దగ్గరకు రమ్మనమన్నట్లు చేయూపితే వచ్చి, ఆయన ముందు నిలుచున్నాడు. అతడి కళ్ళు తడుస్తున్నాయి.

"మీ నాన్న ఏం చేస్తుంటారు?"

"స్కూల్లో టీచర్‌గా పని చేస్తున్నారు!"

"అంటే పండిత పుత్రుడివన్నమాట... ఎన్నాళ్ళనుంచీ ఈ అలవాటు నీకు?"

అతడి ముఖం తెల్లగా పాలిపోయింది.

"లేదు సార్!... ఇదే మొదలు!" అతడికి దుఃఖంతో మాట స్పష్టంగా రావటం లేదు. ఆ వెధవ రామంగాడు తనని బలవంతంగా ఈ లంపటంలోకి దింపాడు!

"ప్రతి నేరస్థుడూ చెప్పేది అదేలేగాని మీకు వాటిని సప్లయ్ చేస్తున్నదెవరు?"

అతడు మాట్లాడలేదు. తల ఎత్తను కూడా లేదు.

ప్రశాంత్ రెట్టించటంతో, "తెలియదు!" అన్నాడు నోరు పెగుల్చుకొని.

"ఇక్కడున్న ఆరుగురిలో ఎవరైనా సరే డ్రగ్స్ సప్లయి చేస్తున్న మనిషిని గురించిన వివరాలు చెప్పి, ఇకముందు ఇలాంటి వెధవ పనులు చేయమూ- అని హామీ ఇస్తే, ఏ కేసూ పెట్టకుండా అందరినీ ఇంటికి పంపించేస్తాను!"

"కాలేజీ గేటు దగ్గర బండిమీద కూర్చొని ఉంటాడు... ఎవరో తెలియదు... ప్రతి సారీ ఒకడే వస్తాడని కూడా లేదు... డబ్బులు ఇవ్వగానే పొట్లం ఇచ్చి వెళ్ళిపో తాడు!" అన్నాడు అందులో ఒకడు.

చిప్పున తలెత్తి అతడి వంక చూచాడు ప్రశాంత్. "అంటే మీ బ్యాచ్‌కి నువ్వే రింగ్ లీడర్‌వి అన్నమాట!"

అతడు మౌనంగా ఉండిపోయాడు.

"లేచి రావాలి...!" విసురుగా అన్నాడు ప్రశాంత్. "చెప్పు నీ పేరు? ... ఎన్నాళ్ళ బట్టీ నడుపుతున్నావ్ ఈ వ్యవహారాన్ని? "

"వెంకట్. నాకూ అలవాటు లేదు... అలా వచ్చే అతడి దగ్గర తీసుకోవటం ఇదే మొదటిసారి!"

"వాడ్ని పరిచయం చేసిందెవరు? "

అతడు మాట్లాడలేదు.

"ఏ కాలేజీలో చదువుతున్నావ్? "

చెప్పాడు.

"మీ నాన్న ఏం చేస్తుంటాడు? "

"బిజినెస్!"

"ఏం బిజినెస్సు... ఇదేనా? "

అతడు ఆలస్యం చేయలేదు. "కాదండి. పెయింటింగ్స్ డీలర్‌షిప్ వున్నది... పెద్ద బజారులో షాపున్నది!"

"ఇప్పుడు మీ నాన్న ఇంటికి వచ్చి వుంటాడా? ... షాపులోనే ఉంటాడా? "

"షాపులోనే ఉంటాడు!"

ప్రశాంత్ రైటర్ని పిలిచాడు. "ఇందులో వున్న ఆరుగురి ఇళ్ళకీ ఫోన్‌చేసి వీళ్ళ పేరెంట్స్‌ని రమ్మనమని చెప్పు... వెంటనే రావాలని కూడా చెప్పు..!"

ఒక్కసారిగా అందరూ లేచి నిలబడ్డారు.

"వద్దు అంకుల్... వద్దు... మా పేరెం ట్స్‌ను పిలవద్దు. ఇంకోసారి ఈ పని చేయం. మమ్మల్ని క్షమించి వదిలేయండి అంకుల్!" అన్నారు ముక్తకంఠంతో.

రాగిణీ, వెంకట్ నోరు తెరవకపోవటం గమనించాడు ప్రశాంత్.

"మీరు కూర్చున్న గది ఎవరిది? "

"మాదెవరిదీ కాదు. సుదర్శనమని మా కాలేజీలోనే చదువుతున్నాడు. అతడు ఊరి కెళుతుంటే తాళంచెవి తీసుకున్నాం!" వెంకట్ చెప్పాడు.

అతడి సమాధానంతో ప్రశాంత్‌కు పూర్తిగా నిరూపణ అయింది- ఈ కుర్ర గ్యాంగ్‌కంతటికీ అతడే లీడర్ అని!

"అతడుంటే మీతో కూర్చుండేవాడా? "

"లేదు... వాడికి తెలియదు... వాడు ఊరికి వెళుతుంటే చదువుకుంటామని తాళం చెవి అడిగి తీసుకున్నాను!"

పక్కనే ఉన్న కానిస్టేబుల్‌కు చెప్పాడు. "సుదర్శనం ఎప్పుడు ఊరునుంచి వస్తాడో కనిపెట్టి ఉండండి. రాగానే తీసుకురండి"

"వద్దు వద్దు. వాడికిదేం తెలియదు... వాడు చాలా మంచివాడు సార్!" ఆ మాటకు కాస్త ఇబ్బంది పడ్డాడు వెంకట్.

నిజానికి సుదర్శన్‌కి ఏమీ తెలియదు. వాళ్ళ అడ్డాను తన గదిలోనే పెట్టడానికి తాళం చెవి అడిగి తీసుకున్నారని అతడు ఊహించి గూడా ఉండడు.

ఉన్నట్లుండి చంద్రశేఖరం వలవలా ఏడ్వసాగాడు. "మా ఇంటికి ఫోన్ చేయ వద్దు సార్... మా నాన్నకు రెండు నెలల క్రితమే బై పాస్ అయింది...!"

"మీ తండ్రి పిల్లలకు పాఠాలు చెప్పే గురువు. ఉద్యోగం చిన్నదే కాకుండా ఆయ నకు బైపాస్ కూడా అయింది. అలాంటి వ్యక్తి కొడుకువయివుండి ఎందుకు చేశావ్ ఇలాంటి దౌర్భాగ్యపు పని? "

ఆతడు మాట్లాడలేదు కాని, ముఖానికి చేతులడ్డం పెట్టుకొని ఏడుస్తూనే ఉన్నాడు.

రైటర్ వాళ్ళందరి ఫోన్ నంబర్లు రాసిన పుస్తకాన్ని తిరిగి ప్రశాంత్ ముందు పెట్టాడు. "అందరికీ ఫోన్లు చేశాను సార్!... ఈ ఒక్కఫోనే ఎవరూ లిఫ్ట్

చేయటం లేదు ఎన్నిసార్లు చేసినా!"

అది ఆనంద్ ఇచ్చిన నంబరు. ఆనందన్ను పిలిచాడు. అతడు దగ్గరకు రాగానే, "చూడు ఈ నంబరు కరెక్టేనా... లేకపోతే కావాలని తప్పుడు నంబరు ఇచ్చావా? "

అతడు కొద్ది క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. "కరెక్టే సార్. మా అమ్మా నాన్నా ఇంకా ఇంటికి వచ్చి వుండరు! ఆఫీసుల్లోనే ఆలస్యమవుతుంటుంది వాళ్ళకు!"

రాగిణి ఉన్నట్లుండి అన్నది. "మా నాన్నను పిలిచి మీరు చేతులు కాల్చుకోవద్దు అంకుల్... ఆయన రాకుండా ఉంటేనే మీకు క్షేమం!"

"అంటే? " విసురుగా లేచి నిలబడుతూ అరుస్తున్నట్లుగా అడిగాడు ప్రశాంత్.

రాగిణి ఒక అడుగు ముందుకు వేసింది. "మా నాన్న అంటే... చక్రవర్తి గారు. ఆయన పేరు తెలియని వాళ్ళు ఉండరు. మీకుగాని ఆయన ఎవరో గుర్తుకు రాకపోతే, మీ కానిస్టేబుల్ని అడగండి... ఆయనేమిటో, ఆయన పవరేమిటో ఇట్టే తెలిసిపోతుంది!"

"ఐసీ... అంత గొప్పవాడా? "

హెడ్ కానిస్టేబుల్ ప్రశాంత్‌కు ఏదో చెప్పబోయాడు.

అతడిని వారిస్తూ, ప్రశాంత్ పకపకా నవ్వాడు. "వోహో! ఆయనా... తెలుసులే... నేనూ ఆయన్ను చాలాకాలం నుండి చూడాలనుకుంటున్నాను... ఇప్పటికి ఆ అవకాశమొచ్చిందన్నమాట..."

"మీ ఇష్టం!" రాగిణి ముఖం ముడుచుకొని వెళ్ళి బెంచీ మీద కూర్చున్నది.

తరువాత పది నిముషాల్లోనే వాకిట్లో ఓ ఆటో ఆగింది. అందులోనుంచి దిగిన ఓ వ్యక్తి దబదబా లోపలకు వస్తూనే, "నమస్కారమండి! ఎందుకో రమ్మనమని పిలిచారట? " అన్నాడు వినయంగా.

"అక్కడ కూర్చున్న పిల్లల్లో మీ అబ్బాయి ఉన్నాడేమో చూడండి!" పిల్లలవంక చేయి చూపుతూ అన్నాడు ప్రశాంత్.

ఆయన చివ్వున తలను అటు తిప్పాడు. కొడుకునే చూస్తూనే, "ఏం చేశాడు సార్, వాడు? " అన్నాడు.

ఆయన కొడుకు రామం తల ఎత్తలేదు.

"ఇదో పెద్ద గ్యాంగు. మీ పిల్లవాడూ వాళ్ళతో జేరి డ్రగ్స్‌కు అలవాటు పడ్డాడు"

ఆయన ఒక్క ఉదుటున కొడుకు ముందుకు దూకి జుట్టు పట్టుకొని వీపు మీద పెడీ పెడీ గుద్దసాగాడు.

"అడ్డగాడిద! చెమటోడ్చి సంపాదిస్తూ చదివిస్తున్నది ఈ వెధవ పనులకా.. నన్నెందుకు పిలిచారు సార్! నాలుగు తన్ని సెల్‌లో పారేయక.. వీడి చర్మం చాలా మందం.. మాటలతో వినడు!"

ప్రశాంత్ ముందుకు వచ్చి ఆయన్ను ఆపాడు. "మీరు కొట్టటం వలన పిల్లవాడు బాగుపడతాడని నేననుకోను. ఇంటికి తీసుకువెళ్ళి మంచిమాటలు బోధించండి. ఈసారి దొరికితే మాత్రం మీరు చెప్పిన పనే చేస్తాను... పిల్లవాడు కాబట్టి ఒక అవకాశం ఇచ్చి చూద్దామనే మిమ్మల్ని పిలిచి చెబుతున్నది... వాళ్ళ భవిష్యత్తుతో ఆడుకోవటం నాకిష్టం లేదు!" అన్నాడు.

తండ్రీ కొడుకులిద్దరూ ప్రశాంత్‌కు నమస్కరించి బయటకు వెళ్ళిపోయారు.

చంద్రశేఖరం గుర్రుగా రామం వంక చూచాడు- తన కష్టాలకు వాడే కారకుడు!

తరువాత రెండు నిమిషాల్లోనే స్కూటర్ మీద ఓ దంపతులు వచ్చారు.

"చెప్పండి... ఎందుకు రమ్మనమన్నారుట? " అడిగాడు అతడు. "మా వెధవ ఏదైనా గోల చేశాడా? "

"అటు చూడండి. అందులో మీ వెధవ ఎవరో? " అన్నాడు కాస్తంత ఎగతాళిగా.

వాళ్ళు అటు ముఖం తిప్పుతూనే, "వాడిని ఈ ప్రపంచంలో ఎవ్వరూ బాగు

చేయలేరు సార్!... మీ ఇష్టం... మీ ఇష్ట మొచ్చినట్లు చేయండి... ఇంకెప్పుడూ వాడి విషయంలో మమ్మల్ని స్టేషన్‌కు పిలిపించ వద్దు!" వాళ్ళు చటుక్కున వెను తిరిగారు.

రాజు విసురుగా లేచి వచ్చి తల్లిదండ్రు లముందు నిలబడ్డాడు. "నన్ను కన్న తల్లి దండ్రులయివుండి మీరు మాట్లాడాల్సిన తీరు ఇదేనా? నేనేం ఘోరమయిన నేరం చేయలేదే... ఇంటర్నల్స్ బాగా రాశామనే ఆనందంలో స్నేహితులమంతా కాసేపు సరదాగా గడుపుదామని ఒకచోట జేరాం.. అంతే!" అన్నాడు తల ఎగరేస్తూ.

ప్రశాంత్ అతడినే చూస్తూ ఉండిపో యాడు. ఎలా మారిపోతున్నదీ యువత? డ్రగ్స్ తీసుకోవటం చిన్న సరదానా?

"పరీక్షలు బాగా రాసినంత మాత్రాన బడుద్ధాయిలు అంతా కలిసి ఈ ఛండాలపు పని చేయాలా? మీ కంటే బాగా రాసిన వాళ్ళను ఆదర్శంగా తీసుకొని వాళ్ళకు పోటీగా చదవటానికి ప్రయత్నించా లిరా!... ఇంకెందుకు ఇక్కడ... పద... వారు పెద్ద మనసు చేసుకొని బయటకు వెళ్ళమన్నారు కదా!"

"అందరితోపాటే వస్తాను... స్నేహి తుల్ని వదిలి నేను ఒంటరిగా రాను!"

సరిగ్గా అప్పుడే వాకిట్లో ఓ కారు ఆగింది. వడివడిగా డ్రైవరు దిగి వెనుక తలుపు తెరుస్తుండగానే, "ఆ ఇన్‌స్పెక్టర్‌ను బయటకు పిలువు!" అరిచాడు వెనుక సీట్లో కూర్చున్న చక్రవర్తి.

డ్రైవర్ పరుగెడుతున్నట్లుగా స్టేషన్ మెట్లెక్కాడు. తలుపు దగ్గర సెంట్రీ ఆపాడు, "కాసేపు ఆగు!" అంటూ.

"వచ్చింది చక్రవర్తిగారు! ఆయన ఆగే మనిషికాదు... ముందు ఇన్‌స్పెక్టర్‌గారిని బయటకు పిలువు!"

చక్రవర్తి పేరు వినటంతో సెంట్రీ మాట్లాడలేదు. లోపలకు వెళ్ళు అన్నట్లుగా చేయి మాత్రం అడ్డం తీశాడు.

"సార్! మాసార్ రమ్మంటున్నారు!" డ్రైవర్ ఇన్‌స్పెక్టర్‌ని చూస్తూ అన్నాడు.

అతడు కనబడగానే హుషారుగా ముందుకు వచ్చింది రాగిణి. "ఏరా కోటీ... నాన్న వచ్చాడా? " అంటూనే బయటకు దూకింది. కూతుర్ని చూస్తూనే కారులో నుంచి దిగాడు చక్రవర్తి.

"ఏమైంది? ఎందుకొచ్చావిక్కడకి? ఎవ రైనా ఏమైనా అన్నారా? పోలీస్ కంప్లె యింట్ ఇస్తే ఏం చేస్తారు? నాకు చెబితే కాళ్ళూ చేతులూ ఇరగ్గొట్టించేస్తాను గదా!"

"అదిగాదు నాన్నా! ఫ్రెండ్సంతా కలిసి ఓ చోట కూర్చొని కబుర్లు చెప్పుకుం టున్నాం. ఈ ఇన్‌స్పెక్టర్ వచ్చి మేం డ్రగ్స్

**కొత్తగాలి...** 

**అమెరికాలో అతను**
**తెలుగు ఔపోసన!**
**అనకాపల్లిలో వాడు**
**ఆంగ్ల ఆరాధన!**

– జి. విజయశ్రీ, అరసవిల్లి

తీసుకుంటున్నాం అంటూ స్టేషన్‌కు తీసు కువచ్చాడు!"

కూతురు మాటలు వింటూనే ఆయన కోపంతో ఊగిపోయాడు. "ఎవడ్రా వాడు అమ్మాయిని స్టేషన్‌కు తీసుకొచ్చింది? " పెద్ద పెద్ద రంకెలు వేసుకుంటూ లోపలకు వచ్చాడు.

"ఎవడా ఇనస్పెక్టరు? "

"నమస్కారం సార్! నా పేరు ప్రశాంత్... నేనే ఈ స్టేషన్‌కు ఇన్‌స్పె క్టర్ని... మీరా కుర్చీలో కూర్చుంటే వివ

రంగా చెబుతాను, జరిగిందేమిటో!" అన్నాడు చాలా చిన్నగా ప్రశాంత్.

"నువ్వేం చెప్పనక్కరలేదు. అమ్మాయి చెప్పిందంతా... ఏం ఉద్యోగం చేయాలని లేదా ఇక్కడ... ఎన్నాళ్ళయింది వచ్చి... పరువుగల కుటుంబాలను రోడ్డుమీదకు లాగావంటే ఊరుకోను. కాళ్ళూచేతులూ విరగ్గొట్టి మరీ పంపిస్తాను ఇక్కడనుంచి. ఇంత చిన్నపిల్లల్ని డ్రగ్స్ తీసుకుంటున్నారంటూ స్టేషన్‌కు తీసుకువస్తావా? వాళ్ళ భవిష్యత్తు ఏం కావాలని నీ ఉద్దేశ్యం? చేసిన వెధవ పనికి తోడు పెద్దవాళ్ళను స్టేషన్‌కు రమ్మనమని ఫోన్లు చేస్తావా... ఇప్పుడే సూపరింటెండెంట్‌తో మాట్లాడతాను. నిన్ను ఏ మన్యానికో పంపకపోతే నాపేరు చక్రవర్తే కాదు!" అరిచాడాయన.

**కొత్తగాలి...**

**నేను**
**మాతృభాషను**
**ప్రేమిస్తున్నాను గాఢంగా!**
**బిలీవ్ మీ...**

– జి. శైలూషి

ఇంతలోకే మరోవ్యక్తి ఆటోలో వచ్చాడు. చక్రవర్తి మాటలన్నీ విన్నాడు. "బాగా చెప్పారు సార్! వీళ్ళకు డ్రగ్స్ అమ్మేవాడిని పట్టుకోవటం చేతగాదు... పిల్లల్ని తీసుకు వచ్చి కేసులు పెట్టి ప్రమోషన్‌లు కొట్టేస్తుంటారు. అమ్మేవాళ్ళేమో మామూళ్ళిచ్చి తప్పించుకుంటారు. అమాయకులేమో గిలగిలలాడుతుంటారు!" అంటూ రెచ్చిపోయాడు. తన కొడుకునూ స్టేషన్‌కు తెచ్చాడని కోపమూ, చక్రవర్తి అరుపులూ అతడి ఆక్రోశానికి వత్తాసు పలికాయి. అతడు వెంకట్ తండ్రి.

ప్రశాంత్ వాళ్ళ కేకల్ని వింటూ మౌనంగా ఉండిపోయాడు. తనేదో తప్పు చేసినట్లుగా వాళ్ళు మాట్లాడుతుంటే అతడి మనస్సు కుతకుతలాడిపోతోంది. చదువుకోవాల్సిన వయస్సులో వాళ్ళు తప్పుదారిన పోతుంటే తల్లిదండ్రులు మంచి మార్గంలో పెట్టాల్సిందిబోయి సమర్థిస్తున్నారంటే ఆ పిల్లలు బాగుపడేనా?

"ఇప్పుడు నాకు రెండే మార్గాలు కనబడుతున్నాయి... మొదటిది- కేసు పెట్టి వాళ్ళ జీవితాల్ని పాడుచేయటం. లేదా రెండోది- మీలాంటి తల్లిదండ్రులకు వాళ్ళను అప్పగించి సమాజానికి చీడపురుగులుగా తయారుచేసే స్వేచ్ఛ మీకివ్వటం. రెండింటిలో మీరేం కోరుకుంటున్నారు? " అన్నాడు ప్రశాంత్ చిరునవ్వుతో.

"నిన్ను నోరుమూసుకోమంటాను... పెద్దపెద్ద మాటలు మాట్లాడి వాళ్ళ మనస్సుల్లో విషాన్ని చిమ్మబోకంటాను... మా పిల్లల్ని ఎలా పెంచుకోవాలో, వాళ్ళ భవిష్యత్తు ఎంత ఉచ్ఛస్థితిలో ఉండాలో, ఉంటుందో మాకు తెలుసు అంటాను... ఇది నా ఫైనల్ వార్నింగ్... మా పిల్లల జోలికి మరోసారి వెళితే మాత్రం నువ్వు బతికి బట్టగట్టలేవు!"

"నా కోరికా వాళ్ళ భవిష్యత్తు బాగుండాలనే! తీసుకు వెళ్ళిపోండి. ఈసారి నాకు దొరికితే మాత్రం... మీరుగాదు ఈ ప్రపంచంలో మరెవ్వరూ నాకు అడ్డురాలేరు. మీకేదో మేలు చేద్దామని, మిమ్మల్ని ఇక్కడకు పిలిచి శ్రమ పెట్టినందుకు మన్నించండి!" అన్నాడు రెండు చేతులూ జోడించి ప్రశాంత్, కాస్తంత ఎగతాళిగా.

సరిగ్గా అప్పుడే ఆనంద్ కంఠం ఖంగుమన్నది. "ఇన్‌స్పెక్టర్! మేం చేసింది తప్పు... ఆ గదిలో కూర్చొని అంతా వాటిని తీసుకున్నామనటం నిజం... మేం

ఇకనయినా మంచిదారిలో నడవాలి అంటే శిక్ష అనుభవించక తప్పదు... ఇప్పుడు మమ్మల్ని వదిలితే, ఆ కుర్చీలో కూర్చున్న మీరు మాకే కాదు, సమాజానికీ ద్రోహం చేసిన వారవుతారు!"

అతడి మాటలకు ఆ ప్రదేశమంతా చీమ చిటుక్కుమన్నా వినబడేంత నిశ్శబ్ద మేర్పడింది. అదీ కొద్ది క్షణాలే. తరువాత ఒక్కసారిగా ఉరుములూ మెరుపులతో తు పాను వచ్చినట్లుగా చక్రవర్తి ముందుకి దూకి ఆ పిల్లవాడిని పట్టుకొని ఎడాపెడా చెంపలు వాయించడం మొదలు పెట్టాడు.

ప్రశాంత్ నిగ్రహించుకోలేకపోయాడు. పక్కనున్న కానిస్టేబుల్స్‌కు సైగ చేస్తూనే చక్రవర్తిని గట్టిగా పట్టుకొని, "ఆగండి!" అంటూ అరిచాడు. "అంటే మీరే నిజానికి సంకెళ్ళు వేస్తున్నారన్నమాట. మీ డబ్బు, మీ అహం మీచేత ఎలాంటి పనైనా చేయించగలదని రుజువు చేశారు. ఈ నేరంమీద మిమ్మల్ని సెల్‌లోకి తోసినా మీరేం చేయలేరు. మీ పరువు కాపాడుకో వాలీ అంటే వెంటనే మీ అమ్మాయిని తీసు కొని వెళ్ళిపోండి!" అన్నాడు పెద్దగా.

అందరూ స్టేషన్ నుంచి వెళ్ళిపోయిన అరగంటకు వాకిట్లో పెద్దపెద్ద కేకలు విన బడటంతో ప్రశాంత్ కుర్చీలో నుంచి లేవ బోయాడు. అంతలో ఎవరో ఓ మనిషి లోపలకు వచ్చి నేల మీద కూలబడిపో యాడు. కురుస్తున్న వానకు అతడు పూర్తిగా తడిసి వున్నాడు. అతడి వెనగ్గా తుమ్మమొద్దులా వున్న ఓ స్త్రీ లోపలకు వచ్చింది. పొడుగ్గా, లావుగా వున్నది. ఆమె ముఖం భీకరంగా వున్నది.

"పిచ్చికుక్కను కొట్టినట్లు కొట్టాను.... ఇంకా మీరు శ్రమపడాల్సిన పనిలేదు... వీడు ఓ రాజకీయనాయకుడి కొడుకు... ఆంబోతులా ఊరిమీద పడి తిరుగుతు న్నాడు... ఎంత ఒత్తిడి వచ్చినా వద లద్దు... రేపొద్దున కోర్టులో హాజరు పర చాలి!" ఆ మాటలు చెబుతున్నప్పుడు ఆమె రొప్పుతున్నది.

"ఏం చేశాడు? " ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్‌కు నోరు తెరవటానికి నిముషం పట్టింది.

"బజార్లో ఒంటరిగా ఆడపిల్ల కనబడితే చాలు లిఫ్ట్ ఇస్తానంటూ కారెక్కించుకు తీసుకువెళ్ళి ఊరిబయట వీడి తోటలో బల వంతాన అనుభవించటానికి అలవాటు పడ్డాడు... వీడి పాలిట పడ్డవాళ్ళలో నా కూతురు కూడా వున్నది!"

ఉలిక్కిపడ్డట్లుగా చూచాడు ప్రశాంత్ ఆవేశంతో ఊగిపోతున్న ఆమె వంకా, నేల మీద పడివున్న అతడి వంక.

"మీ పేరు? "

"పెద్దలు పెట్టిన పేరు 'మృదుల'... నాలుగు రోజుల క్రితం నా కూతురుకు జరిగిన అన్యాయం తరువాత 'చండిక'గా మార్చుకున్నాను... నేనో ఎలిమెంటరీ స్కూల్ టీచర్‌ని!"

★ ★ ★

ఉదయం ఏడవుతుండగా స్టేషన్ నుంచి ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ ఇంటికి కానిస్టేబుల్ వచ్చాడు. "రాత్రి బాగా గొడవయింది సార్! కూర్మావతారంగారి మనుష్యులు వచ్చి ఆయన కొడుకును వదిలిపెట్టమని గోల చేశారు!"

"చెప్పలేదా... నేను ఊళ్ళో లేనని!"

"చెప్పాం సార్! విజయవాడ వెళ్ళారు.. రేపు మధ్యాహ్నానికి గాని రారని!"

"గుడ్. పదింటికల్లా స్టేషన్‌కు వస్తాను గాని కాగితాలన్నీ తయారు చేసి ఉంచండి. అతడిని కోర్టుకు తీసుకు వెళదాం! నేను సూపరింటెండెంట్ గారితో మాట్లాడాను- అదనపు బలగాలు పంపమని!"

"అంతేకాదు సార్! ఆ అమ్మాయి తల్లి రాత్రంతా స్టేషన్‌లోనే పడుకుంది!"

"దేనికిట? "

"మిమ్మల్ని నమ్మేదెవరు... ఆ వెధవతో లాలూచీపడి వదిలేసినా వదిలేస్తారు. కోర్టుకు తీసుకు వెళ్ళేంతవరకూ ఇక్కడే వుంటానని కూర్చున్నది!"

"వాడి మనుష్యులు వచ్చినప్పుడు కూడా అక్కడే వుందా? "

"ఆమెను కొడతారేమోనని మేమే నచ్చజెప్పి స్టేషన్ వెనగ్గదిలో కూర్చోబెట్టాం!"

"మంచిపని చేశారు... నేను స్టేషన్‌కు వచ్చేంత వరకూ విజయవాడ నుంచి రాలేదనే చెబుతూ వుండండి!"

★ ★ ★

సాయంత్రం నాలుగవుతుండగా ఓ కానిస్టేబుల్ మఫ్టీలో స్కూటర్‌మీద ఆ ఇంజనీరింగ్ కాలేజీకి వచ్చాడు, కాలేజీ అయిపోగానే ఆనంద్‌ని తీసుకు రమ్మనమని ప్రశాంత్ పంపటంతో. క్రితం రోజు దొరికిన కుర్రవాళ్ళల్లో అతడొక్కడే వివేకంగా మాట్లాడింది. తాము తప్పు చేశాం కాబట్టి శిక్ష పడాలన్నదీను.

నేరస్థుల్ని వదిలిపెట్టగూడని కేసులో చట్టాన్ని తన చేతిలోకి తీసుకొని వదిలిపెట్టటం తప్పే అవ్వవచ్చుగాని, చదువుకుంటూ యుక్త వయస్సులో వున్న వాళ్ళ జీవితాలను నాశనం చేయటం ప్రశాంత్‌కి ఇష్టం లేకపోయింది.

కాలేజీకి వచ్చిన కానిస్టేబుల్ ముందే కనుక్కున్నాడు ఆనంద్ ఏ బస్సు ఎక్కేది. ఆనంద్ ఎక్కిన బస్సు బయల్దేరిందాక స్కూటర్ మీదే కూర్చొని తరువాత దాన్ని అనుసరించాడు.

ఆనంద్ తన బస్‌స్టాప్‌లో దిగగానే కానిస్టేబుల్ ఆనంద్ పక్కకు వెళ్ళి, "మీ పేరు ఆనందే కదా? " అడిగాడు.

"అవును!" విచిత్రంగా అతడినే చూస్తూ అన్నాడు ఆనంద్.

"నేను పోలీస్ స్టేషన్‌నుంచి వస్తున్నాను. ఇన్‌స్పెక్టర్‌గారు తీసుకు రమ్మన్నారు!" అన్నాడు చిన్నగా.

"దేనికి? " కాస్త కంఠం తడబడింది. రామంగాడితో నిన్న వెళ్ళి తను చాలా ఇబ్బందుల్లో ఇరుక్కున్నట్లున్నాడు. పోలీసులు ఇక వెంటాడుతునే ఉంటారు. చికాకు వేసినా మాట్లాడలేకపోయాడు...

స్కూటర్ స్టార్ట్ చేయగానే ఎక్కి అతడి వెనుక కూర్చున్నాడు. తరువాత పదినిముషాలకే అది స్టేషన్ ముందు ఆగింది. లోపల ఒక్క ఇన్‌స్పెక్టరే కూర్చొని పేపర్లు చూచుకుంటున్నాడు!

ఉదయం పదింటికే రాజకీయనాయకుడి కొడుకును రేప్‌కేసులో మేజిస్ట్రేట్ ముందు హాజరు పరచటం జరిగింది. అక్కడికీ తయారయి గోలచేయటం మొదలు పెట్టారు కూర్మావతారం మనుష్యులు. లాఠీచార్జి చేయాల్సినంత స్థితికి తీసుకువచ్చారు. న్యాయమూర్తి గుర్నాథాన్ని వారం రోజులు రిమాండ్‌కు పంపుతూ అతడినీ, ఆ అమ్మాయిని ప్రభుత్వాసుపత్రికి తీసుకు వెళ్ళి కావాల్సిన పరీక్షలన్నీ చేయించమన్నారు. దాంతో ఐదు గంటలకు గాని ప్రశాంత్‌కు తీరిక చిక్కలేదు.

లోపలకు వస్తూనే ఆనంద్, "నమస్కారమండీ!" అన్నాడు ప్రశాంత్‌ను చూస్తూ.

"రా ఆనంద్!" అన్నాడు ఎదురు కుర్చీ చూపిస్తూ చిరునవ్వుతో.

ఆయన మాటతీరుకు ఆనంద్‌లోని ఆదుర్దా తగ్గగా కూర్చున్నాడు స్థిమితంగా.

"నీకు మా అబ్బాయి కిరణ్‌కుమార్ తెలుసా? ... మీ కాలేజీ విద్యార్థే. మీ దగ్గర జరిగే ప్రోగ్రాములన్నిటిలోనూ పాల్గొంటుంటాడు... డిబేట్స్‌లో మంచి వక్తగా పేరు తెచ్చుకున్నాడు... ఎలక్ట్రానిక్స్‌లో ఫైనల్ ఇయర్‌లో వున్నాడు!"

గుర్తుకు వచ్చింది ఆనంద్‌కు. వెంటనే, "తెలుసండి... పరిచయం లేదుగాని!" అన్నాడు చిన్నగా.

# సరికొత్త వ్యసనాలు!

ఒకప్పుడు సిగరెట్, మద్యం, పేకాటలాంటి వాటినే వ్యసనాలనుకునేవారు. వాటికి రెండు కొత్త వ్యసనాలు ఇరవైఒకటో శతాబ్దంలో జత చేరాయి. మొదటిది ఇంటర్నెట్ ఎడిక్షన్ డిజార్డర్ (ఐ.ఎ.డి). ఇంటర్నెట్ గేమ్స్ ఆడటం, ఛాటింగ్, బ్రౌజింగ్‌తో కాలక్షేపం చేయడం చాలా మందికి వ్యసనమైంది. ఇటీవల ఇండియానా పొలిస్‌లోని పోలీసులకి ఒకావిడ ఫోన్ ద్వారా ఫిర్యాదు చేసింది. పక్కింటి పిల్లలు ఇద్దరు నగ్నంగా వీధిలో తిరుగుతున్నారని చెప్పింది. వెంటనే పోలీసులు అక్కడికి వెళ్ళి చూస్తే ఓ నాలుగేళ్ళ పిల్లవాడు, ఓ ఏడాదిన్నర పిల్ల నిజంగానే నగ్నంగా రోడ్లో ఆడుకుంటున్నారు. ఆ పిల్లల ఇంటి తలుపు తెరిచే ఉంది. డోర్‌బెల్ కొడితే స్పందన లేదు. దాంతో పోలీసులు లోపలకి వెళ్ళి చూస్తే ముప్ఫైఒక్క ఏళ్ళ ఇంటాయన లాప్‌టాప్‌లో నింజా అనే గేమ్ ఆడుకుంటూ కనిపించాడు. అతని భార్య ఆఫీస్‌కు వెళ్ళింది. పిల్లల పెంపకంలో నిర్లక్ష్యానికి అతన్ని అరెస్ట్ చేసారు.



మరో సందర్భంలో బోస్టన్ పోలీసులకి ఓ తల్లి నుంచి ఫోన్ వచ్చింది. పద్నాలుగేళ్ళ కొడుకు మూడు రోజులుగా స్నానం చేయక, స్కూల్ మానేసి లాప్‌టాప్‌లో 'అట్లాంటిస్' ఆట ఆడుతున్నాడని, ఇది బాధ్యతారాహిత్యమని, చర్య తీసుకొనమని కోరింది. పోలీసులు ఆ పిల్లాడిని తల్లి మాట వినకుంటే ఫాస్టర్‌హోంకి తరలిస్తామని హెచ్చరించారు.

ఇలాంటి ఫిర్యాదులు అమెరికాలో రోజుకి 1500 దాకా వస్తున్నాయట. ఐఎడికి తోడు కొత్తగా 'ఎఫ్ఎడి' అనే మరో వ్యసనం చేరింది. అది ఫేస్‌బుక్ ఎడిక్షన్ డిజార్డర్. ఫేస్‌బుక్‌ను అరగంటకోసారి చూస్తూ స్టేటస్‌ని అప్‌డేట్ చేస్తూ, సగటున ఒక్కోసారి ఇరవై నిమిషాలు దానిపై వెచ్చిస్తున్నారట కొందరు!




# బేబీ బాక్సులు

అప్పుడే పుట్టిన పసికందుల్ని చెత్తబుట్టల్లో వదిలేసిన సంఘటనల గురించి దినపత్రికల్లో చదువుతుంటాం. ఇలాంటివి అనేక దేశాల్లో అధికమయ్యాయి. యూరప్‌లోని బీదదేశాల్లో ఒకటైన చెక్ రిపబ్లిక్ ప్రభుత్వం ఇలా తమకి పుట్టిన పిల్లల్ని వదిలే తల్లులకోసం ఒక ఏర్పాటు చేసింది. బేబి బాక్సెస్‌ని వారికి అందుబాటులో ఉంచింది. హాస్పిటల్స్‌లో ప్రత్యేకంగా తయారుచేసిన పెట్టెల్లో పిల్లల్ని ఉంచి వెళ్ళిపోవచ్చు. వాటిని నిత్యం తరచూ అధికారులు తనిఖీ చేస్తుంటారు. కాబట్టి బిడ్డని వదిలిన కొద్దిగంటలకే వాళ్ల సంరక్షణను స్వీకరించి అనాథ శరణాలయాలకు పంపవచ్చు. గోప్యంగా ఉండే ప్రదేశాల్లోనే అలా వదిలి వెళ్లే తల్లిదండ్రులకు ఈ పెట్టెలను అందుబాటులో ఉంచుతారు. 2005 నుంచి నేటిదాకా చెక్ రిపబ్లిక్‌లో యాభై మంది వదిలేసిన పిల్లల్ని అధికారులు బేబి బాక్సెస్‌లో కనుగొన్నారు. ఆ దేశంలో అనాథ పిల్లల్ని ప్రభుత్వమే పోషిస్తుంది. త్వరలోనే మరో ఇరవై బేబి బాక్సులను అధికారులు ఏర్పాటు చేయబోతున్నారట. ఇవన్నీ ఎక్కువగా మున్సిపల్ హాస్పిటల్స్‌లోనే ఉన్నాయి. ఆసుపత్రుల బయట ఈ పెట్టె మూత తెరచి అందులో బిడ్డల్ని ఉంచి వెళ్ళిపోతారు. ఆ బాక్స్‌లోపల బిడ్డకి మెత్తటి పరుపు, ఏసీ, గాలి అందే ఏర్పాట్లు ఉంటాయి. తూర్పు యూరప్‌లోని మరికొన్ని పేదదేశాల్లో కూడా వీటిని ఏర్పాటుచేసే ఆలోచన ఉంది.



అయితే యునైటెడ్ నేషన్స్ ఇటీవల దీన్ని ఖండిస్తూ చెక్ రిపబ్లిక్‌కి ఓ ఉత్తరం రాసింది. ఈ పద్ధతి 'కన్వెన్షన్ ఆన్ ది రైట్స్ ఆఫ్ ది చైల్డ్'కి విరుద్ధం అని పేర్కొంది. సాధ్యమైనంత త్వరగా ఆ పెట్టెలను తొలగించమని కోరింది.

క్రితం రాత్రి కొడుక్కు తనకు రెయిడ్‌లో దొరికిన అతడి కాలేజీ విద్యార్థుల సంగతి చెప్పి- వాళ్ళ సంగతి అతడికేమైనా తెలుసే మోనని అడిగాడు. వెంకట్, రాజు, రామం కాలేజీలో చెట్టు కింద జేరి మిగతా విద్యార్థులను గోలచేసే విషయం చెప్పాడు. చంద్రశేఖరం, ఆనంద్ గురించి అంతగా తెలియకపోవటంతో తన మిత్రులకు ఫోన్ చేసి వివరాలు కనుక్కున్నాడు. అతడికి తెలిసింది- ఆనంద్ చాలా తెలివిగలవాడని... ఎప్పుడూ క్లాసులో మొదటి రెండు ర్యాంకుల్లో వుంటుంటాడని, మంచివాడనీ మిత్రులు చెప్పటంతో అదే తండ్రికి చెప్పాడు. అందుకే ప్రశాంత్‌కు అతడిని ఆ గ్యాంగ్‌కు దూరం చేసి సరైన మార్గంలో పెట్టాలని పిలిపించింది.

ఐదు నిముషాల తరువాత లేచి ఆనంద్‌ను, "పద" అంటూ బయల్దేరదీశాడు. అతడి వెనుకే నడిచాడు ఆనంద్. బయటకు వస్తూనే మోటార్‌బైక్ మీద కూర్చొని స్టార్ట్ చేసి "ఎక్కు!" అన్నాడు.

అప్పుడు సరిగ్గా ఏడు గంటలయింది. ఆనంద్ ప్రశాంత్ బండి ఎక్కాడు. 'క్రితం రోజు తన తల్లిదండ్రులు రాలేదు కాబట్టి ఈరోజు ఇంటికి తీసుకు వెళ్ళి, తనను అప్పగించి, హితబోధ చేస్తాడన్నమాట' అనుకుంటూ నిర్లిప్తంగా కూర్చున్నాడతను. ముందు అసలు వాళ్ళు ఇంట్లో వుండాలి గదా. అమ్మమ్మగారింటికి వెళ్ళిన అమ్మ రావద్దూ? ఇక నాన్న ఏ బార్‌లో కూర్చొని తాగేస్తున్నాడో' అనుకున్నాడు.

ఆ బైకు తన ఇంటి వైపుకు వెళుతున్నట్లుగా అనిపించలేదు. నాలుగయిదు వీధులు దాటి ఓ ఇంటిముందు ఆగింది.

"దిగు!" అన్నాడు బైకు ఆపుతూ.

ఆనంద్ దిగింతరువాత బైకును గేటు లోపలకు తీసుకు వెళ్ళి స్టాండ్ వేశాడు- అంటే తనని ఆయనింటికి తీసుకు వచ్చాడన్నమాట! వెనగ్గా లోపలకు వెళ్ళాడు.

ప్రశాంత్ భార్య బైక్ శబ్దం వింటూనే వంట ఇంట్లోనుంచి బయటకు వచ్చింది.

"కిరణ్ రాలేదా ఇంకా? "

"వచ్చాడు. గదిలో కంప్యూటర్‌లో గేమ్స్ ఆడుకుంటున్నాడు!"

లోపలకు వెళుతూనే ప్రశాంత్ తన కొడుకును పిలిచాడు బయటకు. కిరణ్‌కి ఆనంద్‌తో పరిచయం లేకపోయినా గుర్తించాడు. రాత్రి ఇతడిని గురించే తండ్రి అడిగింది. తనకు రెండేళ్లు జూనియర్.

ప్రశాంత్ డ్రస్ మార్చుకు వచ్చి "ఇప్పుడు చెప్పు... నువ్వు ఆ వెధవ గ్యాంగ్‌లో ఎలా జేరావ్... మీ భవిష్యత్తు పాడవ్వగూడదనేదే నా యావంతా!"

"నాకు అందులో ఒక్క రామంతో తప్ప మరెవ్వరితోనూ పరిచయం లేదు సార్"

"అక్కడకు నీ అంతట నువ్వు వెళ్ళావా... ఎవరన్నా తీసుకువెళ్ళారా? "

"రామమే తీసుకు వెళ్ళాడు..."

"ఏమని చెప్పి తీసుకు వెళ్ళాడు? "

"ఈ మధ్య మా కుటుంబ పరిస్థితులతో చాలా చికాగ్గానూ, అలజడితోనూ వుంటున్నాను. ఆలోచన్లు, ఆలోచన్లు... రామం, నేను ఒకే సెక్షను... నేను దిగులుగానూ, మౌనంగానూ వుండటం గమనించి కారణం అడిగాడు... చెప్పాను!"

## కొత్తగాలి...

**ప్రజల్లో**
**నిజాయితీ లోపిస్తే**
**రాయితీలు వ్యర్థం**
**బండలు గుదిబండలే!**

– జి.వి.యస్. ప్రియంవద,
అరసవిల్లి

"ఏమిటా కారణం!"

ఒక్క క్షణం సంశయిస్తున్నట్లుగా ఆగాడు. "మా అమ్మా నాన్నా విడాకులు తీసుకోవాలనుకుంటున్నారు!" ఆ మాట చెబుతున్నప్పుడు ముఖం మ్లానమయింది.

"ఐసీ... ఎందుకని? " కన్నార్పకుండా అతడినే చూస్తూ అడిగాడు ప్రశాంత్.

"బాగా భేదాభిప్రాయాలు ఏర్పడినయి... రోజూ కొట్టుకు చస్తున్నారు. గొడవలు పెంచుకోవటం దేనికన్నట్లుగా కోర్టుకు వెళ్ళినట్లున్నారు... కేసు నడుస్తోంది... ఒంటరిగా కూర్చొని దాన్ని గురించే ఆలోచిస్తూ బుర్ర పాడుచేసుకునేకంటే నలుగురితో కాలక్షేపం చేస్తే బాధల్ని మర్చిపోవచ్చుగదా అంటూ బలవంతంగా తీసుకు వెళ్ళాడు... అక్కడకు వెళ్ళేంతవరకూ అక్కడ వాళ్ళు ఎందుకు జేరిందీ నాకు తెలియదు... నేనూ రామం ఒత్తిడితోటి కొంత వాళ్ళిచ్చినదాన్ని నోట్లో వేసుకొని, మత్తు కలిగిస్తుండటంతో అర్థం చేసుకొని బయటకు వచ్చేద్దాం అనుకుంటుండగా మీరు వచ్చారు! అంతే అంకుల్! నాకు అంతకు మించి ఇంకేమీ తెలియదు.."

"రామంతో అంత స్నేహమా నీకు? "

"చెప్పాను కదా సార్! క్లాసుమేటు... బెంచ్‌మేటు కూడా! వాడు అంతకుముందే మాదకద్రవ్యాలకు అలవాటు పడ్డాడని కూడా తెలియదు! తెలిస్తే వెళ్ళివుండేవాడినే కాదు!" అతడి కంఠం జరిగిన దానికి పశ్చాత్తాప పడుతున్నట్లే వున్నది.

ప్రశాంత్ కాసేపు మాట్లాడలేదు. ఆనంద్‌నే చూస్తూ కూర్చున్నాడు. తరువాత తన చూపులకు అతడు ఇబ్బంది పడుతుండటం గమనించి, చిరునవ్వుతో అతడి భుజం మీద చేయివేశాడు అనునయంగా.

"ఈ వ్యసనంతో చాలామంది యువకులు తమజీవితాల్ని నాశనం చేసుకుంటున్నారు. వాళ్ళను బాగు చేయటానికి మంచి మాటలతో కౌన్సిలింగ్ చేయటం ఒక పద్ధతి అయితే అంతకు మించి వాళ్ళకు ఈ మాదకద్రవ్యాలు అందుబాటులోకి రాకుండా చేయటం మరో ముఖ్యమైన పని... ఈ విషయంలో నాకేమైనా సాయం చేయగలుగుతావేమోనని నిన్ను తీసుకు వచ్చింది!"

"చెప్పండి అంకుల్!... నేను చేయగలిగిందైతే తప్పకుండా చేస్తాను!"

★ ★ ★

సాయంత్రం నాలుగు గంటలు! కాలేజీకి కిలోమీటర్ దూరంలోని ఓ హోటల్‌లో వాళ్ళు ముగ్గురూ కూర్చొని వున్నారు.

"మళ్ళా ఎప్పుడు ఫిక్స్ చేసుకుందాం? " అడిగాడు రాజు.

**కొత్తగాలి...**

**సంవత్సరాలు వచ్చి పోతున్నాయి**
**సంబరాలు జరిగి పోతున్నాయి**
**సగటు మనిషి జీవన సమరం**
**సమస్యలపై సదా సాగుతూనే ఉంది!**

*- నండూరి నాగేశ్వరరావు, హైదరాబాద్*

"నీ ఇష్టం. ఇవ్వాళంటే ఇవ్వాళే రేపంటే రేపే!" వెంకట్ హుషారుగా అన్నాడు.

"అదికాదు వెంకట్. మొన్ననే గదా గొడవయింది. నాన్న చివాట్లు పెట్టాడు... తనను పోలీస్‌స్టేషన్‌కి పిలిపించటం చాలా అవమానంగా భావిస్తున్నాడు. ఇన్‌స్పెక్టర్ అంతు చూడందే ఊరుకుండేలా లేడు... నాకూ వున్నది మళ్ళీ కూర్చోవాలని, కాని ఇప్పటి పరిస్థితులలో కొన్నాళ్ళు వాటికి దూరంగా వుంటేనే మంచిదనిపిస్తోంది!" అన్నది రాగిణి. ఆ రాత్రి తండ్రి తిట్టిన తిట్లు ఆమెకింకా

గుర్తుకు వస్తూనే ఉన్నాయి.

"ప్లేసు మారుద్దాం!"

"ఆ ఇన్‌స్పెక్టర్ సామాన్యుడు కాదనిపిస్తోంది... ఆరోజు మెత్తగా మాట్లాడినా, మనల్ని ఒక కంట కనిపెడుతుంటాడనే నా అనుమానం... కొన్నాళ్లు దానికి దూరంగా వుండటమే కాదు, మనం కలవటం గూడా తగ్గిస్తే మంచిది!" అన్నది గొణుగుతున్నట్లుగా రాగిణి.

"వాడిబొంద... ధర్మపన్నాలు చెప్పేది చేతగాని చవటలే... ఆరోజు అన్ని ఆరాలు తీశాడా... అమ్మేవాడు మన కాలేజీ గేటు ముందు మర్నాడూ కనబడ్డాడు అంటే ఆ ఇన్‌స్పెక్టర్ ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకోలేదన్నమాటే గదా!" రాజు నిర్లక్ష్యంగా అన్నాడు తల ఎగరేస్తూ.

"మీనాన్న వాడి అంతు చూడటమంటే... హుష్‌కాకి చేసేయటమేనా?" అన్నాడు పళ్ళన్నీ బయటపెట్టి కళ్ళెగరేస్తూ వెంకట్.

సరిగ్గా ఆ సమయంలోనే ఓ నడివయస్సు మనిషి లోపలకు వచ్చి వాళ్ళ పక్క టేబుల్ ముందు కూర్చున్నాడు. తప్పు చేసినవాళ్ళు పైకి ఎన్ని మాటలు చెబుతున్నా లోలోపల కించిత్ భయం వెంటాడుతునే వుంటుంది. వాళ్ళకు అనుమానం వచ్చింది అతడు పోలీసు మనిషేమోనని... తరువాత నోరు తెరవలేదు. టీ తాగేసి బయటకు వచ్చేశారు.

"వాడిని కాదు లేపించాల్సింది... మనలోనే ఉన్నారు వెధవలు... రామంగాడు తెచ్చాడు చూడు ఆనంద్‌గాడ్ని... ఇన్‌స్పెక్టరేమో మన్ని వెళ్ళిపొమ్మంటుంటే వాడేమో నీతిమంతుడిలా- తప్పుచేశాం, శిక్షవేయండి -అంటాడా? రామంకు వార్నింగ్ ఇచ్చాను, ఇంకెప్పుడూ అలాంటి వెధవల్ని తీసుకు రావద్దని. వాళ్ళు ఆనందించలేరు, మరొకరు ఆనందిస్తుంటే చూస్తూ ఊరుకోలేరు!' ' అన్నాడు వెంకట్ కోపంగా.

★ ★ ★

సాయంత్రం ఆరవుతుండగా ఫోన్ వచ్చింది. అప్పుడు ఆనంద్ ఒంటరిగా ఉన్నాడు ఇంట్లో. అమ్మ అమ్మమ్మ గారింటికి వెళుతుందో కొంపకు వస్తుందో తెలియదు. నాన్న ఎన్నింటికి వస్తాడో అస్సలు తెలియదు. ఏడు గంటలదాకా చూసి హోటల్‌కు వెళ్ళి భోజనం చేద్దాంలే అనుకున్నాడు చికాగ్గా.

ఫోనెత్తితే అటునుంచి శ్యామల. "ఏమిటి కాలేజీకి రావటం లేదు. ఎనీ ప్రాబ్లమ్? "

"నో ప్రాబ్లమ్...!"

"నువ్వు క్లాసులు ఎగ్గొడుతుంటే ఆనందంగా ఉంది తెలుసా? " అంది నవ్వుతూ.

"సంతోషం!" అన్నాడు ఆనంద్.

తనెప్పుడూ తన ఇంటి విషయాలు ఆ అమ్మాయికి చెప్పలేదు. నాలుగు రోజుల క్రితం జరిగిన ఆ డ్రగ్స్ గోల, స్టేషన్‌లో కూర్చోపెట్టడంతో మనస్సంతా అస్తవ్యస్తమవ్వగా కాలేజీకి రెండురోజులు వెళ్ళలేదు. వెళ్ళిన రోజుల్లో శ్యామలను లంచ్‌లో కలిసినా తీరిగ్గా మాట్లాడుకున్నదీ లేదు.

"క్రితం సారి ఇంటర్నల్‌లో నువ్వు ఫస్టు న్నావు... నేను సెకండ్ ఉన్నాను... ఈసారైనా మన పొజిషన్లు మారతయ్యేమోనని!" అన్నది మరోసారి నవ్వుతూ.

శ్యామల నవ్వుతుంటే అతడికి హాయిగా ఉన్నట్లనిపిస్తుంది.

"ఆనంద్! వచ్చే ఆదివారం నా పుట్టిన రోజు. మా ఇంట్లో చిన్న పార్టీ ఇవ్వాలని... తప్పకుండా రావాలి...!"

"ష్యూర్... తప్పకుండా! ఇంకా నాలుగు రోజులు ఉన్నదిగదా!"

"నువ్వు ఆరోజు ఎలాంటి ప్రోగ్రాం పెట్టుకోవద్దనే ముందుగా చెబుతున్నది!"

"గతేడాది చేసుకున్నట్లు లేదు"

"నాకు ప్రతి సంవత్సరం అలవాటేగాని,

క్రితం సంవత్సరం మొదట్లోనే కదా నాన్న పోయింది... అందుకే అలాంటిదేమీ పెట్టుకోలేదు!" అన్నది దిగులుగా శ్యామల.

"సారీ! నేను మర్చిపోయాను!"

"ఈ సంవత్సరం కూడా చేసుకుందామనుకోలేదు... అమ్మే ప్రపోజ్ చేసింది. బహుశా నాకు నాన్న లేడనే దిగులు తప్పించటానికే కావచ్చు. ఘనంగా కాకపోయినా సింపుల్‌గా చేసుకుందాం, బాగా స్నేహంగా ఉండే వాళ్ళనే పిలువు అని మరీ మరీ చెప్పటంతో, సరే అన్నాను!" చెప్పింది చాలా లోగొంతుకతో.

"నా ఆనందంకోసం కాకున్నా ఆమెను తృప్తి పరిచేందుకైనా చేసుకోవాలి!" అంది.

"నీకంటే వయస్సులో మరీ పెద్దవాడిని కాకపోయినా.. తరచూ ఎదురుదెబ్బలు తింటుండే నేను జీవితంలో నేర్చుకున్న పాఠం ఒక్కటే... సుఖసంతోషాలు క్షణికాలే. అవే శాశ్వతమని పట్టుకు వేలాడితే మనకు దక్కేది వ్యథే!"

"ఇంజనీరింగ్ రెండో సంవత్సరంలోనే వేదాంతివై పోతున్నావంటే కాస్త వయస్సు వచ్చేటప్పటికి హిమాలయాల్లోకి జేరిపోవు గదా!" అంది పకపకా నవ్వుతూ.

"అక్కడ నాకు ఇక్కడికంటే ఎక్కువ ఆనందం దొరుకుతుంది అనుకుంటే తప్పకుండా వెళ్ళిపోతాను!" అన్నాడు ఆనంద్.

"ఆనంద్!" అతడి మాటలు అర్థంగాక ఆవేశపడింది. పేలవంగా నవ్వాడతడు.

"పుట్టినందుకు నాకూ జీవితాన్ని ఆనందించాలనే ఉన్నది... కాని పరిస్థితులు ఎదురు తిరుగుతుంటేనే అలాంటి ఆలోచనలు వచ్చేది! ఓకే డోన్ట్ వర్రీ... వెళ్ళటం అంటూ జరిగితే నీకు చెప్పకుండా వెళ్ళనులేగాని, ఆదివారం తప్పకుండా వస్తా!" అన్నాడు మాట మారుస్తున్నట్లుగా.

శ్యామల తల్లి ఆ జిల్లా సెషన్స్ జడ్జి. ఆమె భర్త యాక్సిడెంట్‌లో పోయాడు, తను ఇంజనీరింగ్ కాలేజీలో జేరిన కొత్తల్లోనే. అప్పటికింకా తనకు శ్యామలతో అంతగా పరిచయం లేదు.




సాయంత్రం నాలుగు గంటల యాభై నిముషాలయింది. కోర్టుహాలంతా నిశ్శబ్దంగా ఉన్నది. న్యాయమూర్తి అప్పటి వరకూ విన్న వాదనల సారాంశాన్ని, తన నిర్ణయాన్ని రాసుకుంటున్నారు.

హాల్లో రెండు వైపులా ఉన్న బోన్లలో దమయంతి, శశాంక నిలబడి ఉన్నారు.

వాదనలు పూర్తవ్వటంతో వారి తరఫు న్యాయవాదులు తమ కుర్చీలలో కూర్చున్నారు, న్యాయమూర్తి చెప్పే తీర్పును వినేందుకు ఆసక్తిగా ఎదురుచూస్తూ.

న్యాయమూర్తి తలెత్తారు. "కేసు పూర్వాపరాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే భార్యా భర్తలిద్దరూ అనుమానాలతోనూ, అపోహలతోనూ విభేదించుకుంటూ విడాకులు కావాలని కోరుకుంటున్నట్లు అర్థమవుతోంది... నలభై, నలభై అయిదు సంవత్సరాల మధ్య వయస్సులో అందునా ఇరవై సంవత్సరాలు కలిసి కాపురం చేసిన తరువాత విడిపోవటమనేది అపకారమే చేస్తుందిగాని, మేలు చేస్తుందనుకోను... అందుకే వాళ్ళకు ఆలోచించుకునేందుకు ఒక అవకాశం ఇవ్వాలనే ఉద్దేశ్యంతో ఆరునెలల గడువు ఇస్తున్నాను... అప్పటికీ వాళ్ళ అభిప్రాయాన్ని

మార్చుకోలేకపోతే విడాకులు మంజూరు చేస్తాను!" ఆ మాటలు చెబుతూనే కోర్టు అయిపోయిందన్నట్లుగా, లేచి నిలబడ్డారు.

ఆ క్షణంలోనే, "సార్! నా మాట ఒక్కటి వినండి!" ప్రేక్షకులలో కూర్చున్న ఓ యువకుడు లేచి పెద్దగా అరిచాడు.

న్యాయమూర్తి నుదురు ముడివేసి అతడి వంక చూచాడు.

బోనులలో ఉన్న దమయంతి, శశాంకలే కాకుండా లాయర్లతోపాటు హాల్లో ఉన్న అందరూ అతడి వంక చూశారు.

"వెంటనే వాళ్ళు విడిపోవటానికే మీరు అనుమతిని ఇవ్వండి సార్!"

"నువ్వెవరు ఆ మాట చెప్పటానికి? " విసురుగా అన్నాడు జడ్జి కూర్చుంటూ.

## కొత్తగాలి...

**కొబ్బరాకూ**
**స్వర్ణకారే!**
**నీటి బిందువుల్ని**
**ముత్యాలుగా చేస్తోంది!**

– అడ్డూరి వెంకటరమణ,
విజయవాడ

కోర్టు హాల్లో నిశ్శబ్దమేర్పడింది.

అందరి చూపులూ ఆ యువకుడిమీదే ఉన్నాయి. శశాంక, దమయంతులు కూడా అతడినే చూస్తూండిపోయారు.

న్యాయమూర్తి సౌమ్యంగా అడిగాడు. "చెప్పు... నువ్వెవరు? నువ్వెందుకు కోరుకుంటున్నావ్ వాళ్ళు విడిపోవాలని? "

"నేను వారిద్దరూ కన్న కొడుకుని!" అన్నాడు ఆనంద్ తలవంచుకొని.

అతడి మాటలు వింటూనే కోర్టుహాల్లో అందరూ ఉలిక్కిపడ్డట్లుగా చూచారు.

"నీ తల్లిదండ్రులు విడిపోతే నువ్వు పొందే లాభమేమిటి? "

"మనశ్శాంతి!" అంటూనే అక్కడ ఎవ్వరినీ చూడటం ఇష్టం లేదన్నట్లుగా కళ్ళు మూసుకున్నాడు.

"తల్లిదండ్రుల నీడలో ఉంటేనే పిల్లలకు మనశ్శాంతి... ఎనీ హౌ... నీ మనస్సులోని మాటలు గూడా విన్న తరువాతే నిర్ణయానికి వస్తాను... కేసును వచ్చేవారం ఇదే రోజుకు వాయిదా వేస్తున్నాను!" అంటూ ఆయన లేచి నిలబడ్డాడు.

ఆనంద్ పక్కనే ఉన్న ప్రశాంత్ ఆనంద్ చేతిని పట్టుకొని, 'ఆవేశపడబోకు' అన్నట్లుగా నొక్కాడు.

తెల్లవారేటప్పటికి వార్తా పత్రికలు అన్నింటిలోనూ ప్రముఖంగా ప్రచురింపబడింది ఆ వార్త- 'కన్నకొడుకే తల్లిదండ్రులు విడిపోవాలని కోరుకుంటున్న వైనం!' అంటూ పెద్దపెద్ద అక్షరాలతో. దమయంతి, శశాంకల ఫోటోలే కాకుండా ఆనంద్ ఫోటో కూడా ప్రచురించారు.

నగరంలో అదొక సంచలన వార్తయింది. ఆనంద్‌తోపాటు ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతున్న కుర్రవాళ్ళు చాలామంది అతడిని గుర్తుపట్టారు. మరునాడు బస్సు దిగుతుంటే విచిత్రంగా అతడివంక చూడసాగారు. శ్యామలయితే అతడి వైపుకు వడివడిగా వచ్చి కలిసింది.

"ఏమైంది? " అన్నది అతడినే చూస్తూ.

"ఏ విషయం? " అన్నాడు తల తిప్పి.

అతడు ఆరోజు పేపరేదీ చూడలేదు.

"నిన్న కోర్టులో!" అన్నది చిన్నగా గొణుగుతున్నట్లుగా.

"అప్పుడే నీదాకా వచ్చిందా? " అన్నాడు ఆమెనే కళ్ళు పెద్దవి చేసుకు చూస్తూ.

"నా దాకా రావటంలో వింతేమున్నది... పేపర్లలోని ఆ వార్తను చూస్తూనే అమ్మ అడిగింది... 'ఈ పిల్లవాడు మీ కాలేజీలోనే సెకండ్ ఇయర్ చదువుతున్నాడట... నీకు

తెలుసా' అని.. ఫోటో చూస్తూనే ఆశ్చర్య పోయాను... ఎప్పుడూ మాటమాత్రం అన లేదు నాతో, ఇంట్లో అంతగా గొడవలు జరుగుతున్నాయని. అమ్మకు నువ్వు నా క్లాసేనని.. ప్రతి పరీక్షలోనూ మేమిద్దరమే క్లాసులో మొదటి రెండు స్థానాల్లోనూ ఉంటామని చెప్పాను. అప్పుడు అమ్మే అంది ఒకసారి మనింటికి తీసుకు రాగూ డదూ పరిష్కారమేమన్నా దొరుకుతుం దేమో అని!" క్లాసుకు టైం అవ్వటంతో వడి వడిగా అడుగులు వేస్తున్నారు ఇద్దరూ.

ఆనంద్ వెళ్ళి రోజూ కూర్చుండే బెంచి మీద కూర్చున్న రెండు నిముషాలలోనే రామం వచ్చి పక్కన కూర్చున్నాడు. లెక్చ రర్ లేకపోతే ఎప్పుడూ గోలగోలగా ఉండే క్లాసు నిశ్శబ్దంగా ఉండటంతో ఆనంద్ తలెత్తి ఓసారి చూసి తల వంచుకున్నాడు. అందరి దృష్టి తనమీదే ఉండటంతో అత ని ముఖమంతా ఎర్రబడిపోయింది. శరీ రంలోని నరాలన్నీ ఆవేశంతో జివ్వుమంటు న్నట్లే అనిపించింది. చటుక్కున లేచి నిల బడ్డాడు, ముందున్న పుస్తకాలను చేతి లోనికి తీసుకుంటూ. రామం పరిస్థితి గ్రహించి ఆనంద్ చేతిమీద చేయివేశాడు కూర్చో అన్నట్లుగా. అతడు పట్టించుకో లేదు. బయటకు వచ్చి, అక్కడి నుంచి పారిపోవాలి అన్నంత ఆత్రంగా రోడ్డెక్కే శాడు. అందరూ తనవంక అలా చూస్తుంటే సహించలేకపోయాడు.

★ ★ ★

సాయంత్రం కాలేజీ అవుతుండగానే శ్యామల ఆనంద్‌కు ఫోన్ చేసింది. ఆమె కావాలనే అప్పటివరకూ ఆగింది. అలజ డికి లోనయిన మనస్సు కుదుటపడాలంటే కొంత సమయం పడుతుంది. ప్రశాంతంగా ఉన్నప్పుడే మనస్సు మరొకరి హితవచనా లను స్వీకరించగలుగుతుంది.

"ఏం చేస్తున్నావ్? "

"ఏం చేయాలో తెలీని స్థితిలో ఉన్నా"

"ఒంటరిగా కూర్చున్నంత మాత్రాన సమస్యలన్నీ తీరిపోయేటట్లయితే ఏ మని షికీ సమస్య అనేదే ఉండదు. అమ్మ రమ్మ నమన్నదని చెప్పాను గదా.. రాత్రికి వచ్చేయ్. ముగ్గురం కూర్చొని చర్చించి, పరిష్కారం ఏమిటో ఆలోచిద్దాం!"

"పరిష్కారమేమున్నది... వాళ్ళు విడిపో తారు... విడిపోతేనన్నా బాగుపడతారనేది నా ఆశ. అమ్మకు వాళ్ళమ్మానాన్నా ఉన్నారు. ఈయనకు మూడొస్తే తన తల్లినీ తండ్రినీ వృద్ధాశ్రమం నుంచి తీసు కువస్తాడు. ఇంత వయస్సు వచ్చిన వాళ్ళ బుర్రలకు మరొకరి మాట ఎక్కదు. వాళ్ళకు తోచిందే న్యాయం, ధర్మం.."

"ఎంత మొండివాడినైనా మార్చే శక్తి కాలానికి ఉన్నది... అందుకే జడ్జిగారు ఆరునెలలు సమయమిచ్చింది!"

'తాగుబోతుకూ, తలపొగరు మనిషికీ సంధి కుదర్చటమంటే తాత పిలకను అవ్వ మోకాలికి ముడివేయటం లాంటిది!' శ్యామల ఆలోచన అంత బాధలోనూ అత డికి నవ్వు తెప్పిస్తోంది.

"ఇంకా వాళ్ళను కలిసి ఉండమనటం అంటే నన్ను శాశ్వత మానసిక రోగిగా చేయటమన్నమాటే... అదా నీకోరిక? "

"అలా ఎందుకు అనుకుంటావ్ ఆనం ద్? మన పరిచయం రెండేళ్లది.. నువ్వే మిటో నాకు తెలుసు.. నేనేమిటో నీకు తెలుసు. మనం స్నేహితులం. పరస్పరం గౌరవించుకోవడంలోనే మనకు ఆనందం లభిస్తుందనేది నా నమ్మకం! ఆవేశంతో ఏ నిర్ణయం తీసుకోగూడదు. న్యాయ మూర్తి సలహా వింటేనే బాగుంటుంది. సాయంత్రం మా ఇంటికి రా. అమ్మ అభి ప్రాయం తెలుసుకుందాం!" శ్యామల దృఢంగా అంది.

"నువ్వూ న్యాయమూర్తి కూతురివే... నీ

ఆలోచన మరో విధంగా ఉంటుందని ఎలా అనుకుంటాను! ఆయన వారం వాయిదా వేయటమే నేను భరించలేకపోతున్నా"

"నేనెంత న్యాయమూర్తి కూతుర్నైనా స్వంత వ్యక్తిత్వం లేదంటావా... మనస్సు లేదంటావా... ఆలోచించే శక్తిలేదంటావా? " అందామె రోషంగా.

"నాకు నీతో వాదించే శక్తి లేదు!"

"ఇవి ఫోన్లమీద చర్చించే విషయాలు కాదులే.. ఎనిమిది గంటలకు మా ఇంటికి వస్తున్నావ్ నువ్వు!"

"సారీ.. రెండు రోజులదాకా ఎక్కడికీ రమ్మనొద్దు... కాలేజికి గూడా రాను... ఈరోజు క్లాసులో చూశావుగదా... అంతా ఎలా చూచారో... ఆ అవమానాన్ని భరించలేకనే బయటకు వచ్చేసింది!"

శ్యామల ఓ నిట్టూర్పు విడిచింది. "సరే అయితే... రాత్రికి రావద్దులే... ఆదివారం ఎలాగూ వస్తావు కదా... అప్పుడు మాట్లాడదాం అమ్మతో!" అతడికి మరో మాటకు అవకాశమివ్వకుండా ఫోన్ కట్ చేసింది.

★ ★ ★

బాగా పొద్దుబోయింది. ఆనంద్ ఒంటరిగా తన ఇంట్లో గోడమీద వెలుగుతున్న దీపాన్నే కళ్ళు తెరుచుకు చూస్తూ పడుకొని ఉన్నాడు. తల్లి అమ్మమ్మ గారింటికే వెళ్ళి ఉంటుంది. వారం రోజులుగా రావటం లేదు. ఆయనకేం మహారాజు. శుభ్రంగా తాగి, ఏ అర్థరాత్రప్పుడో తయారవుతాడు. తనకోసమే అన్నం వండుకోవాలి. ఏమీ తినాలని అనిపించటం లేదు. గుండెనిండా ఒంటరివాడిని అనే దిగులు ఆవరించగా నీరసించిపోయాడు.

కాలింగ్ బెల్ మోగింది.

తాగుబోతు తండ్రేననుకుంటూ గోడ గడియారం వంక చూచాడు ఆనంద్. సరిగ్గా పది గంటలయింది. విసురుగా తలుపు తీశాడు. ఎదురుగా రామం!

"అదేమిటి ఈవేళప్పుడు వచ్చావ్!"

ఇద్దరూ లోపలకు వచ్చారు. సోఫాలో పక్కన పక్కన కూర్చున్నారు.

"ఛండాలమైన పని చేశాను... ఇప్పుడు బాధపడి లాభంలేదు. కొన్నాళ్ళు తలవంచుకోక తప్పదు!" అన్నాడు రామం.

ఆనంద్ మాట్లాడలేదు.

"నేను చెడిపోయిన మాట వాస్తవం... కాని నిన్ను కూడా ఆ ఊబిలోకి దింపానే అని బాధగా ఉన్నది. నీ దిగులుని, వేదననూ చూసి కాస్తంత సరదాగా గడిపితే మనశ్శాంతి లభిస్తుందేమోనని అక్కడకు తీసుకువెళ్ళాను... ఇప్పుడు ఆలోచిస్తుంటే ఘోరమైన తప్పిదమే చేశాననిపిస్తోంది. ఒక విధంగా నీ జీవితంతో ఆడుకున్నానా అని భయమేస్తోంది!"

"డోంట్ వర్రీ! అయిపోయింది గదా... ఇంకా దాన్ని గురించి ఎందుకు? "

"నేను దాదాపు ఏడాదిగా వాళ్ళతో తిరుగుతున్నా. సరే, నా సంగతి వదిలేయ్... ఇప్పుడు నీ గురించే ఆలోచిస్తున్నది!" అన్నాడు మిత్రుడిని సూటిగా చూస్తూ.

"నా గురించి ఆలోచించేందుకు ఏమున్నది? నేను ఆ కూపంలోకి ఎట్టి పరిస్థితులలోనూ కాలు పెట్టను. నువ్వూ దానికి దూరంగా ఉంటే ఎంతో సంతోషిస్తాను!"

"ఇన్‌స్పెక్టర్ నీకు ఇంతకుముందే తెలుసా? " ఆత్రంగా అడిగాడు రామం.

"లేదు. ఎందుకలా అనుకున్నావ్? "

కళ్ళు చికిలిస్తూ అడిగాడు ఆనంద్.

"నేను వాళ్ళకు అదే చెప్పాను. అసలు అక్కడకు మాతో వచ్చేంత వరకూ ఎందుకు తీసుకువచ్చానో కూడా నీకు తెలియదని. కానీ నా మాటలు రాజు, వెంకట్, రాగిణిలు నమ్మటం లేదు. నన్ను నానా తిట్లు తిట్టారు. నువ్వు పోలీసు మనిషివని, నీమీద కక్ష తీర్చుకోవాలలనుకుంటున్నారు. రెండేళ్ళ బట్టీ మేం డ్రగ్స్ తీసు

కుంటున్నా మా జోలికి ఇంతవరకూ ఎవ్వడూ రాలేదు. ఈ రోజునే పోలీసులు వచ్చారంటే వాళ్ళకు ఉప్పందించింది నువ్వే ననే గట్టి నమ్మకం వాళ్ళకి!"

"నా వల్లనే జరిగిందని ఎందుకనుకో వాలి? ఇంకా చంద్రశేఖరం ఉన్నాడు.. సుదర్శనంకు తెలియదా.. తన గదిలో ఏం జరుగుతున్నదో? ఆ ఇంటి ఓనరు పసి గట్టి ఉండడనా ఇంతవరకూ ఆ సంగతి!"

"మేం ప్రతిసారీ ఒకచోటే కూర్చోం. ఇంటి ఓనర్‌కు, సుదర్శనానికి అనుమాన మొచ్చే అవకాశమే లేదు. అందునా ఆ గదిలో ఇదే మొదటిసారి. చంద్రశేఖరం

## కొత్తగాలి...

**లక్షల్లో**
**లంచాలు**
**ఎక్సైజ్‌శాఖ**
**ఎదిగి పోయింది**

– పి.వి.ఎస్. ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

గురించి ఆరా తీయాలి గాని, వాళ్ళ అను మానమంతా నీమీదే ఉండటానికి మరో కారణం- నిన్న కోర్టులో మీ అమ్మా నాన్నా విడాకుల కేసు జరుగుతున్నప్పుడు ఇన్‌స్పె క్టర్ నీ పక్కనే ఉండటం... నీకు అంతకు ముందు అతడు తెలియకపోతే నీకు ఆస రాగా ఎందుకొచ్చాడనేది వాళ్ళ వాదన!" దిగులుగా అన్నాడు రామం.

"రామం! నేను నిజాయితీగా చెబుతు న్నాను... ఆరోజు పోలీస్ రెయిడ్‌కూ నాకు ఎలాంటి సంబంధం లేదు!"

"నాకు తెలుసురా ఆ విషయం. వాళ్ళను నమ్మించలేకపోయాను. నన్ను గూడా కొట్టినంత పనిచేశారు. దానికితోడు ఆరోజు ఇన్‌స్పెక్టర్ మనల్నందరినీ వెళ్ళిపొ మ్మంటే నువ్వేమో శిక్ష పడాల్సిందేనన్న ట్లుగా మాట్లాడావ్. అది కూడా వాళ్ళ కోపానికి మరింత ఆజ్యం పోసింది!"

"సరే అనుమానించనివ్వు. మనం చేయ గలిగిందేమున్నది!" అన్నాడు కాస్తంత నిర్ల క్ష్యంగా ఆనంద్. "మనం తప్పు చేయన ప్పుడు బాధ పడాల్సిన అవసరం లేదు!"

"అనుమానించి వదిలేస్తే ఫరవాలేదు. నీకు హాని చేస్తారేమోనని భయం!" చటుక్కున తలవంచుకున్నాడు రామం.

"అంటే? "

"ఏమైనా చేయవచ్చు. నలుగురిలో అవ మానించవచ్చు.. శారీరకంగా హింసించ వచ్చు.. వాళ్ళు ఒట్టి వెధవలు!"

రామం ముఖం ఆ మాటలంటున్న ప్పుడు నల్లగా మాడిపోయింది. "వాళ్ళ దగ్గర ఉన్న డబ్బు వాళ్ళను అంత మూర్ఖ లుగా చేసింది... వాళ్ళకు తోచిందే సరై నది అనుకునే తత్వం వాళ్ళది!"

ఆ గదిని భయంకరమైన నిశ్శబ్దమావ రించింది. మౌనంగా ఉండిపోయారిద్దరూ.

"ఇంతకీ ఇన్‌స్పెక్టర్ ఆ కోర్టుకొచ్చి నీ పక్కనే ఎందుకున్నాడో చెప్ప లేదు!"

"ఆ ఆవరణలో చాలా కోర్టులున్నాయి. అక్కడ ఆయనకేదో కేసు ఉండి వచ్చి అది వాయిదా పడటంతో వెళుతూ, నన్ను చూసి వచ్చాడు. అప్పటికే మా అమ్మా నాన్న కేసులో వాదోపవాదాలు పూర్తవ్వగా జడ్జిగారి తీర్పుకోసం ఎదురు చూస్తున్నాం అంతా. అప్పుడు కేసు విషయాలు అడు గుతూ నా పక్కన కూర్చున్నాడు!"

రామం లేచి నిలబడ్డాడు. "ఏది ఏమైనా నువ్వు జాగ్రత్తగా ఉండాలి!" జాలిగా చూస్తూ వెళ్ళిపోయాడు.

★ ★ ★

మూడురోజుల తరువాత ఇంట్లో ఒంట

రిగా కూర్చోవటం మహా భారమనిపించగా కాలేజీకి బయల్దేరాడు ఆనంద్. ఉదయం, సాయంత్రం శ్యామల ఫోన్ చేస్తూనే ఉన్నది. అంతకుముందు ఒక్క చదువు విషయమే మాట్లాడేది. ఇప్పుడు పర్సనల్ విషయాలు బయటపడటంతో ఆమె మనస్సు పూర్తిగా అతడిమీద జాలితో నిండిపోయింది.

“ఒంటరిగా కూర్చుంటే మనస్సు పాడై పోతుంది ఆనంద్... కాలేజీకి వచ్చి చదువులో పడితే కొంత హాయిగా ఉంటుంది. ఎప్పుడూ నలుగురూ నాలుగు విధాలుగా ప్రతివాడి గురించి మాట్లాడుకుంటూనే ఉంటారు. వాళ్ళను చూసీ చూడనట్లుగా వదిలేయటమే! వాళ్లకోసం నీ చదువు పాడుచేసుకోవద్దు. నేను నీకు ఆత్మీయంగా చెబుతున్న మాటలు ఇవి!” అనేది ఫోన్‌లో ఆమె తరచూ.

ఆనంద్ శ్యామల మాటల్ని తోసిపుచ్చ లేకపోయాడు.

బస్సు దిగింతరువాత ఎవరూ తనతో మాట్లాడలేదు. ఒకళ్ళిద్దరు నిశితంగా తన వంక చూచినా తల తిప్పేసుకున్నాడు. అందరూ హడావుడిగా క్లాసుల్లోకి వెళుతున్నారు. అ కాంపౌండ్‌లోనే కాలేజీ బిల్డింగ్ ముందు ఒక పెద్ద వేప చెట్టుంది. అక్కడే సైకిల్ స్టాండు, స్కూటర్ స్టాండు. డబ్బులుండి, చదువుమీద శ్రద్ధలేని కొందరు ఎప్పుడూ ఆ చెట్టుకింద గట్టుమీద కూర్చొని వచ్చిపోయే వాళ్ళను మాటలతో ఎగతాళి చేస్తుంటారు. విమర్శిస్తుంటారు. ఆడపిల్లల్నయితే వెకిలి మాటలతో కించపరుస్తుంటారు. అమాయకులను ర్యాగింగ్ చేయటం అంటే మహా సరదా వాళ్ళకు! ఆ గ్యాంగ్‌కు నాయకులు వెంకట్, రాజు! మిగతా వాళ్ళంతా వందిమాగధులు!

ఆనంద్ తల వంచుకొని ఆ చెట్టును దాటుతున్నాడు.

“ఆరేయ్ ఆనంద్! ఇటు రారా!”

అది రాజు గొంతని తెలుస్తూనే ఉన్నది.

ఆనంద్ వినిపించుకోనట్లుగా అడుగులు వేయసాగాడు.

“నిన్నేరా పిలిచేది... వినబడటంలేదా!”

ఆనంద్ తలగూడా తిప్పలేదు. రామం సలహా గుర్తున్నది.

“కోర్టులో అంత హీరోలా అరిచినవాడివి, మమ్మల్ని చూసి పిల్లిలా పారిపోతావేం? రా.. కాసేపు కబుర్లు చెప్పుకుందాం!”

మరో అడుగు ముందుకు వేస్తునే ఉన్నాడు, ఎప్పుడు వెంకట్ వచ్చాడో తెలియదు.. ఆనంద్ చొక్కా కాలర్ పట్టుకొని, “స్నేహితులు పిలుస్తున్నా వినబడలేదంటే... చెవుడొచ్చిందన్నమాట... మిషిన్ పెట్టిస్తాం పద!” అన్నాడు.

“కోర్టులో ఏమని అరిచాడురా? ” ఎవడో అడిగాడు వెకిలిగా నవ్వుతూ వెనుకనుంచి.

“వాళ్ళ అమ్మకూ, నాన్నకూ విడాకులిచ్చేయమంటూ కోర్టులో కేకలు పెట్టాడు కదా... ఏదో ఒకటి చేసి ఫొటో పేపర్లో వేయించుకోవాలనుకున్నాడు. అరేయ్ నీ కోరిక తీరిందిగదా. నన్ను కొట్టరా... రాజుగాడు ఫొటో తీసి పేపరుకు పంపిస్తాడు... అదీ వస్తుంది... మన కాలేజీకే హీరోవయిపోతావ్... చూడుచూడు... ఇదే సమయం... ఇటే అమ్మాయిలు గూడా చూస్తున్నారు!” అన్నాడు ఒంగుంటూ.

ఆనంద్‌కు అర్థమయింది- వాళ్లు కావాలనే గొడవ పెట్టుకుంటున్నారని. రామం చెప్పింది నిజం. అప్పటికే చాలామంది వాళ్ళ చుట్టూ జేరారు.

“ఒరేయ్! ఇవాల్టినుంచి నాకూ, వెంకట్‌కి నువ్వు నోట్సులవీ రాసిపెట్టాలి... గుడ్ బాయ్‌వి కదా... నువ్వు చెడు చేయవ్... చెడు చూడవ్... చెడు మాట్లాడవ్. ఎవరైనా చేస్తున్నా పోలీసుల్ని పిలుచుకు వస్తావ్... అన్నీ బుద్ధిమంతుడి లక్షణాలే

కదరా నీవి... కనుక నాన్నా! మా పుస్తకా లన్నీ తీసుకువెళ్ళి, చెప్పినట్లు చెయ్!" రాజు తన చేతిలోని పుస్తకాలను ఆనంద్‌ను తీసుకోమన్నట్లుగా ముందుకు జాచాడు.

"రాయకపోతే అయిదింటికి క్యాంటిన్ కిచెన్‌కి తీసుకువెళ్ళి చికెన్‌లా కాల్చుకు తింటాం!" అన్నాడు గుసగుసగా వెంకట్.

ఆనంద్ కోపాన్ని నిగ్రహించుకోలేకపో యాడు. ఒక్కసారిగా చేయెత్తి వెంకట్ ముక్కు పగిలేలా ఒక్కగుద్దు గుద్దాడు.

"ఏమిటిరా వాగుతున్నావ్. మీ నోట్సులు రాయాలా... లేకపోతే చికెన్‌లా కాల్చుకుతింటారా!" అంటూనే పక్కనే ఉన్న రాజు మోకాలిమీద ఫట్‌మని తన్నాడు బలమంతా ఉపయోగించి.

రాజూ, వెంకట్ నేలమీద బోర్లా పడిపో యారు గిలగిలలాడుతూ. వెంకట్‌కయితే ముక్కమ్మట నెత్తురు ధారగా కారుతు న్నది. రాజు లేవలేకపోతున్నాడు. అక్క డేదో గొడవవుతుందేమోనని స్టూడెంట్స్ వడివడిగా క్లాసుల్లోకి వెళ్లిపోయారు.

ఆనంద్ ఇంకొక్కక్షణం అక్కడ ఉండ లేదు. క్లాసులోకి వెళ్ళిపోయాడు. వాళ్ళ ఆగడాలను మొక్కలోనే తుంచకపోతే మానయింతరువాత తనేం చేయలేడు.

★ ★ ★

శనివారం సాయంత్రం ఆరుగంటల ప్పుడు చక్రవర్తి కారు వచ్చి సెషన్స్ జడ్జి శాంతకుమారి ఇంటి పోర్టికోలో ఆగింది. మరుక్షణంలోనే డ్రైవర్ దిగి, వెనుక తలుపు తీసి పట్టుకు నిలబడ్డాడు.

లాన్‌లో చెట్లకు నీళ్ళు పోస్తున్న పని వాడు వచ్చాడు.

"అమ్మగారున్నారా? " అడిగాడు డ్రైవరు.

అతడు 'ఉన్నారు' అన్నట్లుగా తల ఊపు తుండగానే వెనుక సీటులో కూర్చొని ఉన్న వ్యక్తి దిగి, పనిమనిషి దారి చూపిస్తుండగా లోపలకు వచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"అమ్మగారికి చెప్పి వస్తాను... తమరి పేరు? " వినయంగా అడిగాడు అతడు.

వెనగ్గా బొకే పట్టుకొచ్చిన డ్రైవరు, "చక్ర వర్తిగారు వచ్చారని చెప్పు!" అంటూ చేతి లోని బొకేను ఆయన ముందు టీపాయ్ మీదపెట్టి-బయటకు వెళ్ళిపోయాడు.

చక్రవర్తి హుందాగా తలెత్తి, ఆ ఇంటిని, అందులోని అలంకరణను చూస్తూ కూర్చు న్నాడు. హాలు మధ్యలో ఓ పెద్ద ఫొటో, దానికి తాజాగా ఉన్న పూలదండ! చనిపో యిన ఆమె భర్తఫొటోనేమో అనుకున్నాడు.

★ ★ ★

సరిగ్గా ఆ సమయంలోనే- తల నొప్పిగా ఉండటంతో ఆనంద్ టీ తాగివద్దామని ఇంటికి తాళంవేసి బయటకు వచ్చాడు. అక్కడకు అయిదు నిముషాల దూరంలో ఉన్నది హోటలు.

కాలేజీలో చివరి క్లాసు అవ్వగానే బయ టకు వస్తూ ఒక్కసారి అటూ ఇటూ చూచాడు. వేపచెట్టు కింద ఎవ్వరూ లేరు. అంటే ఆ వెధవలంతా కాలేజీ వదిలి రోడ్ల మీద పడ్డారన్నమాట. చీకటి పడగానే ఏ పబ్‌లోనో, బార్‌లోనో జేరతారు. మందుల మజాలో మునిగిపోతారు అనుకున్నాడు.

తల వంచుకునే రోడ్డు పక్కగా నడుస్తు న్నాడతను. అది చాలా ఇరుకు సందు. అయినా రిక్షాలు, ఆటోలు, కార్లు అతి వేగంగా పాదచారుల మీదుగా దూసుకుపోతున్నాయి. వాటికి తోడు పక్కన మురుగు కాలువ. ఈ పేటకు అండర్‌గ్రౌండ్ డ్రైనేజ్ ఎప్పటికి వస్తుందో తెలియదు. నివాసితుల సౌకర్యాలను పట్టించుకునే నాథుడే లేడు!

ఆలోచనలతో అన్యమనస్కంగా నడు స్తున్న అతడి వెనగ్గా, ఓ జీపు అతి వేగంగా వచ్చి క్షణాలల్లో అతడిని ఒక్క ఊపు ఊపేసి ముందుకు దూసుకుపో యింది... దాని తాకిడికి నిలదొక్కుకోలేని

అతడు ఎగిరి పక్కగా పారుతున్న మురుగు కాలవలో పడిపోయాడు!

★ ★ ★

"చక్రవర్తిగారు వచ్చారు" అని పనివాడు చెబితే శాంతకుమారికి ఆయనకు తనతో పనేమిటో అర్థం కాలేదు. రెండు మూడు సార్లు నగరంలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలలో వేదికమీద ఆయనను కలసిన పరిచయం ఉన్నది.

అప్పుడు సాయంత్రం ఆరున్నరయినా ఇంకా వేడిగాలులు వీస్తూనే ఉన్నాయి. ఆమె గంట క్రితం కోర్టునుంచి వచ్చి రిలాక్స్ అవుతోంది. రెండు నిముషాల తరువాత ఆలోచనలతో మేడమీద నుంచి శాంతకుమారి దిగుతుండగానే చక్రవర్తి లేచి నిలబడి, "నమస్కారమండీ!" అంటూ రెండు చేతులూ జోడించాడు.

"నమస్కారం!" అంటూ ఆమె అతడి ఎదురుగా సోఫాలో కూర్చుంటుండగానే, తన ముందున్న బొకేను తీసుకొని ఆమెకు ఇస్తూ, "ఇదే మొదటిసారి మీ గృహంలో కాలు పెట్టటం!" అంటూ అందించాడు.

ఆమె దాన్ని చిరునవ్వుతో అందుకొని టీపాయ్ మీద పెట్టి "చెప్పండి... కాఫీ, టీ, కూల్ డ్రింక్!"

చక్రవర్తి రెండు చేతులూ జోడించి, "నాకు ఏ అలవాటూ లేదు... రెండు గంటలకు భోజనం చేస్తా. మళ్ళా రాత్రికే భోజనం. మధ్యలో ఏవీ తీసుకోను!"

"మా ఇంటికి తొలిసారిగా వచ్చిన మిమ్మల్ని మర్యాద చేయటం నా విధి!"

"అయితే కాస్త సుగర్‌వేసిన మజ్జిగ తెప్పించండి!" అన్నాడు చిరునవ్వుతో.

సరిగ్గా ఆ సమయంలోనే మేడ మీద నుంచి శ్యామల కిందకు దిగుతున్నది. ఆ అమ్మాయి స్నేహితురాళ్ళతో కలిసి షాపింగ్‌కు వెళ్ళే కార్యక్రమం పెట్టుకున్నది. క్షణంలోనే గమనించాడు ఆ అమ్మాయి ఆవిడ కూతురేనని. తల్లి పోలిక.

## చతురలో మొదటి నవల



### పి.ఎస్. నారాయణ

గుంటూరు జిల్లా మంగళగిరికి పక్కనే ఉన్న చినకాకానిలో డెబ్బై నాలుగేళ్ల క్రితం నేను పుట్టాను. 1957లో గుంటూరు హిందూ కళాశాలలో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి, ఐదేళ్లు రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లో పనిచేశాను. తర్వాత ముప్పై సంవత్సరాలు కేంద్ర ప్రభుత్వ సంస్థ ఐ.డి.పి.యల్‌లో వివిధ స్థాయిలలో ఉద్యోగం చేసి, 1993లో సీనియర్ అకౌంట్స్ ఎగ్జిక్యూటివ్‌గా ఉద్యోగ విరమణ చేశాను. గత యాభై ఏళ్లుగా కథలు, నవలలు రాస్తున్నాను. ఇప్పటికి రెండు వందల ఎనభై కథలు, ముప్పై నాలుగు నవలలు రాశాను. అందులో అనేక కథలు, నవలలు వివిధ పత్రికలు నిర్వహించిన పోటీలలో బహుమతులు పొందాయి. కొన్ని కథలు కన్నడ, తమిళ భాషల్లోకి అనువాదమయ్యాయి. మానసిక విశ్లేషణతో కూడిన రచనలు, సస్పెన్స్‌తో కూడిన ధారావాహికలు రాయటం నాకిష్టం. 'చతుర'లో నా మొదటి నవల ప్రచురితమవుతున్నందుకు ఆనందంగా ఉంది.

చిరునామా :
పి.ఎస్. నారాయణ
8-3-168/20/బి/7, సిద్దార్థ నగర్(ఉత్తరం)
ఎ.జి. కాలనీ దగ్గర
హైదరాబాద్ - 500038

"మీ అమ్మాయేనా? " కన్ఫరమ్ చేసుకోవటానికి అన్నట్లుగా అడిగాడు.

"అవునండీ... నాకు ఒక్కతే కూతురు!"

"ఏం చదువుతున్నది? "

చెప్పింది.

"అరె... మా అమ్మాయీ ఆ కాలేజీలోనే చదువుతున్నది. ఆఖరి సంవత్సరం. నీకు తెలుసా అమ్మా, రాగిణి!"

శ్యామల ఒక్క క్షణం ఆలోచిస్తున్నట్లుగా ఆగి, "చూశాను గాని, పరిచయంలేదు. అన్ని కల్చరల్ ప్రోగ్రాములలోనూ పాల్గొం టుంటుంది గదా!" అన్నది.

"అవునమ్మా. దానికి అవంటే మహా పిచ్చి. ఇక మా పెద్దవాడున్నాడు... వాడికి అవేం పట్టవ్. మీ కాలేజీలోనే ఐదేళ్ళ కిందట ఇంజనీరింగ్ చదివాడు కాని పూర్తి చేయలేదు. నా వ్యాపారాల్లో ప్రవేశించి విజయవంతంగా నిర్వహిస్తున్నాడు!" అన్నాడు మెరుస్తున్న కళ్ళతో చక్రవర్తి.

"నిజమేనండి.. వాళ్ళ ఆసక్తిని బట్టే మనం నడుచుకోవాలి. నేను మా అమ్మాయిని డాక్టరు చేయాలనుకున్నాను... కానీ, అది ఉత్సాహం చూపించలేదు!"

శ్యామల వెళ్ళిపోయింది, "వెళతాను అంకుల్! మా ఫ్రెండ్స్ వెయిట్ చేస్తుం టారు నాకోసం!" అంటూ మర్యాదపూర్వ కంగా చక్రవర్తికి చెప్పి.

వంటమనిషి గాజు గ్లాసుతో మజ్జిగ తీసుకువచ్చి ఆయన ముందు పెట్టింది.

ఆ గ్లాసును చేతిలోకి తీసుకుంటూ, "మీకో శ్రమ ఇవ్వాల్సిన పనిబడింది..." అన్నాడు చిరునవ్వుతో చక్రవర్తి. "మా పిల్ల లకీ, నాకూ మేలుచేసే రెండు పనులు చేయబోతున్నాను. అందులో ఒకటి మన నగరానికి నడిబొడ్డున ఓ ఫైవ్‌స్టార్ హోటల్ కట్టాలనుకున్నాను, కట్టాను... అది పిల్లల వ్యాపారంలో ఒక భాగమవు తుంది. రెండోది, ముఖ్యమయినది, మన నగరానికి కాస్తంత దూరంలో పదెకరాల స్థలంలో అనాథశ్రమం నిర్మించాలనుకు న్నాను... నిర్మించాను... అది నాకు!" అని కళ్ళు మూసుకున్నాడు తన్మయంగా.

"అదేమిటి? " అన్నది శాంతకుమారి వింతగా ఆయనవంకే చూస్తూ.

"అదంతే.. మనం ఎంతోమంది అనా థల్ని చూస్తున్నాం. ముఖ్యంగా చిన్న వయస్సులో నా అనేవాళ్ళులేని వాళ్ళను. వాళ్ళందరినీ ఒక చోటజేర్చి వాళ్లు అనా థలు కాదు, భావి భారతపౌరుల్లో వాళ్ళూ భాగమే- అని నిరూపించాలనుకున్నాను. నాకూ వయస్సు వస్తుండటంతో నలుగు రికీ పనికి వచ్చే వ్యాపకాన్ని పెట్టుకోవటం మంచిదనిపించింది. ఈ సేవలో మన స్సుకు శాంతీ లభిస్తుందని ఆశ. అందుకే ఆ ఆశ్రమంలోనే చిన్న కుటీరం ఏర్పరుచు కొని మా ముసలి దంపతులం ఉండాలని, మనిషిగా పుట్టిన మనకు డబ్బు సంపాదనే ధ్యేయం కాగూడదనేది నా నమ్మకం!"

"మీ వయస్సు ఎంతని అప్పుడే ఆధ్యా త్మిక చింతనలోకి వెళ్ళిపోతారు... పిల్లలు నిలదొక్కుకునే దాకా పెద్దవారిగా మీరే వ్యాపారాలన్నీ చూస్తుండాలి. అమ్మాయి ఇంకా కాలేజీలోనే ఉన్నదంటుంటిరి!"

"ఉద్యోగులకు అరవైదాటగానే విశ్రాంత జీవితాన్ని ఇస్తూ ప్రభుత్వం ఎంతో మేలు చేసిందంటాను. వ్యాపారులమైన మేము మాత్రం విశ్రాంత జీవితంలోని ఆనందాన్ని ఎందుకు పొందకూడదు? చచ్చేదాకా పిల్లల కోసం ప్రాకులాడటం విజ్ఞత కాదు!"

శాంతకుమారి నవ్వింది. "ఎనీ హౌ! మీకు నా అభినందనలు!"

"అభినందనలు చెప్పటం కాదు..నేను నిర్మించిన ఆ ఆశ్రమాన్ని మీరు ప్రారం భించాలి. హోటలంటారా ఏ వ్యాపార స్థుడో, రాజకీయనాయకుడో వచ్చి ప్రారంభి స్తాడు, అది పూర్తిగా వ్యాపారానికి సంబం ధించినది కనుక! నేను చేద్దామనుకుం టున్న మంచిపనికి ఓ మంచి మనిషి

రిబ్బన్ కత్తిరిస్తే ఏ ఆశయంతో అది ప్రారంభిస్తున్నానో అది నెరవేరుతుంది!"

"అటువంటిదాన్ని ఏ ధార్మిక సంస్థ నిర్వాహకుడో ప్రారంభిస్తే ఉత్తమంగా ఉంటుందిగదా!"

"న్యాయమూర్తులూ ఉత్తమ వ్యక్తులే! అందుకనే మిమ్మల్ని ఎన్నుకున్నది! మీకు వీలున్నరోజునే ఆ కార్యక్రమాన్ని నిర్ణయిస్తాను. మీరు, అమ్మాయి కూడా రావాలి. మా అమ్మాయి రాగిణికి స్నేహితులన్నా, వారితో గడపటమన్నా ఎంతో ఇష్టం!" చక్రవర్తి లేచాడు, చేతులు జోడిస్తూ.

★ ★ ★

పదకొండు గంటలయింది. సూర్యుడు మండిపోతున్నాడు. ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ సెల్ మోగింది. "అంకుల్! నేను ఆనంద్‌ని.. కిరణ్ ఇంట్లోనే ఉన్నాడా?"

"ఉన్నాడు... పనేమైనా ఉన్నదా?"

"ఒకసారి నిర్మలా నర్సింగ్ హోమ్‌కు పంపగలరా అంకుల్!"

"దేనికి? అక్కడెందుకున్నావ్ నువ్వు?"

"రాత్రి నాకో చిన్న యాక్సిడెంట్ అయింది. కొద్దిగా సాయం కావాల్సి వచ్చింది!" అన్నాడు పేలవపు నవ్వుతో.

"యాక్సిడెంటా? ఎలా అయింది?" ఆదుర్దాగా అడిగాడు ప్రశాంత్.

"సీరియస్ కాదులేండి. రోడ్డుపక్కన నడుస్తున్న నన్ను ఓ జీపు రాసుకుంటూ వెళ్ళటంతో పక్కనే ఉన్న గుంటలో పడిపోయాను. నాకేం తెలియని స్థితిలో ఎవరో ఈ నర్సింగ్‌హోంలో జేర్చారు. నర్సింగ్ హోంలో డబ్బు కట్టమంటే, మీ అనుమతిలేకుండానే మీ పేరు చెప్పి, ఉదయాన్నే కడతానని అన్నాను. ఏటీఎమ్ కార్డు నా పర్సులోనే ఉన్నది. కిరణ్‌వెళ్ళి డబ్బు తీసుకు వస్తాడని!" అన్నాడు.

"కిరణ్‌ను తీసుకొని నేనూ వస్తున్నాను!" ప్రశాంత్ ఫోన్ పెట్టేశాడు.

★ ★ ★

ఆనంద్ కిరణ్ కోసం ఫోన్ చేసిన అర గంటకు శ్యామల ఫోన్ చేసింది. యాక్సిడెంట్ అయిన విషయం శ్యామలకు చెప్పటం అతడికి ఇష్టంలేదు. ఆరోజు ఆదివారం అవ్వటంతో పుట్టినరోజు హడావుడిలో ఉంటుంది. తనకు ఇలా జరిగిందని తెలిస్తే కంగారుపడవచ్చు.

"లేచినప్పటినుండి ఫోన్ చేస్తావేమోనని ఎదురు చూస్తున్నాను!" శ్యామల కంఠంలో నిష్ఠూరం తొంగి చూస్తోంది.

"నేను చేస్తానని చెప్పానా?" అన్నాడు ఆమె మాటలు వింతగా తోచగా.

కొద్ది క్షణాలపాటు అటుపక్క నిశ్శబ్దం.

**కొత్తగాలి...**

**ఊరి నిండా**
**సిమెంటు రోడ్లే**
**గోధూళి**
**ఏ గాలికి ఎగిరిపోయిందో!**

– మేరెడ్డి యాదగిరిరెడ్డి,
నల్గొండ

"బుద్ధూ! ఇవ్వాళ నా పుట్టిన రోజని మర్చిపోయావా!" అన్నది ఫక్కున నవ్వి. ఆ అమ్మాయికి ఆ మాట గుండెలోతుల్లోనుంచి వచ్చింది. "శుభాకాంక్షలు చెబుతావని ఆశపడ్డాను!"

"చెబుదామనుకున్నాను గాని చిన్న అవాంతరం వచ్చి చెప్పలేకపోయాను... ప్రస్తుతం ఆసుపత్రిలో ఉన్నాను!" అన్నాడు చిన్నగా, కారణం చెప్పక తప్పకపోవటంతో. ఈ రోజు కాకపోయినా రేపయినా తెలుస్తుంది. తను కాలేజీకి వెళ్ళటానికి రెండు మూడు రోజులు పట్టవచ్చు!

తల్లిదండ్రులకు చెప్పాలనిపించలేదు.

చెప్పినా వాళ్ళు వస్తారనే నమ్మకం లేదు.

"ఏమైంది? ఆసుపత్రిలో ఎందుకు న్నావ్? " శ్యామల పెద్దగా అరిచింది.

"టీ తాగుదామని హోటల్‌కు వెళుతుంటే చిన్న గుంటలో జారిపడ్డాను. కాలు విరిగిందేమోనని భయమేసి ఇక్కడ ఓ చిన్న నర్సింగ్‌హోంలో జేరానుగాని అలాంటిదేమీ జరక్కపోవడం అదృష్టం. కంగారు పడబోకు... సాయంత్రం నీ పుట్టిన రోజు ఫంక్షన్‌కు వస్తున్నాను!" అన్నాడు జరిగిందేదో చాలా చిన్న సంఘటన అన్నట్లుగా.

"ఆనంద్! నాతోనైనా నిజాలు చెప్పటం నేర్చుకో... చీకట్లో చిన్న గుంటలో కాలేస్తేనే ఆసుపత్రిలో జేరాల్సి వస్తుందంటే నమ్మను... ఎవరైనా కొట్టారా? "

కాలేజీలో గొడవ ఆమెకు తెలుసు.

"సరేలే! ఇతరులు చెప్పిన మాటలను నమ్మటం నేర్చుకుంటేనే మనస్సులు ప్రశాంతంగా వుండేది... ఇక ఆ విషయం మరిచిపోగాని... నీకు నా జన్మదిన శుభాకాంక్షలు. వందేళ్ళు ఆనందంగా పిల్లాపాపలతో సుఖంగా ఉండాలని మనసా, వాచా కోరుకుంటున్నాను. డాక్టర్‌గారు వస్తున్నారుగాని తరువాత మాట్లాడతానులే!"

"నర్సింగ్‌హోం ఎక్కడ? నేనొస్తా.."

"శ్యామలా! ఈ రోజు నీ పుట్టినరోజు. నువ్వు వెళ్లాల్సింది గుడికి, నర్సింగ్‌హోంలకు గాదు. బై!" ఫోన్ పెట్టేశాడు ఆనంద్.

సరిగ్గా ఆ సమయంలోనే ప్రశాంత్, కిరణ్ ఆ గదిలో కాలు పెట్టారు.

"చెప్పు! ఏమైంది? ఇప్పుడు చెబుతున్నాడు కిరణ్... నిన్న కాలేజీలో గొడవ జరిగిందట కదా!" అడిగాడు ప్రశాంత్ అతడి మంచానికి దగ్గరగా వస్తూనే.

అవునన్నట్లు నవ్వాడు ఆనంద్.

"రాజూ, వెంకట్ కదూ..."

"కావాలని కవ్వించి, గొడవ పెట్టుకున్నారు...!" ఆయనకు జరిగింది చెప్పకుండా ఉండటంలో అర్థం లేదనిపించింది.

"ఆరోజు మీరు రెయిడ్ చేసి, మమ్మల్ని అందరినీ పట్టుకోవటానికి కారణం నేనేనని వాళ్ళ నమ్మకం. మొట్టమొదటిసారిగా నేను వాళ్ళతో కలసి కూర్చున్న రోజునే మీరు రావటం కాకతాళీయమే అయినా వాళ్ళు నమ్మటంలేదు. మీరు నాకు ముందే తెలుసని వాళ్ళను నేనే పట్టించానని.."

"సో.. నేను వాళ్ళను చివాట్లు పెట్టి వదిలేసి తప్పు చేశానన్నమాట. ఇప్పటికే కొంత సమాచారం సేకరించాను. వాళ్ళకు డ్రగ్స్ సప్లయ్ చేస్తున్న వాళ్ళ ఆచూకీ తెలుసుకునే ప్రయత్నంలోనే ఉన్నాను. వాళ్ళు ఈసారి నీ జోలికి వస్తే చెప్పు... లోపల పడేసి తోమితేగాని సరైనదారిలో పడరు!" సీరియస్‌గా అన్నాడు ప్రశాంత్.

"మీరంతా జేరిన ఆ గదిలో అద్దెకుండే సుదర్శనాన్ని గూడా నిన్న స్టేషన్‌కు పిలిపించాను. అతడు ఈ విషయంలో అమాయాకుడనే అనిపిస్తోంది. ఆ రాత్రి మేం వచ్చి మిమ్మల్నందరినీ జీపులో ఎక్కించుకెళ్ళటం చూచిన ఆ ఇంటి యజమాని అతడిచేత వెంటనే గది ఖాళీ చేయించాడు!"

ప్రశాంత్ ఎప్పుడూ కూల్‌గానే ఉంటాడు. సామాన్యంగా ఎవరినీ శారీరకంగా హింసించడు. అందునా చదువుకుంటున్న వాళ్ళనయితే మరీను!

"సరే నిన్ను జీపు గుద్దింది ఎక్కడో చెప్పు!" అన్నాడు వెళ్ళటానికి లేస్తూ.

★ ★ ★

సాయంత్రం అయిదయింది. ఆసుపత్రి నుంచి ఇంటికి వచ్చి పడుకున్నాడన్నమాటే గాని, కాలి మడమ దగ్గర నొప్పి తగ్గక పోగా కొద్దిగా వాచినట్లే అనిపిస్తోంది. నడవటానికి ఇబ్బంది పడుతున్నాడు.

అప్పుడు శ్యామల మరలా ఫోన్ చేసింది. "బయల్దేరుతున్నావా? "

"తప్పదా? "

"అది నీకు తెలియాలి!"

"సరే! నేనిప్పుడు ఇంటి దగ్గరే ఉన్నాను. అరగంటలో వస్తా. మీ గేటు దగ్గర ఆటో దిగగానే కాల్ చేస్తాను. బయటకు రా!"

"గేటు దగ్గరకల్లా వచ్చి ఆహ్వానించాలా, సారూ!" అన్నది హుషారుగా.

"కాదు. లోపలకు రావటానికి నీ సాయం కావాలంటున్నా!" నవ్వుతూ అన్నాడు ఆనంద్.

అవతల ఫోన్ ఆగిపోయింది. అతడు ఎన్నిసార్లు శ్యామల కోసం ప్రయత్నించినా స్విచ్ఆఫ్‌లో ఉన్నట్లుగా వస్తున్నది. అతడికి అర్థమయింది శ్యామల ఏ క్షణానయినా అక్కడకు రావచ్చని!

అనుకున్నట్లే తరువాత ఇరవై నిముషాలలోనే శ్యామల అతడి ముందున్నది!




సరిగ్గా వారం రోజుల తరువాత ఆదివారం. ఉదయం పదిగంటలు. ఎండ అంతగా లేదు. క్రితం రాత్రి కురిసిన వానకు రోడ్లన్నీ తడితడిగా ఉన్నాయి. ఆ నగరానికి అయిదు కిలోమీటర్ల దూరంలో ఓ మామిడితోట. చుట్టూ ముళ్ళకంచె... ఓ పక్కగా కొబ్బరి చెట్లు, పనస చెట్లు... మరోపక్క అరటి తోటలు...

శాంతకుమారి, శ్యామలా వచ్చారు. రాగిణి వాళ్ళింటికి వెళ్ళి తమ కారులోనే వాళ్ళిద్దరినీ తీసుకు వచ్చింది ఆ తోటకు. ఆ రోజు పదకొండు గంటలకు అనాథాశ్రమం ప్రారంభానికి ముహూర్తం.

కారు ఆగుతుండగానే చక్రవర్తి వడివడిగా కారు దగ్గరకు వచ్చాడు. "నమస్కారమండీ! నాకు చాలా సంతోషంగా ఉన్నది... ఎంత మంచి పనిచేయాలనుకున్నా ముందు దాని ప్రారంభానికి మంచి మనస్సున్న మనిషి దొరకటం కూడా కష్టమే... మీరు అంగీకరించి రావటం నా అదృష్టం!" అంటూనే కూతురు వైపుకు తిరిగి, "వీరికి మన తోటంతా చూపించు. చూడండి మేడమ్! ఈ తోట నా స్వార్జితం కాదు... పిత్రార్జితం... నాన్న లేకపోయినా ఆయన జ్ఞాపకార్థంగా ఒక మంచిపని చేయాలనే సదుద్దేశ్యంతో ఈ ఆశ్రమాన్ని నడపాలకుంటున్నాను. వచ్చే అతిథులను నేనిక్కడ ఉండి ఆహ్వానిస్తుంటాను. మీ ముగ్గురూ వెళ్ళి మా నాన్న ఈ తోటను ఎంత అద్భుతంగా తీర్చిదిద్దాడో చూచి రండి!" అన్నాడు సంతోషంగా చక్రవర్తి.

తోట చాలా బాగుంది. పనివాళ్ళు చెట్ల కుదుళ్ళు శుభ్రంచేసి నీళ్ళు పెడుతున్నారు.

"సీజన్ వస్తే మార్కెట్‌కు పచ్చడి మామిడికాయలు, పండ్లూ మా తోటనుంచే ఎక్కువగా వెళతాయి. అటు చూడండి మేడమ్... పనస, జామ, దానిమ్మచెట్లు.. కుడివైపున మల్లె పొదలు... ఓ పక్కగా పెద్ద దిగుడు బావి... దానికో మోటరు... పక్కనే ఎత్తుగా నీళ్ళ ట్యాంకు... ఇవన్నీ వీరి తాతగారి హయాంలో ఏర్పరిచినవే!" వాళ్ళతో వచ్చిన ఆ తోటను నిర్వహిస్తున్న వ్యక్తి చెప్పాడు. అతడికి ముప్ఫయి ఏళ్ళు ఉంటయి. పేరు శ్రీరామమూర్తి. బాపట్ల అగ్రికల్చరల్ కాలేజిలో బీఎస్సీ చదివాడు. చక్రవర్తికి దూరపు బంధువవ్వటంతో, నమ్మకంగా ఉంటాడని తెచ్చి పెట్టాడు.

కొబ్బరిచెట్ల దగ్గరకు వస్తుండగానే అక్కడున్న మనిషికి సైగ చేయటంతో కొబ్బరి

బోండాలు కొట్టి, నీరు గాజు గ్లాసుల్లో పోసి తెచ్చిచ్చాడు. వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ తాగటం పూర్తవుతుండగానే ఓ కుర్రవాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు "సార్ రమ్మంటున్నారు!" అంటూ.

శాంతకుమారి చేతి గడియారం చూసుకున్నది. పదకొండు గంటలకు పది నిముషాలు తక్కువ. అందరూ షామియానా దగ్గరకు వచ్చారు. అక్కడ ఓ వందదాకా కుర్చీలు వేసి ఉన్నాయి.

"ఈ ప్రపంచం ఎలా ఉన్నదంటే హోటల్ ప్రారంభానికి ఆహూతులు లెక్కకుమించి వచ్చారు. కారణం ఒక సినీనటి, ఓ రాజకీయ నాయకుడు దాన్ని ప్రారంభించారు కనుక. ఇక్కడకు యాభై మంది కంటే ఎక్కువ రారని ముందే అనుకున్నాను. ధార్మిక కార్యక్రమాలకు ఆసక్తి చూపే మనుష్యులు ఈరోజుల్లో కరువయ్యారు, ఏదో మీలాంటివాళ్ళూ, నాలాంటి వాళ్ళూ తప్ప. అందుకే సంస్కృత పండితులు, మా గురువుగారు సుందరాచారిగారిని వచ్చి నన్ను ఆశ్వీదించమని కోరాను. దానికి ఆయన సంతోషించి వచ్చారు!" అంటూ సుందరాచారిని పరిచయం చేశాడు చక్రవర్తి.

ముహూర్తం వేళకు శాంతకుమారి ఆ ఆశ్రమ ద్వారానికి కట్టిన రిబ్బన్‌ను కత్తిరించింది. రాగిణి ప్రార్థనాగీతంతో కార్యక్రమం ప్రారంభమయింది.

ముందుగా చక్రవర్తి ఈ ఆశ్రమం స్థాపించటంలోని తన ఆశయాలను వివరించాడు. "మా తండ్రి జ్ఞాపకార్థమే ఇది చేస్తున్నా. దేవాలయాల ముందు, నాలుగు రోడ్ల కూడళ్ళలోనూ తిరుగుతున్న పదేళ్ల లోపు అనాథపిల్లల్ని చూస్తుంటే గుండె తరుక్కుపోతున్నది. వాళ్ళలోనూ రత్నాలు, మాణిక్యాలు ఉండవచ్చని, సానపడితే అత్యద్భుతమైన విజ్ఞానవంతులే అవుతారనే నమ్మకంతో నా వంతు చేయూతనివ్వాలని నిర్ణయించుకున్నాను. వాళ్ళను తీసుకువచ్చి, ఉండటానికి వసతి ఏర్పరిచి, చదువు చెప్పించి ఈ సమాజానికి అందించాలనేదే నా ధ్యేయం. నా లక్ష్యం నిర్విఘ్నంగా జరిగేలా ఆశీర్వదించాలని మా గురువుగారిని, మన జిల్లాకే పేరు తెస్తున్న న్యాయమూర్తి శాంతకుమారిగారిని వేడుకుంటున్నాను!" అంటూ వాళ్ళిద్దరికీ నమస్కరించాడు.

వారిద్దరూ కూడా ఆయన చేస్తున్న పనిని మెచ్చుకుంటూ మాట్లాడారు. సభ అయ్యేటప్పటికి పన్నెండున్నరయింది. లంచ్ తరువాత బయల్దేరుతుండగా చక్రవర్తి శాంతకుమారితో "మీతో ఒక్క విషయం మాట్లాడాలి!" అన్నాడు పక్కన ఎవరూ లేకుండా చూచి.

"చెప్పండి! ఏమైనా మీ ఆలోచన అద్భుతం... డబ్బున్న వాళ్ళంతా ఇలా చేస్తారో లేదో తెలియదు గాని... ఇది నిజంగా అభాగ్యులకు వరమే!"

ఆయన ముసిముసి నవ్వులతో, "ఇందులో నేను చేస్తున్నదేమీ లేదు, మేడమ్! ఈతోట, ఈ ఆస్తి అంతా మానాన్న ఇచ్చినవే.. ఈ కార్యక్రమమేదో ఆయన పేరుమీదే ఆయన నడుపుతున్నట్లుగానే చేయటం నా ధర్మంగా భావించి చేస్తున్నాను. మంచిపేరు వస్తే అది నాకు

## కొత్తగాలి...

**అమ్మ ఒక నిజం ఆనాడు**
**అమ్మ కూడా అబద్ధం నేడు**
**గర్భసంచీలు అద్దెకిచ్చే**
**కిరాయి అమ్మలొచ్చారుగా!**

*– అయినాల కనకరత్నాచారి,*
*కొరిశపాడు, ప్రకాశం జిల్లా*

గాదు, మా నాన్నకే చెందుతుంది!"

"ఎనీ హౌ... ఆలోచన మీది కాబట్టి అభినందనలు మీకే చెందుతాయి!"

"నాకో చిన్న సాయం కావాలి మేడమ్!" అన్నాడు చాలా చిన్నగా. "చొరవ తీసుకుంటున్నానని అపార్థం చేసుకోవద్దు. పూర్తి మానవత్వంతో కోరుతున్న కోరిక అది!"

"చెప్పండి" అన్నది తలెత్తి, 'ఈ ఆశ్రమానికి డొనేషన్ ఏదైనా ఇవ్వమంటాడేమో?' అనుకుంటూ.

"మీ చేతిలో పనే! మా వీరభద్రుడు ఓ హత్య కేసులో ఇరుక్కొని మీ ముందు దోషిలా నిలబడివున్నాడు. వాడిభార్య ఆ దిగులుతోనే మంచాన పడింది. పిల్లలు ఇంకా చేతికందిరాలేదు. వాడు మా ఊరి మనిషి. చిన్నప్పటి నుంచి మా ఇంట పెరిగిన వాడు. వాడికి కాస్తంత మడిచెక్క ఉన్నది. వాడిని ఎలాగైనా తప్పిస్తే దాన్ని పొందవచ్చనేది వాడి బంధువుల ఆశ. కోర్టులో వాదనలు అయిపోయినయి అని తెలిసింది. ప్రత్యర్థుల ఉచ్చులో పడి వాడు గిలగిలలాడుతున్నాడు. కొంత జుల్మానాతో వాడ్ని తమరు బయటపడేస్తే మీకు జీవితాంతం రుణపడి ఉంటాడు. వాడిని భార్యా పిల్లలతో తీసుకు వచ్చి ఇక్కడే ఈ ఆశ్రమంలో శేషజీవితమంతా ప్రశాంతంగా గడిపేలా చేయాలనేది నా కోరిక!" ఏకబిగిన చెప్పాల్సిందంతా చెప్పాడు చక్రవర్తి.

శాంతకుమారి ముఖంలో రంగులు మారాయి.

"చూడండి చక్రవర్తిగారూ! నా విధుల విషయంలో నేను బయట మాట్లాడను. వాటిల్లో మరొకరు సలహాలివ్వటం నాకిష్టం ఉండదు. నన్ను మన్నించండి. ఇలాంటి విషయాలు మాట్లాడి నాకు ఇబ్బంది కలిగించవద్దు!" రెండు చేతులూ జోడించి నవ్వుతూ, ఇక బయల్దేరతాం అన్నట్లుగా చెప్పింది.

తోట మధ్యలోనుంచి రాగిణి, శ్యామలా నవ్వుకుంటూ వస్తున్నారు.

చక్రవర్తి శాంతకుమారినే తదేకంగా చూస్తూ రెండు చేతులూ జోడించాడు అసంకల్పితంగా!

★ ★ ★

హోటల్ చంద్రిక! సమయం సాయంత్రం ఆరు గంటలు...

చక్రవర్తి నెల రోజుల క్రితం ఆర్భాటంగా, ఓ సినీనటితో ప్రారంభింపచేసిన హోటల్ అది. అందులోని నాలుగో ఫ్లోర్ లోని బఫే హాల్‌లో విందు. అంతా ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థులే!

పార్టీ ఇస్తున్నది చక్రవర్తి ముద్దుల కూతురు రాగిణి! మూడు రోజుల క్రితం జిల్లా అందాలపోటీలో ప్రథమస్థానం పొందిన ఆమె తన స్నేహితులతో సరదాగా గడుపుతున్నది. అందరూ హుషారుగా ఎగురుతున్నారు, పాడుతున్నారు. వాళ్ళలో వెంకట్, రాజు, చంద్రశేఖర్, రామం తదితరులున్నారు. శ్యామలా వచ్చింది!

క్రితం సాయంత్రం కాలేజీ అయిపోయిన తరువాత బయటకు వస్తున్న సమయంలో రాగిణి పట్టుకున్నది శ్యామలను.

అనాథాశ్రమ ప్రారంభోత్సవానికి వెళ్ళినప్పటి నుంచి ఇద్దరికీ స్నేహం కలిసింది. కాలేజీలో పలకరింపు మాటలు. ఆ చనువుతోనే ఆ పార్టీకి ఆహ్వానించింది.

శ్యామలకు ఒంటరిగా ఇలా హోటళ్ళలో పార్టీలకు వెళ్ళటం అలవాటు లేదు. ఏదైనా ఫంక్షన్‌కు వెళ్ళినా తల్లితోపాటే వెళుతుంది. రాగిణి ఆహ్వానించినప్పుడు రానని చెప్పలేకపోయింది.

ఆ రాత్రి తల్లితో ఆ విషయం చెప్పినప్పుడు ఆమె ఆలోచిస్తున్నట్లుగా ఉండిపోయింది. కూతురు నలుగురితో కలిసి తిరగటం తప్పులేకపోవచ్చుగాని, అక్కడికి

వచ్చే వాళ్ళు ఎలాంటి వాళ్ళో తెలియదు. అదీగాక ఆహ్వానించిన రాగిణి చక్రవర్తి కూతురవ్వటం అసహనంగా ఉంది.

"ఎనిమిది తరువాత ఉండబోకు. నేను కోర్టునుంచి రాగానే కారు తీసుకు వెళ్ళు!" అని స్పష్టంగా చెప్పింది.

శ్యామల ఆ హాల్లో కాలు పెడుతుండగానే రాగిణి ఎదురువెళ్ళి చేయిపట్టుకొని లోపలకు తీసుకువచ్చింది. అందరికీ పరిచయం చేసింది. పరిచయం లేకపోయినా కాలేజీలో అంతా ఆమెను చూసినవాళ్ళే. శ్యామలది ప్రతి ఒక్కరికీ చూడాలనిపించే అందం. రాగిణికి ఏ మాత్రమూ తీసిపోదు. అందుకే తేలిగ్గా గుర్తించారు.

అక్కడ జేరిన ఆడపిల్లలందరూ వివిధ రకాల డ్రస్సుల్లో ఉన్నారు. శ్యామల ఒక్కతే చీర కట్టుకున్నది. ఆకాశం రంగులో ఉన్న దానిమీద నక్షత్రాల్లా మెరుస్తున్న బంగారు రంగు తళుకులు. అదే రంగు జాకెట్టు. పొడవైన, ఒత్తయిన జుట్టును జడగా అల్లుకొని మల్లెపూలు పెట్టుకున్నది. ఆమె ఆ హాల్లోని దీపాల కాంతిలో ఓ దీపంలా వెలిగిపోతోంది.

వెంకట్, రాజు ముందుకు దూసుకు వచ్చారు. "మీ స్నేహితురాలితోపాటు మీరూ అందాలపోటీలో ఎందుకు పాల్గొనలేదు?" వెంకట్ చేయిజాస్తూ అడిగాడు రాగిణి పరిచయం చేయగానే.

శ్యామల నవ్వేసి ఊరుకున్నది.

"చెప్పండి శ్యామలగారు... మిత్రురాలికి పోటీ అవ్వటం ఇష్టం లేకపోయిందా?" రాజు చొరవగా అడిగాడు.

"దాన్దేమున్నది పోటీ పడటంలోనే అందమున్నది... ఎంతమంది పాల్గొన్నా స్పోర్టివ్‌గానే తీసుకుంటాను... ఎక్కువమంది నడుమ గెలవటమే తృప్తిగా ఉంటుంది. ఈసారి పోటీకి శ్యామలను నేనే తయారు చేస్తాను!" అన్నది రాగిణి శ్యామల చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

"అలాంటి వాటిల్లో పాల్గొనటం నాకు ఇష్టంలేదు... చదువే ముఖ్యం!" అన్నది ముభావంగా శ్యామల.

అంతమంది మధ్యలో అలా నిలబడి మాట్లాడటమే ఇబ్బందిగా ఉంది. అసలు అక్కడకు వెంకట్, రాజూలాంటివాళ్ళు వస్తారని ఊహించలేదామె.

బేరర్లు ట్రేలో డ్రింక్స్ పట్టుకొని తిరుగుతున్నారు. వాళ్ళచేతుల్లో ఉన్న ట్రేలలోని గ్లాసులు చూస్తుంటే శ్యామలకు మహా చికాకు వేసింది. అర్థమయింది వాటిల్లో ఏమున్నదో. ఆమెను మరింత విస్మయపరిచింది ఆ గ్లాసుల్ని అందుకుంటున్న వాళ్ళల్లో కొందరు ఆడపిల్లలూ ఉండటం!

హాలంతా సువాసనలతో నింపిన ఫ్రెష్‌నర్ నడుమ కూడా ఆల్కహాల్ వాసన గుప్పుమంటోంది. మరో బేరర్ ట్రేలో ఆరెంజ్, యాపిల్ జ్యూస్ పట్టుకొని వచ్చాడు. రాగిణే స్వయంగా శ్యామలకు ఓ ఆరెంజ్ గ్లాసు తీసి చేతికిచ్చింది.

వెంకట్, రాజు ఆమెను వదిలిపెట్టలేదు. పక్కనే అవీ ఇవీ మాట్లాడుతూ అక్కడే నిల్చున్నారు. వెకిలి జోకులు వేస్తూ ప్రతీ దానికీ అతిగా నవ్వుతున్నారు. శ్యామల కావాలనే వాళ్ళనుంచి దూరంగా వెళ్ళి, తన లాగానే జ్యూస్ తాగుతున్న మరో అమ్మాయి పక్కన నిలబడింది.

"మీరూ మా కాలేజేనా?" అడిగింది శ్యామల, మరీ మౌనంగా నిలుచున్నా బోరు కొడుతుందనే ఉద్దేశ్యంతో.

నేను ఇంజనీరింగ్ చేయటం లేదండి. బీకాం చదువుతున్నాను సీఏ చేయాలని. మా కజిన్ రాగిణికి క్లాసుమేటే కాకుండా మంచి స్నేహితురాలు.. అదుగో అక్కడ మాట్లాడుతున్న సుస్మిత.. ఇవ్వాళ అసలు విజయవాడ వెళ్ళవలసినదాన్ని... దాని బలవంతంతోటే వచ్చాను!" అన్నది

చిన్నగా నవ్వుతూ.

ఆ అమ్మాయి నలుపే అయినా పెద్ద కళ్ళతో నవ్వుతుంటే బాగుంది.

"నా పేరు శ్యామల! మీ పేరు?"

"వనజ!"

ఇద్దరూ లోకాభిరామాయణంలో పడిపోయారు. చుట్టూ ఉన్న అందరూ ఎవరి గోలలో వారున్నారు. వాళ్ళతో సమానంగా రాగిణీ ఎగురుతున్నది. తాగుతున్న ఆరెంజ్ జ్యూస్ చాలా రుచికరంగా ఉన్నట్లనిపించింది శ్యామలకు. ఖాళీ గ్లాసును ట్రేలో పెట్టి మరోగ్లాసు అందుకుంది "చాలా బాగున్నదండి" అంటూ వనజతో.

వనజా మరో గ్లాసు తీసుకున్నది.

ఎనిమిదింటికి డిన్నర్ మొదలయింది. భోజనం చేస్తూ గూడా వాళ్ళు అనుకున్నారు తాము తాగిన డ్రింక్ చాలా రుచికరంగా ఉండటమే కాదు శరీరానికి బహు ఉత్తేజాన్ని కలిగిస్తున్నదని!

శ్యామలకు రాత్రి ఇంటికి వెళ్లాక కూడా ఉల్లాసంగా ఉన్నట్లనిపించింది. పరీక్షల ముందు అది తాగితే టెన్షన్ లేకుండా రాయవచ్చు రేపు రాగిణిని అడిగి తెలుసుకోవాలి అది ఏ బ్రాండ్ జ్యూసో!

★ ★ ★

రాత్రి పదకొండు గంటలు. ప్రశాంత్ సెల్ మోగితే చికాగ్గా ఆన్ చేశాడు.

"ప్రశాంత్ గారేనా?" అవతలి కంఠం చాలా హడావుడిగా అడిగింది.

"అవును. ఎవరు మాట్లాడుతున్నది?"

"పొన్నూరు రోడ్డు మీదకు విజయవాడ వైపు నుంచి బైపాస్ రోడ్డుమీదుగా ఓ లారీ వస్తోంది. అది బాపట్ల వైపుకు వెళుతుంది. అందులో లక్షల విలువచేసే ఎర్రచందనం దుంగలున్నాయి"

"ఎవరు మాట్లాడుతున్నది?"

"ఈదేశ పౌరుణ్ణి!" ఫోన్ కట్టయింది.

నంబరు చూచాడు. ల్యాండ్‌లైన్ నుంచి వచ్చింది. బహుశా ఏ పబ్లిక్‌ఫోన్ నుంచో

## ఎడిసన్ చతురోక్తులు



ఎన్నో నూతన ఆవిష్కరణలు చేసి శాస్త్ర, సాంకేతిక ప్రగతికి బాటలు వేసిన థామస్ ఆల్వా ఎడిసన్ హాస్య చతురుడు కూడా. దేంట్లోనుంచైనా హాస్యాన్ని వెలికితీస్తూ, మాటకు మాట బదులుచెప్పడంలో ఆయన దిట్ట. వివిధ సందర్భాల్లో ఆయన చతురోక్తులు కొన్ని...

### నేనేం కనుగొన్నాను?

థామస్ ఆల్వా ఎడిసన్ గ్రామఫోన్ కనుగొన్న సందర్భంగా ఓ సంస్థ ఆయన్ని సన్మానించింది. ఆ సందర్భంగా ఆ సంస్థ అధ్యక్షుడు 'మాట్లాడే యంత్రాన్ని కనుగొన్న మహానుభావుడు ఎడిసన్' అంటూ గంటన్నర సేపు గుక్క తిప్పుకోకుండా ఆ మహా విజ్ఞానిని కీర్తించాడు. అంతసేపూ ఎడిసన్ చాలా ఇబ్బందిగా ఫీలయ్యాడు.

ఇక తనవంతు మాట్లాడాల్సి వచ్చినప్పుడు ఎడిసన్ నెమ్మదిగా లేచి 'అధ్యక్షుల ప్రసంగానికి చిన్న సవరణ. వారన్నట్లుగా మాట్లాడే యంత్రాన్ని కనుగొన్నది నేను కాదు.. అది ఆ భగవంతుడు. నేను కనుగొన్నది మన కిష్టం లేనప్పుడు మాటల్ని ఆపు చేయగలిగే యంత్రం మాత్రమే' అని వినమ్రంగా కూర్చున్నాడు.

ఆయన సరస సంభాషణ ఆలకించిన సభికులు హర్షధ్వానాలు చేశారు.

చేసి ఉంటాడు. ఇలాంటి కాల్స్‌లో చాలా వరకు ఫేక్ కాల్సే ఉంటాయి. అంతమాత్రాన నిర్లక్ష్యం చేయటానికి వీల్లేదు.

వెంటనే పొన్నూరుకు ముందుగా ఉన్న పోలీస్ చెక్‌పోస్ట్‌ను ఎలర్ట్ చేసి, బాపట్ల వైపుకు వెళ్ళే ఏ లారీని సంపూర్ణంగా పరీక్షించకుండా వదలొద్దని చెబుతూనే డ్రస్ వేసుకున్నాడు. బెల్ట్‌కు పిస్టల్ పెట్టుకుని

స్టేషన్‌కు పరుగెడుతున్నట్లుగా వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్‌ను చూస్తూనే అక్కడ డ్యూటీలో ఉన్న కానిస్టేబుల్స్ ఎలర్టయారు. జీప్ బయలుదేరింది.

అప్పుడు సమయం పన్నెండు గంటలు. రోడ్డుకు అటూ ఇటూ చీకటిని కుమ్మరిస్తున్నట్లుగా చెట్లు. బైపాస్ దాటాక ఓ వంద గజాల దూరంలో రోడ్డు పక్కకు జీపును ఓ చెట్టు వెనక ఆపించాడు. పావుగంట గడిచినా ఏ లారీ రాలేదు. పోలీసుల్ని ఏడిపించటానికా అన్నట్లుగా ఇలాంటి కాల్స్ వస్తూనే ఉంటాయి.

అతడు ఆలోచనలతో కాలయాపన చేయదలచుకోలేదు. తనకు వచ్చిన సమాచారం ప్రకారం ఆ లారీ బాపట్ల వైపుకు వెళుతుంది. వెంటనే జీపును పొన్నూరు వైపుకు పరుగులు తీయించాడు. చేబ్రోలు, పచ్చలతాడిపర్రు దాటారు. మునిపల్లె దాటగానే పోలీస్ చెక్‌పోస్టు ఉన్నది. అక్కడ నాలుగు లారీలు ఆగి ఉన్నాయి.

జీపు ఆగుతుండగానే దూకుతున్నట్లుగా దిగాడు ప్రశాంత్. సబ్‌ఇన్‌స్పెక్టర్ శాల్యూట్‌ను అందుకుంటూనే "వీటిని పూర్తిగా చెక్ చేశారా? " అడిగాడు ఆత్రంగా.

"లేదు సార్! నా దగ్గర ఇద్దరు కానిస్టేబుల్సే ఉన్నారు. మీరొచ్చిన తరువాత చూద్దామని ఆగాను!" అతడు చెబుతూనే ఉన్నాడు. మరో లారీ రయ్‌న దూసుకుంటూ వచ్చింది.

కానిస్టేబుల్స్ రోడ్డుమధ్యన నిలబడటంతో లారీని ఆపి తలబయట పెట్టి, ఏమిటన్నట్లుగా చూచాడు డ్రైవరు.

"లైసెన్స్, వేబిల్ తీసుకురా!"

"ఇప్పుడు వందో రెండొందలో ఖర్చన్నమాట" అని నసుక్కుంటూ దిగాడు ఆ డ్రైవరు. అక్కడ ఆగివున్న లారీల్లో మొదటిదాంట్లో పత్తిబేళ్ళున్నాయి. దాంట్లో పత్తి తప్ప ఇంకేమి లేదని నమ్మకం కుదరటంతో రెండో లారీ దగ్గరకు వెళ్ళారు. దాంట్లో అన్నీ ఇనుప రాడ్లే... స్పష్టంగా కనబడుతున్నాయి కిందవరకూ. మూడో దానిమీద పూర్తిగా టార్పాలిన్ కప్పి ఉన్నది. వడ్లబస్తాలున్నయ్యన్నాడు డ్రైవరు.

"టార్పాలిన్ తీయ్! ఎక్కడి నుంచి వస్తున్నావ్? " అన్నాడు విసుగ్గా ప్రశాంత్.

"రాజమండ్రి నుంచండి! బాపట్ల కండి"

"అక్కడనుంచల్లా వడ్లు ఇక్కడకు రావాల్సిన పనేమిటి? ఇక్కడ దొరకవా? "

"తెలియదండి... మా సేటు బాపట్లలో ఉన్న రైస్ మిల్లులో సరుకిమ్మన్నారండి!"

"వడ్లేనా.. ఇంకేమైనా ఉన్నాయా? "

"వడ్లేనండీ బాబు. తీసి చూపించమంటారా? కానీ వానొచ్చేటట్లున్నది టార్పాలిన్ తీస్తే వానొస్తే తడుస్తయ్యండి"

తలెత్తి చూచాడు ప్రశాంత్. అతడు చెప్పింది నిజమే. అంతవరకు గమనించలేదు. ఆకాశాన్ని నల్లటి మబ్బులు కమ్మేసి ఉన్నాయి. అయినా "వానేం రాదులే... వస్తే టార్పాలిన్ ఉందికదా" అన్నాడు.

"సరేనండి. మధ్యాహ్నం తిన్నాను. నీరసంగా ఉంది! ఓ చాయ్ తాగొచ్చి లారీ ఎక్కుతానండి"

"ఐదు నిముషాల్లో రావాలి.. నీ డ్రైవింగ్ లైసెన్స్ ఇచ్చి వెళ్ళు!"

"అలాగేనండి బాబు. నేనెక్కడికి వెళతా

## కొత్తగాలి...

**పిల్లలకి**
**తండ్రి చెట్టయితే**
**తల్లి**
**ఆ చెట్టు నీడ**

– కోలపల్లి ఈశ్వర్,
నెల్లూరు

నండి. ఉంచండి మీ దగ్గరే!" కానిస్టేబుల్‌కు లైసెన్స్ ఇస్తూనే వడివడిగా కాస్త దూరంలో ఉన్న దాబా దగ్గరకు వెళ్ళాడు.

ఈలోగా కానిస్టేబుల్స్ లారీ ఎక్కి తాళ్ళు విప్పారు. టార్పాలిన్ తీస్తే అతడు చెప్పినట్లు లారీ నిండా వడ్లబస్తాలే ఉన్నాయి. ఫోను చేసి అర్ధరాత్రి తనను ఇంతదూరం రప్పించిన ఆ మనిషిమీద బహు చిరాకు వేసింది ప్రశాంత్‌కు.

"సార్! మొదట్లో వడ్లబస్తాలు రెండున్నయిగాని... వెనకాలంతా ఊకబస్తాలే సార్!" లారీ మీద ఉన్న కానిస్టేబుల్ పెద్దగా అరిచాడు.

ఒక్కసారిగా ఎలర్ట్ అయ్యాడు ప్రశాంత్. "బస్తాలని కిందకు తోసేసి... అడుగున ఏమున్నదో చూడండి!" అంటూ పక్కనున్న కానిస్టేబుల్ వంక తిరిగి "ఆ దాబా దగ్గరకు పరుగెత్తుకెళ్ళి డ్రైవర్ని లాక్కురా!"

మిగతా కానిస్టేబుల్స్ లారీ ఎక్కి బస్తాలు కిందకు తోస్తూనే.. "సార్! ఏవో దుంగలున్నయ్!" అన్నారు పెద్దగా.

ప్రశాంత్ వడివడిగా టైర్ మీద కాలు వేసి లారీ పైకి ఎక్కేశాడు. అక్కడున్నవి ఎర్రచందనం దుంగలే!

దాబా దగ్గరనుంచి కానిస్టేబుల్ పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. అతడితోపాటు మరెవ్వరూ లేకపోవడంతో ప్రశాంత్‌కు అర్థమైంది, డ్రైవరు తోక జాడించాడని!

★ ★ ★

ఆనంద్ ఇంటిముందుకు వస్తూనే ఆశ్చర్యంగా చూచాడు. తనింట్లో లైట్లు వెలుగుతున్నాయి. అప్పుడు ఎనిమిది గంటలయింది. ఓ స్నేహితుడితో గాంధీ పార్కుకు వెళ్ళి కబుర్లు చెప్పుకుని వస్తున్నాడు. ఎందుకో ప్రతి విషయమూ అతడికి చికాకు కలిగిస్తూనే ఉన్నది. చిన్నప్పటి నుండి తన బతుకు అంతే. ఈ మధ్య చదువుమీదా ధ్యాస పెట్టలేకపోతున్నాడు. అటు కాలేజీ వాతావరణమూ మింగుడు పడటం లేదు. రాజూ, వెంకట్‌లు తన మీద పగబట్టారు అపోహలతో...

ఇంటిముందుకు వచ్చి గేటుమీద చేయి వేస్తుండగా లోపలనుంచి పెద్దగా అరుపులు వినబడ్డాయి. 'అంటే ఇవ్వాళ ఇద్దరూ ఒకేసారి కొంపకు జేరారన్నమాట..'

"నేను ఆరునెలలు కాదు ఒక్కరోజు కూడా ఆగదలచుకోలేదు. నిన్ను చూస్తుంటేనే నాకు పరమ అసహ్యమేస్తున్నది!" అది తండ్రి గొంతు.

"నాకూనూ! ఉదయాన్నే లాయరు దగ్గరకు వెళ్ళి చెబుదాం.. ఈ పీడ ఎప్పుడు వదులుతుందా అని చూస్తున్నాను.. ఆయన ఇంతకు ముందే చెప్పారు పిల్లవాడి సంగతి తేల్చుకుంటే కేసు త్వరగా తేలిపోతుందని!" తల్లి అరుస్తోంది.

"తేల్చేదేమున్నది? నవమాసాలూ మోసి కన్నానన్నావుగా.. వాడి సంగతి నువ్వే చూసుకోవాలి! వాడు కూడా మనం విడిపోవాలని కోరుకుంటున్నాడు!"

"కన్నది నేనే అయిన మీరేగదా దానికి కారకులు.. వాడి బాధ్యత మీదే!"

"వాడిని చూస్తుంటే నీ దరిద్రపు మొహమే గుర్తొస్తుంది.. నువ్వూ, వాడూ ఏ గంగలో దూకుతారో దూకండి. నన్ను మాత్రం అందులో ఇరికించవద్దు. నేను జడ్జిగారికి అదే చెబుతాను... పీడ వదలటానికి భరణమెంతైనా ఇస్తాను!"

"మీ బోడి భరణం లేకుండా నేను బతకలేననుకుంటున్నారా? "

"అసలు ఆ సంపాదనే నీ పొగరుకు కారణం.. ఆపైన జనాలకు ఎర వేయటానికి అందం ఉండనే ఉన్నది!"

"మీది నోరేనా.. మీకున్న బజారు తిరుగుళ్ళ దుర్గుణం అందరికీ అంటగట్టాలని చూస్తే ఊరుకునేది లేదు!"

"ఆఫీసులో నీ వేషాలు ఎవ్వరికి తెలియ



వని.. నేను కాబట్టి..”

“నా గురించి మరోమాట చెడుగా మాట్లాడినా చెప్పు తీసుకు కొడతాను. అనవసరపు అభాండాలు వేస్తే నోర్మూసుకు కూర్చునేటంత దద్దమ్మను కాదు!”

“మొగుడు కాబట్టి చెప్పు తీసుకు కొట్టినా పడివుంటాడనేగా నీ ఉద్దేశ్యం. నిన్ను కాదే అనాల్సింది.. ఆ ముసలాళ్ళను అనాలి.. సంప్రదాయ కుటుంబమంటూ నీ మెళ్ళో మూడు ముళ్ళూ వేయించి నరకంలోకి దింపారు. వాళ్ళకేం హాయిగా ఆశ్రమంలో నేను డబ్బు కడుతుంటే ఏ చీకూచింతా లేకుండా వున్నారు. నేనే చస్తున్నాను”

వాళ్ళమాటలు తూటాల్లా శరీరాన్ని చిల్లులు పొడుస్తుండగా ఆనంద్ విసురుగా వెనక్కు తిరిగి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ గేటు దాటాడు.

★ ★ ★

“ఈ అడ్డగాడిదకు ఫ్రెండేమిటిరా అది.. మనమింత వరకూ గమనించనేలేదు!” అది చెట్టుకింద మోటర్‌బైక్ మీద కూర్చున్న రాజు గొంతు. పక్కనే వెంకట్, చంద్రశేఖరం ఉన్నారు. వారి గ్యాంగంతా ఉన్నది. కాలేజీ బస్సు దిగి వస్తున్నవాళ్ళ మధ్యన మాట్లాడుకుంటూ అడుగులేస్తున్న శ్యామలా, ఆనంద్‌లనే చూస్తున్నారు వాళ్ళంతా.

బస్సు దిగిన పిల్లలంతా తమ క్లాసులకు వెళుతున్నారు. శ్యామలా తన క్లాసుకు వెళ్ళిపోయింది. ఇంకో పావుగంట సమయం ఉండటంతో రామం కోసం నలువైపులా చూస్తూ నిలుచున్నాడు ఆనంద్.

రాగిణి ఇచ్చిన పార్టీకి వెళ్ళటమేమి టి?

"అలాగా?" అంటూ ఓ అడుగు ముందుకేశాడు, ఏం మాట్లాడాలో తెలియక.

"ఆగు, నేను మాట్లాడుతుంటే అంత నిర్లక్ష్యంగా పూర్తిగా వినకుండానే వెళ్ళిపోతావేం.. పొగరెక్కిందా?"

ఆనంద్ గిరుక్కున వెనక్కు తిరిగాడు. అప్పటికే వెంకట్ బృందమంతా అతడి వెనకాల వచ్చి నిలబడ్డారు, కొట్లాటకు తయారుగా వున్నట్లుగా.

"నీ ఇన్‌స్పెక్టరునూ జాగ్రత్తగా ఉండమను. వాడికీ త్వరలో మూడబోతున్నది. కృష్ణలో మునుగుతాడో, చింతపల్లి అడవుల్లో ఎన్‌కౌంటర్ అవుతాడో త్వరలోనే తేలుతుంది!" అంటూ వెనక్కు తిరిగాడు.



"ఆరేయ్ ఆనంద్! ఒకసారి ఇటు రారా!" వెంకట్ పెద్దగా పిలిచాడు.

ఆ మాట విన్నా ముఖం తిప్పుకున్నాడు ఆనంద్. తరువాత అక్కడుండటం అనవసరమన్నట్టు అడుగు ముందుకు వేశాడు.

వెంకట్ ఊరుకోలేదు. ఆనంద్ పక్కకు వచ్చాడు. "చెవుడేంట్రా.. పిలిచినా పలకవ్. నేను మంచిగా చెబుతున్నాను... గుర్తుంచుకో.. శ్యామల నా లవ్.. మరోసారి ఆమెతో మాట్లాడావంటే చెమ్డాలొలుస్తాను. మేం త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నాం. రాత్రి రాగిణి మా ఇద్దరినీ ప్రత్యేకంగా పార్టీకి పిలిచింది. అప్పుడు చెప్పింది శ్యామల.. నువ్వేదో వెంటబడి సతాయిస్తున్నావట కదా! ఒళ్ళెలా వుంది?" మీది మీదికి వస్తూ అన్నాడతను.

బిత్తరపోయాడు ఆనంద్. శ్యామల

ఆనంద్ క్లాస్‌కు వెళ్ళినా ప్రశాంతంగా కూర్చోలేకపోయాడు. రాగిణి వలలో శ్యామల పడిపోతున్నదా? మనస్సంతా వికలమయిపోతున్నది ఆ ఆలోచనలతో.

తర్వాత సరిగ్గా అరగంటకు చెట్టుకింద కూర్చున్న వాళ్ళల్లో ఒక్కసారిగా చలనం!

"అరేయ్! గురుడొచ్చి బండిమీద కూర్చున్నాడురా!" అన్నాడు రాజు కాలేజీ గేటు బయటకు చూస్తూ.

అక్కడకు అప్పుడప్పుడు వచ్చే ఆ గురుడు డ్రగ్స్ సప్లయ్ చేస్తుంటాడు.

వెంకట్ హుషారుగా జేబులోనుంచి డబ్బు తీసి చంద్రశేఖరానికి ఇచ్చి, "పట్టుకు రారా!" అన్నాడు.

చంద్రశేఖరం ఎగురుకుంటూ వెళ్ళి, అత

డికి డబ్బులిచ్చి పొట్లాలకోసం చేయి చాచాడు? సరిగ్గా అప్పుడే అతడి భుజంపై చేయిపడింది. ఆ చేయి సబ్ ఇన్‌స్పెక్టర్ విజయ్‌ది!

★ ★ ★

చక్రవర్తి అసహనంగా తన గదిలో అటూఇటూ తిరుగుతున్నాడు. చేతిలో సెల్ ఎప్పుడు మోగుతుందా అన్నంత ఆత్రంగా దానివంకే చూస్తున్నాడు. తన అనుంగు శిష్యుడు బాలరాజునుంచి ఫోన్ రావాలి. తరువాత పది నిముషాలకు చేతిలోని సెల్ రింగవ్వటంతో ఆత్రంగా దాన్ని చెవి దగ్గర పెట్టుకుంటూనే "చెప్పరా.. బాలరాజూ!" అన్నాడు.

"వీరభద్రుడికి మరణశిక్ష విధించింది సార్, ఆవిడ!" బాలరాజు కంఠం కీచుగా వినబడింది.

★ ★ ★

లంచ్‌టైంలో బయటకు వస్తూ 'ఆనంద్ కన్పిస్తే బాగుండు' అనుకున్నది శ్యామల. ఆనంద్ రాలేదుగాని, రాగిణి ఎదురొచ్చి చేయిపట్టుకొని "అదేంటి? కనిపించడమేలేదు. కాలేజీకి రావట్లేదా? " అంది.

"నువ్వొస్తున్నావో లేదో తెలియదుగాని, నేను మాత్రం వస్తూనే ఉన్నాను!" అన్నది శ్యామల నవ్వుతూ.

"నీతో అర్జంటుగా మాట్లాడాలి. పద... లైబ్రరీకి వెళ్దాం!" అంది ముందుకు అడుగులు వేస్తూ రాగిణి. ఇద్దరూ వెళ్ళి లైబ్రరీలో ఓ మూలగా కూర్చున్నారు.

"నిన్ను వచ్చే సంవత్సరం మన జిల్లా అందాలపోటీల్లో విజేతగా చేయాలనేది నా కోరిక. దానికి మంచి డైటేకాదు, యోగా కూడా అవసరం. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ షీల్డ్ మన కాలేజీ దాటి వెళ్ళగూడదు!"

"నాకు ఇష్టంలేదు! ఆ పోటీల్లో నేను పాల్గొనను!" ఒక్కక్షణం కూడా ఆలశ్యం చేయకుండా చెప్పింది శ్యామల.

"నేనయితే రాష్ట్ర పోటీలలో తప్పకుండా పాల్గొంటాను... విజయం సాధిస్తాను!... మరి జిల్లా విషయంలోకూడా జాగ్రత్తపడాలి గదా... మన కాలేజీలో ఉన్న అందగత్తెలు ముగ్గురిలో నువ్వు ఒకదానివి. అందుకే నేను నిన్ను అంతగా కోరేది. మా హోటల్లోనే బ్యూటీపార్లర్ తెరిచాం.. దాని లోపలికి వెళ్ళటం అంటేనే చాలాఖర్చు నీకు మాత్రం ఉచితమే!"

"ఎందుకనో? "

"ఆ హోటల్ ఓనర్‌కు ఆత్మీయ స్నేహితురాలివే కాకుండా రాబోయే పోటీలో నువ్వే కాబోయే విజేతవు గనుక.. నువ్వు గెలిస్తే మా హోటల్‌కే గౌరవం లభించినట్లు... దాని పేరు ప్రతిష్టలు ఆకాశమెత్తు పెరిగిపోతాయి.."

"సో.. నన్ను మీ హోటల్ ప్రమోషన్‌కి ఉపయోగించుకుంటావన్నమాట..."

"అందులో నీ లాభమేంటో అడుగు? "

"అడిగేందుకు ఏమున్నది... కావాల్సినంత పేరు వస్తుంది. ఏ టీవీ వాళ్ళో సీరియల్స్‌లో పాల్గొనమంటూ ఆహ్వానిస్తారు. ఆపైన సినిమాల్లో ఛాన్స్ వచ్చినా ఆశ్చర్యపోవాల్సిందేమీ లేదు. అందుకే నీకో దణ్ణం.. నీ పోటీకో దణ్ణం.. నన్నిలా సంతోషంగా ఉండనీయ్!" అన్నది పకపకా నవ్వుతూ శ్యామల.

"రాగిణి దృష్టిలో పడ్డాక కూడానా? నో.. అందలం ఎక్కిస్తాను తల్లీ అంటే పారిపోతానంటే ఎలా? పోటీలో విజయం సాధిస్తే మా హోటల్ ఇచ్చే బహుమతే పది లక్షలు" అన్నది ఆమె భుజంపై చేయి వేసి దగ్గరకు తీసుకుంటూ.

"నాకు అవేవీ వద్దుగాని మొన్న పార్టీలో నువ్విచ్చిన ఆరంజ్ జ్యూస్ ఎంత బాగున్నదో తెలుసా.. రోజూ అడుగుదామనే అనుకుంటున్నాను గాని, నువ్వు ఒంటరిగా దొరికితేనా! అది ఎలా చేశారో చెప్పు!"

అలా అడిగి తనంతంటతానే ఊబిలో కూరుకుపోతున్నదనే విషయం శ్యామల ఆ క్షణాన గ్రహించలేకపోయింది!

రాగిణి పకపకా నవ్వింది.

"ఎందుకు నవ్వుతావ్?" మొహం చిన్న బుచ్చుకుంటూ అన్నది శ్యామల.

"అది ఎలా తయారు చేస్తారో నాకే తెలియదు గనుక!"

"అదేమిటి.. మీ హోటల్లో చేసే పదార్థాలు ఎలా చేస్తారో నీకు తెలియకపోవటమా? నా చెవిలో పూలు పెట్టొద్దు!"

"నిజం శ్యామలా! అది మా చెఫ్ చేసిన కూల్ డ్రింక్. ఆ రహస్యమేదో అతడికి తప్ప మరెవ్వరికీ తెలియదు!"

"రహస్యంగా ఉంచాల్సినంత గొప్ప విషయమా అది!"

"ఔను, మరే హోటల్లోనూ ఎవ్వరూ అలాంటి డ్రింక్ చేయగూడదనేది మా ఉద్దేశ్యం. అది తాగాలంటే ఎంతటివాడైనా మావద్దకి రావల్సిందే. మేం మా చెఫ్‌కు ఇచ్చే జీతమెంతో వింటే అదిరిపోతావ్!"

"నిన్ను పట్టుకునే నిలబడ్డాగాని చెప్పు!" కాస్తంత ఎగతాళిగా అంది శ్యామల.

"నెలకు అరవైవేలు... ఫర్నిష్‌డ్ హౌస్.. మా ఖర్చుమీదే సంవత్సరానికోసారి పదిహేను రోజులు ఫారిన్ ట్రిప్... అతడు ట్రైనింగ్ అయింది ఆస్ట్రేలియాలో... ప్రత్యేకంగా పిలిపించుకున్నాం. ఆ జ్యూస్ అంటే అంత మోజు పడుతున్నావుగదా... నిన్ను ఎన్నిసార్లయినా తీసుకువెళ్ళి నీచేత తాగిస్తా... అంతేగాని అది ఎలా చేస్తారు అని మాత్రం అడగబోకు!"

రాగిణి మాటలకు మరోసారి నోరు తెరవలేకపోయింది శ్యామల.

★ ★ ★

రాత్రి పది గంటలు. కాలింగ్‌బెల్ మోగుతుంటే, భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటున్న ప్రశాంత్ తలుపు తీశాడు. ఎదురుగ్గా ఎప్పుడూ చూడని కొత్తవ్యక్తి!

"చిన్నసాయం పడి మీకోసమే వచ్చాను. లోపలకు రమ్మంటారా?" చాలా వినయంగా అడిగాడు అతను.

ఇబ్బందిగా ఒకసారి అతడి వంక చూసి, 'రండి' అన్నట్లుగా వెనక్కు తిరిగాడు. ఆ ఆగంతుకుడు లోపలకు వచ్చి ప్రశాంత్ ఎదురుగ్గా మరో సోఫాలో కూర్చున్నాడు.

అతడు చామనచాయ రంగులో ఉన్నాడు. వయస్సు యాభై పైనే. గోల్డ్ ఫ్రేమ్ కళ్ళజోడు. నుదుట పెద్ద గంధపు బొట్టు. దానిమధ్యలో గుండ్రంగా కుంకుమ. మెళ్ళో రుద్రాక్షమాల...

"నన్ను కూర్మావతారంగారు పంపారు!" అన్నాడతడు కళ్ళు పెద్దవి చేసుకొని, ప్రశాంత్‌నే చూస్తూ.

**కొత్తగాలి...**

**ఆపద కాసేవాడు**
**ఎక్కడున్నా వస్తాడు**
**కాయని వాడు**
**పక్కనున్నా రాడు!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

ప్రశాంత్ ఎలర్ట్ అయ్యాడు, అతడి మాట వింటూనే. కొద్దిరోజుల క్రితం మృదుల కూతురు శారదను రేప్ చేసిన కేసులో అతడి కొడుకు గుర్నాథం ఊచలు లెక్కపెడుతున్నాడు.

కూర్మావతారం నగరంలో పేరున్న రాజకీయ నాయకుడు. ఏ పదవీ లేకపోయినా అధికారపక్షం నాయకులతో తిరుగుతూ తన, తన అనుయాయుల పనులూ చేసుకుంటుంటాడు.

"చిన్న విషయమే సార్! మెడికల్

రిపోర్ట్ వచ్చింది కదా.. దాన్ని మీరు అతి ముఖ్యమైన పత్రంగా మరో రెండు రోజుల్లో కోర్టుకు సమర్పించబోతున్నారు... మీకు తెలియందేమున్నది... అదో బజారు మనిషి... అబ్బాయిగారు ఎంతకాదని చీదరించుకుంటున్నా వెంటబడి చివరకు డబ్బు కోసం నాటకాలాడుతూ నానా యాగీ చేస్తున్నది... అందుకే కూర్మావతారంగారు మరో రిపోర్టు తయారు చేయించారు.. దాన్ని మీ దగ్గరున్న దానిబదులుగా కోర్టులో ఇవ్వమన్నారు... సింపుల్ సార్... ఫైల్లో కాగితాన్ని మార్చేయటమే... దానివలన ఏ తప్పూ చేయని అబ్బాయిగారు కేసునుండి బయట పడటమే కాకుండా, ఆ

## కొత్తగాలి...



**ఒకదాని వెంట**
**మరోటి స్కాములు**
**పుట్ట నుంచి**
**బయటపడే పాములు**

– అంబటి వెంకటశివారెడ్డి,
యర్రగుంట్ల, కడప జిల్లా

ఆడదానికి బుద్ధి చెప్పినవాళ్ళూ అవుతారు... ఈ చిన్న పనికిగాను మీకివ్వమని కానుకగా రెండు లక్షల డబ్బు పంపారు!" అన్నాడు నవ్వు ముఖంతో. అతడు ఆ మాటలు చెబుతున్నప్పుడు అతడి సన్నని పెదాల నడుమ కనబడుతున్న నాలిక.. పాము నాలికలా కదులుతున్నది.

ప్రశాంత్‌కు చర్రున కోపమొచ్చింది. "లే.. మరొక్కక్షణం నా ముందున్నా నేనేం చేస్తానో నాకే తెలియదు!" అరిచాడు.

అతడు లేవలేదు. ముఖంమీద చిరునవ్వును మాయనీయలేదు. "నేను మీ శ్రేయోభిలాషిగా చెబుతున్నాను సార్! మా సారంత మంచివాళ్ళు అరుదు సార్! ఇక మా అబ్బాయిగారంటారా నోట్లో నాలిక లేని మనిషి... మీరు కాగితం మార్చడానికే అంతగా ఆలోచిస్తే ఎలా సార్, వృద్ధిలోకి రావాల్సినవారు... సారు తలుచుకుంటే క్షణాలలో డిఎస్‌పీ అయిపోతారు!"

ప్రశాంత్ ఇక అతడి మాటలను వినలేనట్లుగా ఊగిపోతున్నాడు కోపంతో.

"ఒక్క నిముషం టైం ఇస్తున్నా... లేచి గేటు దాటాలి లేదా ఏసీబీ వాళ్ళను పిలిచి నిన్నూ, నీ డబ్బునూ అప్పజెబుతాను!" అన్నాడు గయ్‌మంటూ.

"పిలవండి సార్! మా సార్ కట్టిస్తున్న అపార్ట్‌మెంట్స్ మెంబర్లు ఈ నెల ఇవ్వాల్సిన ఇన్‌స్టాల్‌మెంట్లు వసూలు చేసుకొని వస్తుంటే మీరు మీ కానిస్టేబుల్‌ను నా కోసం పంపితే వచ్చాను... మీ ప్రమోషన్ విషయంలో మా సార్‌కి ఓ మాట చెప్పమని అడిగారు... ఇందులో నేను చేసిన తప్పేమిటో వాళ్ళనే అడుగుతాను!"

అతడు మాటలతో వినే మనిషి కాదని అర్థమయింది. విసురుగా తన గదిలోకి వెళ్ళి పిస్టల్ తీసుకొని వచ్చాడు.

అప్పటికే అతడు లేచి నిలబడ్డాడు. ఇన్‌స్పెక్టర్ చేతిలోని పిస్టల్‌ను చూస్తూనే, నవ్వేసి, "నాకు అన్నంపెట్టే మా సారు కోసం ప్రాణత్యాగం చేశానని చరిత్రలో పేరు మిగుల్తుంది. కానివ్వండి!" అన్నాడు.

ప్రశాంత్ బిగుసుకుపోయి నించున్నాడు.

"బతకటం చేతకాని వాళ్ళను ఆ దేవుడే రక్షించాలి!" అతడు గొణుక్కుంటూ వాకిలి దాటి, స్కూటరెక్కి వెళ్ళిపోయాడు.

★ ★ ★

శాంతకుమారి ఆనంద్‌నే చూస్తూ ఉండిపోయింది చాలాసేపు. ఇప్పుడిప్పుడే మీసాలు వస్తున్న కుర్రవాడు. మనస్సంతా బాధలతో నిండిపోగా చదువు మానేసి దేశద్రిమ్మరి అవ్వాలనుకుంటున్నాడు!

## విమానమే ఇల్లు

అమెరికాలో ఆరేగాన్ రాష్ట్రానికి చెందిన బ్రూస్ కేంప్‌బెల్(62) తన ఇంటిని విభిన్న రీతిలో ఏర్పాటు చేసుకున్నాడు. కొన్నేళ్ల క్రితం 727 జెట్ విమానాన్ని కొని, దాన్నే ఇంటిగా తీర్చిదిద్దుకున్నాడు. దాన్ని అతను ఒక విమాన కంపెనీ నుంచి లక్ష డాలర్లకు కొన్నాడు.



విమానాశ్రయం నుంచి తన నివాస స్థలానికి దాన్ని రవాణా చేయించడానికి, తోక, రెక్కలు తొలగించడానికి మరో లక్ష డాలర్లను ఖర్చు చేసాడు. తర్వాత తనే విమానం లోపలి భాగాన్ని గదులుగా విభజించుకుని, ఇంటిగా మలచుకున్నాడు. ఇప్పట్లో విమానం ఖరీదు ఇంకా తగ్గింది కాబట్టి ఆసక్తి ఉన్న వారు తనను అనుసరించవచ్చని అతను సి.ఎన్.ఎన్ టీవీకి ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పాడు. అంతేకాదు, ఇతరులకు మార్గదర్శిగా ఉండటానికి ఎయిర్‌ప్లేన్ హోం.కామ్ అనే వెబ్‌సైట్‌ను ప్రారంభించాడు. అందులో చాలా సమాచారాన్ని ఇచ్చాడు. బిల్డింగ్ సర్వీసెస్‌లో పనిచేసే ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీర్ అయిన అతడి ఇంటిని అనేక టీవీలలో చూపించారు. తనకంటే ముందు నెదర్లాండ్ లోని ఒకరు విమానాన్ని ఇంటిగా మార్చుకున్నారన్న వార్త చదివాక కేంప్‌బెల్‌కు ఈ ఆలోచన వచ్చిందట. స్టాక్‌హోంలో 747 జంబోజెట్‌ను ఒకరు ఇల్లుగా మార్చుకున్నారు. కోస్టారికాలో బోయింగ్ 707ను రెస్టారెంట్‌గా మార్చారు. చాలామంది బ్రూస్ కేంప్‌బెల్ ఇంటికి వెళ్లి చూస్తుంటారు. వాళ్లకి ఓపికగా, ఉచితంగానే ఇంటిని చూపిస్తుంటాడతడు.

చతుర ప్రపంచం

శ్యామల అతడి గురించి అంతకుముందే చెప్పింది. క్లాసులో పోటీగా తామిద్దరకీ ఎలా మార్కులు వచ్చేది! అటువంటిది కొద్దిరోజులుగా ర్యాంకుల్లో ఎలా కిందకు దిగజారిపోతున్నదీ చెప్పింది. అందుకే పూర్తిగా విషయాన్ని తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో తన దగ్గరకు తీసుకు రమ్మనమని చెప్పింది కూతురితో.

"చెప్పు.. అసలు నీ సమస్యేమిటి? నువ్వు డిప్రెషన్‌లో ఉన్నావని శ్యామల చెప్పింది. హాయిగా చదువుకుంటూ తిని తిరిగే వయస్సులో అంతగా బాధపడవలసిన అవసరమేమున్నది? "

వాళ్ళు మేడమీద బాల్కనీలో కూర్చొని ఉన్నారు. పున్నమి వెన్నెల చల్లగా ఉన్నది. ఇంటిచుట్టూ చెట్లు ఉండటంతో చల్లటి గాలి వీస్తున్నది. పిట్టగోడ వారగా వివిధ రకాల పూలమొక్కల కుండీలు. వాటికి రంగు రంగుల పూలు.

వంటమనిషి ముగ్గురికీ కాఫీ ఇచ్చింది.

"నాకు శ్యామల ఒక్కతే కూతురు... వాళ్ళ నాన్నగారు ఏడాది క్రితం కారు ప్రమాదంలో పోయారు. నాకు అది, దానికి నేను. అంతే.. నాకో తమ్ముడు ఉన్నాడు కాని, చాలా దూరంలో అమెరికాలో ఉన్నాడు. మాకయితే మేము హాయిగానే బతుకుతున్నామనే అనిపిస్తోంది!"

ఆనంద్ మాట్లాడలేదు. యాభై ఏళ్ల పైన ఉన్న ఆమెను చూస్తుంటే మన స్నేంతో గౌరవంతో నిండిపోతున్నది. జరీ అంచు నేత చీరకట్టుకొని, ముఖాన కుంకుమ బొట్టుతో కళకళలాడుతున్నది.

"నేనూ మా తల్లిదండ్రులకు ఒక్కడినే కొడుకును! అలాగే మా అమ్మానాన్నా

కూడా వాళ్ళ తల్లిదండ్రులకు ఒక్కళ్ళే. వాళ్ళిద్దరూ ఉద్యోగాలు చేస్తూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారట!" చెప్పాడు ఆనంద్.

"గుడ్!"

ఆమె అన్న ఆ మాటకు ఆనంద్‌కు నవ్వు వచ్చింది. కానీ అలా నవ్వటం మర్యాదకాదని నిగ్రహించుకున్నాడు.

"మా అమ్మానాన్నా ఇద్దరూ వేలకువేలు సంపాదిస్తుండటంతో ఎవరికివారు తామే గొప్ప అని, తమమాటే నెగ్గాలనే పంతంతో కొట్టుకు చస్తున్నారు!" అతడి కంఠం ఒక్కసారిగా కరుకుగా మారింది. "మధ్యలో కొడుకుగా నేను గిలగిలలాడుతున్నాను... ఇది నా కుటుంబ సమస్య. నన్ను మన శ్శాంతికి దూరం చేస్తున్న సమస్య... ఆప్యాయంగా మీరు అడుగుతున్నారు కాబట్టి మొట్టమొదటిసారిగా బయటి వ్యక్తిముందు నోరు తెరిచి చెప్పుకుంటున్నాను!"

శాంతకుమారి జాలిగా అతడి వంక చూచింది. "నీకు అమ్మమ్మగాని, బామ్మ గాని లేరా? వాళ్లు ఎక్కడుంటారు?"

"వాళ్ళూ ఇక్కడే ఉంటారు. అమ్మగారి నాన్న, నాన్నగారి నాన్న ఉద్యోగాలనుంచి రిటైర్ అయినవాళ్ళే.. వయస్సు మీరిన వాళ్ళే.. ఇప్పుడు బామ్మ, తాతయ్యలిద్దరూ అనాథల్లా వృద్ధాశ్రమాల్లో ఉన్నారు. మా అమ్మానాన్నా పెళ్ళయ్యేంతవరకూ వాళ్ళ తల్లిదండ్రుల దగ్గర పెరిగితే, నేను మాత్రం నడక వచ్చేంత వరకూ బామ్మ దగ్గర పెరిగాను. స్కూల్లో జేరిన దగ్గరనుంచీ అమ్మమ్మ దగ్గర పెరిగాను. టెన్త్‌క్లాస్‌కు వచ్చేసరికి మా తాతయ్యను ఇక్కడనుంచి బదిలీ చేయటంతో హాస్టల్లో చేరా!"

"మీ అమ్మానాన్న దగ్గరే ఉండటానికి నీకు ఇబ్బందేమున్నది?"

"ఇద్దరూ ఉద్యోగస్తులని చెప్పాను గదా... రాత్రిళ్ళు ఎప్పుడొస్తారో వాళ్ళకే తెలియదు... కన్న కొడుకయిన నన్ను చూచేందుకే ఇబ్బంది పడుతూ చిన్నప్పటి నుంచీ అక్కడా ఇక్కడా ఉంచారు!"

"బామ్మా తాతయ్యా వృద్ధాశ్రమంలో ఉన్నారన్నావ్... నువ్వు అమ్మమ్మ దగ్గర యినా ఉండవచ్చు గదా!"

"ఆమెకూ బాగా వయస్సు పైబడింది... ఆరోగ్యం అంతగా బాగుండదు... నేననుకోవటం అప్పుడే ప్రారంభమయ్యాయి వీళ్ళ మధ్య గొడవలు... నాన్నేమో లేవలేని బామ్మనూ, తాతయ్యనూ మా ఇంటికి తెద్దామంటాడు... అమ్మేమో మనకు చేత గాకనే కదా ఉన్న ఒక్కపిల్లవాడినీ అక్కడాఇక్కడా ఉంచుతున్నది అంటుంది. నాకు తెలిసినంతవరకూ అది కాదు కారణం- వాళ్ళు వస్తే ఏ వంట మనిషినో పెట్టాలి, డబ్బు ఖర్చవుతుంది... అది అమ్మకిష్టంలేదు. అన్నిటికీమించి వీళ్ళ వివాహానికి మా బామ్మ చాలా అడ్డంకులు పెట్టటమేగాకుండా, నేను పుట్టేంతవరకూ మా ఇంటి గడపకూడా తొక్కలేదట. అందుకే అమ్మకు మొదటినుంచీ ఆమె అంటే పడేది కాదు. అటువంటి ఆమెను తమ దగ్గరకు తెచ్చుకోవటం, డబ్బు ఖర్చు పెట్టటం ఇష్టం లేదు. నాన్నకేమో తల్లిదండ్రుల్ని చూడలేకపోతున్నాననే బాధ... ఈ గొడవలు ఇలా ఉండగా మా అమ్మగారి నాన్నకు యాక్సిడెంటయి కాలుపోవటంతో వాళ్ళకు కూతురు అండ కావాల్సివచ్చింది. కానీ తన తల్లిదండ్రుల విషయంలో అమ్మ కాదనటాన్ని జీర్ణించుకోలేని నాన్న అమ్మమ్మను, తాతయ్యను మా ఇంటికి తీసుకు రావడానికి అంగీకరించలేదు. దాంతో యుద్ధం మొదలై నెలకు సగం రోజులు మా అమ్మ అమ్మమ్మ వాళ్ళింట్లో ఉండటం మొదలుపెట్టింది!"

"ఇవి చాలా కుటుంబాలలో ఉన్న సమస్యలే... తరాలు మారుతున్నప్పుడు ఆలోచనలూ మారుతుంటాయి!"

"ఇక్కడ అదికాదు సమస్య ఆంటీ...! చేతిలో ఆడుతుండే డబ్బు ఇద్దరిలోనూ అహాన్ని పెంచింది. వయస్సుతోపాటు డబ్బు పెరిగినట్లే పంతాలు, పట్టింపులూ పెరిగినయి... వాళ్ళు రోజులో సౌమ్యంగా మాట్లాడుకున్నదానికంటే వాదనలతో, తిట్లతో గడిపిన కాలమే ఎక్కువ.. ఆమె మాటకు ముందు పుట్టింటికి జేరుతుంటుంది. ఆయన బార్‌లో తిష్ట వేస్తాడు!"

"దీనికంతటికీ కారణం ఏమిటంటావ్!"

"మన పురోగతి!" అన్నాడు కాస్తంత వెటకారంగా ఆనంద్. "లక్షల్లో కార్పొరేట్ సంస్థలు ఇస్తున్న వేతనాలు.. విదేశీ డాలర్ల వ్యామోహంలో పడుతున్న బతుకులు!"

శాంతకుమారికి అతడి మాటల్లో ఎంతో నిజమున్నట్లనిపించగా మౌనంగా చూస్తూ ఉండిపోయింది.

"ఇంటర్మీడియట్ వరకూ హాస్టల్‌లోనే ఉన్నాను. ఇంజనీరింగ్ కాలేజీలో జేరాక, ఫీజులకే చాలా అవుతున్నది, ఇంకా హాస్టల్‌కు కూడా ఎక్కడ భరించమంటావ్, మా దగ్గరే ఉండు అంటూ ఇంటికి తీసుకువచ్చారు!"

నిట్టూర్పు విడిచింది శాంతకుమారి. కన్న పిల్లల్ని కూడా సరిగ్గా చూడలేని సంపాదనలు చాలా కుటుంబాలను నాశనం చేస్తున్నయి!

"ఇంతకూడు ఉడకేసి పడేస్తే తలాకాస్తా డబ్బాల్లో పెట్టుకొని పొద్దున్నే బయటపడతాం.. తరువాత కాలేజీ నుంచి ముందు వచ్చేది నేనే. అందువల్ల వాళ్ళు వచ్చేటప్పటికి నన్ను వంట చేయమంటుంది అమ్మ. నేను చేయనని స్పష్టంగా చెప్పేశాను. ఇన్నాళ్లూ వాళ్ళిద్దరే కొట్టుకు చచ్చారు. ఇప్పుడు నాతోను పోరు మొదలైంది!"

"శుభ్రంగా వంట మనిషిని పెట్టుకుంటే సగం సమస్యలు తీరిపోతాయ్!"

"చెప్పాను గదా ఆంటీ! డబ్బు... డబ్బు... అది ఖర్చవుతుందనే యావ... ఎవరూ లేకుండా వంటమనిషి మీద ఇల్లు వదిలేస్తే గుల్ల అవుతుందేమోనని మరో భయం... దానికి విరుగుడుగా పెద్దవాళ్ళను తీసుకువచ్చి ఇంట్లో పెట్టుకోవచ్చు గదా అంటే మరింత అదనపు ఖర్చని ఏడుపు! మనుష్యులమీద డబ్బు ప్రభావం ఎక్కువై మానవత్వం మరుగైపోతున్నప్పుడు వచ్చే సమస్యలు ఇవి. రేపు వాళ్ళ భవిష్యత్తేమిటో వాళ్ళు ఆలోచించటంలేదు. ఒకరోజు ఇదే మాట అమ్మతో అంటే ఏమన్నదో తెలుసా.." అతడు కొద్ది క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. "నువ్వు పెట్టే బోడి తిండికోసం నోరు తెరుచుకు చూస్తుంటాననుకుంటున్నావా? రిటైర్ అయ్యేలోగా ఏదైనా ఓల్డేజ్ హోంలో డీలక్స్ ఏసీ కాటేజీ బుక్ చేసుకుంటా-అంది. మరి బంధాలు, అనుబంధాలు అక్కరలేదా అంటే- ఏం చేసుకోను కోసుకు తింటామా వాటిని- అన్నది!"

శాంతకుమారి ఆలోచిస్తున్నట్లుగా ఆనంద్‌నే చూస్తూ వుండిపోయింది. "నాకు నేను చాలు, ఎవరూ అక్కరలేదు- అనేది నేడు మనుష్యుల్లో ప్రబలుతున్న భావన. ఓకే.. లోకం గురించి మనం తరువాత ఆలోచిద్దాం. ఇప్పుడు నాకు చెప్పు - నువ్వు ఇంటి పరిస్థితుల కారణంగానే డిప్రెషన్‌లో

## కొత్తగాలి...

**తూర్పుకి ఈశాన్య ద్వారానికి**
**నడుమ వేలాడగట్టిన**
**అపురూప తోరణం**
**వానవిల్లు!**

– మాధవీ సనారా,
అనకాపల్లి

పడి చదువును నిర్లక్ష్యం చేస్తున్నావా? మొదటి రెండు ర్యాంకుల్లో వుండేవాడివి పదికంటే కిందకు దిగిపోయావంటే మీ ఇంటి వాతావరణం అంతగా కలచి వేసిందా లేక ఇంకేమైనా సమస్యలా? "

"ఇంకేం లేవు ఆంటీ!" అన్నాడు తలవం చుకొని. డ్రగ్స్ విషయంలో తనని ఇన్‌స్పెక్టర్ స్టేషన్‌లో కూర్చోబెట్టటం, ఆపైన వెంకట్, రాజులాంటి వాళ్ళ గురించి చెప్పాలనుకున్నాడు గాని, చెప్పలేకపోయాడు.

"ఓకే... మీ అమ్మా నాన్నలని నా దగ్గరకు ఒకసారి తీసుకు రాగలవా? "

"వద్దు ఆంటీ! వాళ్ళు రారు... వచ్చినా వాళ్ళ గోలను మీరు భరించలేరు!"

శాంతకుమారి నవ్వింది. "ఈ వయస్సులో వున్న నువ్వు ఎన్ని కష్టాలనైనా భరించి చదువుకుంటూ జీవితంలో నిన్ను నువ్వు ఉన్నతమైన వ్యక్తిగా రూపొందించుకోవాలనే ధ్యేయంతోనే అడుగులు వేయాలి. మీ అమ్మానాన్నలను వాళ్ళ గొడవేదో వాళ్ళను పడనీయ్. నీకు డబ్బు అవసరముంటే చెప్పు.. నేను ఇస్తాను...!"

"డబ్బుకు ఇబ్బందిలేదు ఆంటీ! వాళ్ళు ఎంతగా కొట్టుకు చచ్చినా డబ్బు అడిగినప్పుడు ఏడుస్తూనైనా ఇస్తున్నారు!"

"అయితే మళ్ళా హాస్టల్‌కు వెళ్ళిపోవటమో, ఎక్కడైనా రూం తీసుకొని వుండటమో చేయి. వాళ్ళు కలిసి వుంటారో విడాకులు తీసుకుంటారో వాళ్ళ ఇష్టం. విడాకుల కేసు ఎన్నాళ్ళబట్టి నడుస్తున్నది? "

అతడు చెప్పటానికి తటపటాయిస్తూ కొన్ని క్షణాలు ఆగాడు. "ఒకరోజు అమ్మ ఒక మాట అన్నది- నువ్వు నా దగ్గర ఉంటావో, మీ నాన్న దగ్గరుంటావో తేల్చుకో. మేం విడిపోతున్నాం!- అంటూ విసురుగా వెళ్ళిపోయింది. అంతవరకూ వాళ్ళు విడాకులు తీసుకోవాలని అనుకుంటున్నారని నాకు తెలియనే తెలియదు! ఆ మాటలకు అయోమయంలో పడ్డాను. ఇంత వరకూ వచ్చారా వీళ్ళు. నాకా విషయం అప్పటి వరకూ తెలియకపోవటమే నన్ను కలవరపరిచింది! నాకీ నరకం మహావుంటే మరో వారం రోజులు. తరువాత నేను స్వేచ్ఛాజీవిని"

శాంతకుమారి మాట్లాడలేకపోయింది. అతడి మనస్సులోని వేదన ఆమెనూ కలవరపరుస్తున్నది.

"అందుకే వాళ్ళంటేనే అసహ్యమనిపిస్తున్న నేను, జడ్జిగారు వాళ్ళను ఆలోచించుకోవటానికి ఆరునెలలు సమయమిస్తానని అన్నప్పుడు- నిగ్రహించుకోలేక లేచి నిలబడి వెంటనే మంజూరు చేసేయండి- అంటూ చెప్పేశాను!"

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలు. ఊరి బయట ఫామ్‌హౌస్‌లో గానాబజానా సాగుతోంది. ఆరోజు వెంకట్ పుట్టినరోజు. రాజు, చంద్రశేఖరం, రామంతో పాటు మరో పది మందిదాకా ఆడామగా వున్నారు.

క్రితం రోజు చంద్రశేఖరాన్ని ఇన్‌స్పెక్టర్ విజయ్ రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకొని స్టేషన్‌లో కూర్చోబెట్టిన అరగంటలోనే పైనుంచి ఫోన్లు వచ్చాయి. చంద్రశేఖరం ఒకటే మాటమీద వున్నాడు. "వాడెవడో నాకు తెలియదండీ. రోడ్డుమీద లక్షమంది వస్తూపోతుంటారు. నేను బయట రోడ్డు మీద కాలుపెట్టటం, అప్పటి దాకా అక్కడ కూర్చున్నవాడు రయ్‌న దూసుకుపోవటం ఏకకాలంలో జరగటం వాస్తవమేగాని.. అలా జరగటం నా తప్పా? దానికి నేనెలా బాధ్యుణ్ణి? " అంటాడు.

ఏసీపీ ఒకటేమాట అన్నాడు. "అతడి దగ్గర డ్రగ్స్ దొరకనప్పుడు ఏమని కేసు పెడతారు... ఆ కుర్రవాడిని వెంటనే వదిలేయండి.. కేసు నిలబడకపోగా కోర్టులో మన చేతగానితనానికి చివాట్లు తినాలి!"

చురక అంటించాడు.

ప్రశాంత్‌కీ, విజయ్‌కీ అర్థమయింది ఏసీపీ మీద ఎంత ఒత్తిడి ఉన్నదో!

ఆ రోజు ఆ ఫామ్‌హౌస్‌కి రాగిణి రాలేదు. వాళ్ళ హోటల్లో పది రోజుల్లో ఎయిడ్స్ మీద ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ జరగబోతోంది. విదేశాల నుంచీ డెలిగేట్స్ వస్తున్నారు. ఆ హోటల్ ప్రారంభించిన తర్వాత వచ్చిన మొదటి పెద్ద అవకాశం. విజయవంతంగా దానికోసం ఏర్పాట్లు చేస్తే దేశమంతా హోటల్ చంద్రిక పేరు తెలుస్తుందనేది వాళ్ళ ఆశ.

అందుకే చక్రవర్తి కూతుర్ని క్షణం వృథా చేయకుండా ఆ ఏర్పాట్లలో వుండమని ప్రత్యేకంగా చెప్పాడు.

"రాగిణి లేకపోవటంతో పార్టీలో రంజు లేకుండా పోయింది!" రామం అన్నాడు.

"రాగిణి రాలేదు అనేదానికంటే, ఆమె రాకపోవటంతో శ్యామలా రాలేదనేది నా బాధ!" వెంకట్ అన్నాడు నీరసంగా. అతడికి తెలియదు... రాగిణి వచ్చినా వెంకట్ ఇచ్చే పార్టీ అంటే శ్యామల రాదని!

ఆడ మగా తేడా లేకుండా తాగుతూ డ్యాన్స్ చేస్తున్నారు. వాళ్ల డ్రింక్స్‌లో మత్తు పదార్థాలు కలిశాయని అందరికీ తెలుసు. ఒకళ్ళిద్దరయితే వాటితో పాటే సిగరెట్టు పొగలలోనూ తన్మయులవుతున్నారు.

వెంకట్ అప్పటికే మూడు రౌండ్లు తాగేశాడు. కళ్ళు బాగా ఎర్రబడినయ్. నోటికొచ్చిందలా వాగుతున్నాడు. పక్కనున్న రామం, రాజు అతడి ప్రతిమాటకు వత్తాసు పలుకుతున్నారు. "మన్ని పోలీస్ స్టేషన్‌లో కూర్చోబెట్టించిన ఆనంద్‌గాడిని సర్వనాశనం చేస్తేనేగాని తృప్తి వుండదురా... శ్యామల వాడితో మాటకలుపుతున్నదీ అంటే నాకు ఒళ్ళు మండిపోతోంది. దాన్ని ఎలాగయినా అనుభవించాలి. లొంగకపోయిందో కిడ్నాప్ చేసయినా అనుభవిస్తాను. లేదా అదెవ్వరికీ ఉపయోగపడకుండా ముఖాన యాసిడ్ పోస్తా!" మాటలు బరువుగా వస్తున్నాయి.

★ ★ ★

## శిష్య పరమాణువు సందేహం!

ఎలక్ట్రిక్ బల్బులో ఎక్కువ కాలం మన్నికగా ఉండే ఫిలమెంట్‌ని తయారు చేయటానికి ఎడిసన్ కొన్నినెలల పాటు రాత్రింబవళ్ళు పనిచేశాడు. ఆ ప్రయత్నంలో యాభైవేల ప్రయోగాలు విఫలమయ్యాయి. అయినా ఎడిసన్ ఇంకా వాటిని చేస్తూనే



ఉన్నాడు. దాంతో అతడి వద్ద శిష్యుడిగా చేరిన యువకుడికిది మరీ చాదస్తం అనిపించింది. ఒకరోజు అతను విసుక్కుంటూ 'ఎడిసన్ అంటే అనేక వస్తువులు కనిపెట్టిన విజ్ఞాని అని అనుకున్నాను. కాని ఒకచిన్న ఫిలమెంట్ కనుక్కోడానికి యాభైవేల ప్రయోగాలు చేసేవ్యక్తి అనుకోలేదు' అన్నాడట.

వెంటనే ఎడిసన్ 'బాబూ! చిన్నవాడివి. నీకు అనుభవం లేకపోవటంతో అలా అన్నావు. మేధావితనం అంటే తెలివితేటలు కాదు, కష్టపడటం మాత్రమే! ప్రపంచానికి నా విజయాలే తెలుసు. కాని ఒక్కో విజయం వెనుక నేనెన్ని వేలసార్లు అపజయాల పాలయ్యానో, ఎంత మానసిక వేదనకు గురయ్యానో లోకానికి తెలీదు పాపం. ఇంత జరిగినా మళ్ళీ రెట్టించిన ఉత్సాహంతో ఎలా పనిచేశానో నా అంతరాత్మకే తెలుసు' అన్నాడు శిష్యుడి భుజం తడుతూ.

ఎడిసన్ గొప్పతనం అప్పటికిగాని పూర్తిగా అర్థం కాలేదట ఆ శిష్య పరమాణువుకు. దాంతో మారు మాట్లాడక తెల్లబోయాడు.

సాయంత్రం నాలుగు గంటలప్పుడు స్టేషన్‌లో ప్రశాంత్ ముందున్న ల్యాండ్ ఫోన్ మోగింది. ఎత్తితే సబ్ ఇన్‌స్పెక్టర్ విజయ్ లైన్‌లో వున్నాడు. "సార్! మనం పొన్నూరు రోడ్‌లో పట్టుకున్న ఎర్రచందనం దుంగల లారీ ఒడిస్సాలోని బరంపురంకు చెందింది. అక్కడ దాన్ని దొంగిలించినట్లుగా పదిహేను రోజుల క్రితం కంప్లెయింట్ ఇచ్చాడట ఓనరు. లారీకున్న నంబరు, లోపల విడిగా పడేసి వున్న రెండు నంబర్ ప్లేట్లలో ఒకటి బోగస్!"

"కోర్టుకు తెలియబరిచి న్యాయపరంగా ఏం చేయాలో చేయండి. ఎర్రచందనం దుంగల్ని ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌కు ఇవ్వాల్సి వుంటుంది! విజయ్! వారం రోజుల క్రితం పేపర్లో ఓ న్యూస్ వచ్చింది.. చూడలేదా? వీటి అక్రమ ఎగుమతి అంతా చెన్నయ్ నుంచి జరుగుతున్నది. ఎర్రచందనం చెక్కను విదేశాల్లో సంగీత వాయిద్య పరికరాలు, ఇంటి అలంకరణకు పనికివచ్చే సామాగ్రిని తయారు చేయటానికి ఉపయోగిస్తున్నారని భావించారు మనవాళ్లు ఇన్నాళ్లూ. కానీ అది నిజం కాదని ఇప్పుడు తేలింది. దీంట్లో వున్న టీరోసిబిలిన్ అన్న రసాయనంతో వయాగ్రాలాంటి మాత్రలు చేస్తున్నారట. శృంగార సామర్థ్యాన్ని పెంచే ఆ మాత్రలకు మంచిగిరాకీ! వాటిని చైనా, జపాన్, హాంకాంగ్, మలేషియాలలో తయారు చేస్తున్నట్లుగా తెలిసింది. వాటి తయారీదార్లు కోట్లు గడిస్తున్నారు. విదేశీ కంపెనీలు అందుకే స్మగ్లింగ్‌ను ప్రోత్సహిస్తున్నట్లు తెలుస్తోంది. బహుశా ఈ దుంగలు చెన్నయ్‌కే వెళుతుండవచ్చు!" అన్నాడు ప్రశాంత్.

"చెన్నయ్ వెళ్ళాలంటే హైవే మీదే వెళ్ళే వాళ్ళు కదా సార్!" అన్నాడు విజయ్.

"మనవాళ్ళ దృష్టిలో పడకుండా వుండేందుకే అడ్డదార్లు తొక్కారన్నమాట!" పకపకా నవ్వాడు. "ఈ రోజుల్లో పోలీసు బుర్ర కాదు తెలివిగలది, స్మగ్లర్‌లది. అసలు మన డిపార్ట్‌మెంట్ నుంచి కొందర్ని కచుడిని శుక్రాచార్యుల దగ్గరకు పంపినట్లుగా వాళ్ళవద్దకు పంపి ట్రైనింగ్ ఇప్పించాలి!" నవ్వుతూ చెప్పాడు.

"ఇంకోటి గూడా గుర్తుంచుకో. ఆ డ్రైవర్‌ను పట్టుకోవటం కోసం నువ్వు అనవసరంగా సమయాన్ని వృథా చేయబోకు. వాడు నీకు దొరకడు. వాడు మనకిచ్చిన డ్రైవింగ్ లైసెన్సూ బోగస్సే!"

"మరో విషయం సార్.. రాత్రి నాకు ఎవరో ఫోన్ చేసి ఆ దుంగల్ని గనుక ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌కు ఇస్తే నా తల పగలగొడతానన్నారు!" చెప్పాడు లోగొంతుకతో సబ్ ఇన్‌స్పెక్టర్ విజయ్.

"ఈసారి ఫోన్ చేస్తే చెప్పు... నేనివ్వద్దనే అంటున్నాను కానీ మా ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ ఇచ్చి తీరాల్సిందేనంటున్నాడు- వాడో పరమ మూర్ఖుడు అని!" ఫోన్ పెట్టేశాడు ప్రశాంత్.

★ ★ ★

సాయంత్రం ఆరున్నర గంటలు. చీకటి పడుతోంది. దానికితోడు ఆకాశాన్ని నల్లటి మబ్బులు ఆవరించి వుండటంతో హైవే మీద పోతున్న చాలా వాహనాలకు హెడ్ లైట్లు కూడా వెలుగుతున్నాయి. ఆ హైవే ఎప్పుడూ రద్దీగానే వుంటుంది. అందునా సాయంత్రం పూటయితే మరీ. గుంటూరు వైపుకు వెళుతున్న వాటిల్లో ఒక జీపు వున్నది. దాని డ్రైవరు సామాన్యంగా వంద కిలోమీటర్ల స్పీడుకు తక్కువ వెళ్ళడు. ఆ చుట్టుపక్కల ఉన్న రోడ్లన్నీ అతడికి కొట్టిన పిండి. కానీ ఆ సమయంలో ఎదురు వస్తున్న వాహనాలే ఎక్కువ వుండటంతో అరవై దాటలేకపోతున్నాడు. అతడికి మహా చికాకుగా వున్నది.

రోడ్డుకు అటూ ఇటూ పెద్దపెద్ద కోల్డ్

స్టోరేజ్ గోడౌనులు. చాలా వాటి ముందు పడేసివున్న మిర్చిబేళ్ళను లోపలకు తీసుకు వెళుతున్నారు. రైతులు పండించిన ఎండు మిర్చిని మంచి బేరం వచ్చేంత వరకూ వాటిల్లో ఉంచుతారు. మరీ డబ్బు అవసరమున్న రైతులయితే వచ్చిన ధరకు దళారులకు అమ్మేస్తారు. ఆ దళారులు కూడా ఆ మిర్చిని గోడౌన్లలో పెట్టి మంచి రేటు వచ్చినప్పుడు అమ్ముకుంటారు.

"అరేయ్! ఇక్కడ స్థలాల రేట్లు ఎలా వున్నయ్యో కనుక్కోండిరా.. మనం గూడా ఓ కోల్డ్‌స్టోరేజ్ గోడౌన్ కట్టిద్దాం. వాటికి గిరాకీ బాగా వున్నది. అందులో మన సరుకుల్ని పెట్టుకుంటూనే అద్దెలకూ ఇవ్వవచ్చు!" అన్నాడు జయంత్, జీపు వెనక కూర్చున్న శిష్యుడితో.

"అలాగే సార్! నాకు తెలిసిన వాళ్ళవే పొలాలున్నాయి.. మాట్లాడతాను!" అన్నాడు భుజాల వరకూ వున్న జులపాల జుట్టు అటూఇటూ కదిలేలా తలూపుతూ.

ఎదురుగ్గా ఫుల్ లోడుతో లారీలు. మధ్యలో ఆర్టీసీ బస్సులు, కార్లు, ఉండి ఉండి స్కూటర్లు. హెడ్‌లైట్ల కాంతిలో దారంతా గజిబిజిగా వున్నది. ఓ మోటర్ బైక్ అతివేగంగా ఆ వాహనాల మధ్య దూసుకుంటూ వస్తున్నది. దానిమీద ఓ పాతికేళ్ళ యువకుడున్నాడు. వీపుకు బ్యాగ్. వానొచ్చేలోగా పక్కనే పల్లెలో వున్న ఇంటికి వెళ్ళిపోవాలనేది అతడి ఆదుర్దా. అప్పటికే ముందు పోతున్న లారీని ఓవర్‌టేక్ చేయటానికి ప్రయత్నిస్తున్న మరోలారీని దాటలేకపోతానా అన్న ధైర్యంతో బండి స్పీడు పెంచి జీపును రాసుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు. అతడు మీదిమీదికి రావటాన్ని చూచి, దాన్ని తప్పించటానికి జీపును పక్కకు తీయబోవటంలో ముందున్న గోతిని గమనించలేదు. చూసేటప్పటికే చేయిదాటిపోయి, ఎంత బలంగా బ్రేకు నొక్కినా, జీపు గుంటలో పడి ఒక్క ఎగురు ఎగిరి ఎదురుగ్గా వున్న చింతచెట్టును పెద్ద శబ్దంతో ఢీకొట్టి ఆగిపోయింది. జీపులో వాళ్ళంతా అటూ ఇటూ పడిపోయారు.

జరిగిన ప్రమాదం చూస్తూనే వాహనాలన్నీ కీచుమన్న శబ్దాలతో ఆగిపోయాయి. ట్రాఫిక్ పూర్తిగా స్థంభించింది. అన్ని వైపుల నుండి జనం పరుగెత్తుకుంటూ వచ్చి కింద పడ్డవాళ్ళందరినీ లేపారు. జయంత్‌కు కాళ్ళూ చేతులూ డొక్కుపోయినయిగాని, డ్రైవర్‌కు బాగా దెబ్బలు తగిలినయ్. జీపులో డ్రైవర్ వెనకాల కూర్చున్న వాళ్ళకూ దెబ్బలు తగిలినయ్, చివర

## కొత్తగాలి...

**దిక్కులేని పిల్లలు**
**దిక్కుతోచని పెద్దలు**
**దిక్కుమాలిన చట్టాలు**
**నార్వేకు దణ్ణం పెట్టండి**

– అగ్రహారం తులసి,
మునిగూడ, ఒడిశా

ఫైరాడ్ పట్టుకొని అంచున కూర్చున్న ఓ పన్నెండేళ్ల కుర్రవాడు ఎగిరి రోడ్డుమీద పడటమే గాకుండా వెనుక నుంచి వస్తున్న లారీ టైర్ కిందపడి నుజ్జునుజ్జయ్యాడు.

కిందపడ్డ జయంత్ వడివడిగా లేస్తూనే జేబులోని సెల్ తీసుకొని ఇంటి నంబర్‌కు డయల్ చేశాడు. సరిగ్గా ఆ సమయంలో చక్రవర్తి అసహనంగా ఇంట్లో అటూ ఇటూ తిరుగుతున్నాడు. తలుపు దగ్గర బాలరాజు, కోటీ ఆయన్ను భయం భయంగా చూస్తూ నిలబడివున్నారు.

ఆయన తన అతి ముఖ్యమయిన శిష్యుడు వీరభద్రుడికి ఉరిశిక్ష వేయటాన్ని

భరించలేకపోతున్నాడు.

అప్పటికీ జడ్జి శాంతకుమారికి చెప్పాడు. ఆమెతో పరిచయం పెంచుకొని ఈ కేసు విషయంలో లబ్ధి పొందాలనే ఆమెను అనాథాశ్రమం ప్రారంభోత్సవానికి ఆహ్వానించాడు. ఆరోజు ఆమె అన్నమాటలు అంత సంతృప్తికరంగా లేకపోయినా బయట అంతకుమించి ఎలా మాట్లాడుతుందిలే అని తననితాను సముదాయించుకున్నాడు. కానీ ఆమె ఇచ్చిన తీర్పుకు అతడు కుతకుతలాడిపోతున్నాడు!

లాయర్లకు చెప్పాడు, హైకోర్టులో అప్పీలుకు వెంటనే తయారు అవ్వమని. ఎంత డబ్బు ఖర్చయినా సరే వాడు బయటకు రావాలి. తన మాట నిలబడటమే కాదు, తన పరువు నిలబడాలి. తన శక్తేమిటో నలుగురికీ తెలియాలి!

వాడి భార్యకు నమ్మకంగా ఇన్నాళ్ళూ చెబుతున్నాడు- వాడు జరిమానాతోగాని, కొద్ది శిక్షతోగాని బయటపడతాడని, డబ్బుకు ఇబ్బంది లేకుండా తాను సాయం చేస్తానని. కాని అంతా తారుమారయింది. ప్రశాంత్ సేకరించిన సాక్ష్యాలు ప్రాసిక్యూషన్ వాదనకు చాలా బలం చేకూర్చినయి. అతడు ఒకళ్ళు చెబితే వినేమనిషి కాదని అందరికీ తెలిసిందే!

తను హైదరాబాద్ వెళ్ళి వాళ్లిద్దరినీ ఇక్కడ నుండి తక్షణం తప్పిస్తేనేగాని తన వ్యాపారం సజావుగా సాగదు. ఎర్రచందనం దుంగల్ని పట్టుకున్న దాంట్లోనూ ప్రశాంత్ హస్తముందేమోనని అనుమానం. విజయ్ తన మాట వినేవాడే. ఈసారి వాడూ ఎందుకు బిగదీసుకు కూర్చున్నాడో అర్థం కావటంలేదు.

అన్నిటికీ మించి తెల్లవారేటప్పటికి అన్ని పేపర్లలోనూ పెద్దక్షరాలతో వార్త రావటం! ఏ పేపరు విలేఖరి దానికి బాధ్యుడని చెప్పగలడు. అన్ని పేపర్లకూ ఆ వార్త వెళ్ళిందంటే తన పోటీదార్లు చాలా పకడ్బందీగా పావులు కదిపారన్నమాట!

శత్రువులని భయపెట్టాలనే రామభద్రం మీద వీరభద్రుడిని ప్రయోగించింది! వాడు పోయినా తనకు పోటీ తగ్గలేదు అంటే వాడొక్కడే తన శత్రువు కాదన్నమాట... ఇంకెంతమంది వున్నారో?

ల్యాండ్‌ఫోన్ మోగుతుంటే బాలరాజు వచ్చి ఎత్తాడు. అటున్నది జయంత్! స్వయానా చక్రవర్తి కొడుకు.

"ఒక్క క్షణం సార్!" అంటూనే ఫోన్ చక్రవర్తి దగ్గరకు తీసుకెళ్ళి, "పెదబాబు!" అన్నాడు.

ఫోన్ అందుకుంటూనే "చెప్పరా? పత్తి డబ్బులు చేతికందినయ్యా?" అడిగాడు.

వాళ్ళకు చుట్టుపక్కల గ్రామాల్లో పొలాలున్నాయి. అందులో ఎక్కువగా పత్తి, మిరప పండిస్తుంటారు. నెలకు ఒకటి రెండుసార్లు జయంత్ వాటిని చూసి వస్తుంటాడు. ఎండిన మిరపను బస్తాలకెత్తించి గోడౌన్లకి పంపి, అమ్మిన పత్తికి డబ్బు వసూలు చేసుకుని వస్తుంటాడు. పక్కనే ఎప్పుడూ ముగ్గురునలుగురు అంగరక్షకులు. అతడంటే వాళ్ళ పొలాలు చేసే రైతులకే కాదు, దళారులకూ భయమే. డబ్బు బాకీ పెట్టకుండా ఇచ్చేస్తారు.

"అదేం సమస్య కాలేదుగాని... మిర్చిగోడౌన్ల దగ్గర రోడ్డుమీద జీపుకు యాక్సిడెంటయింది. నేను తీసుకు వస్తున్న ఓ పిల్లవాడు యాక్సిండెంట్‌లో పోయాడు. బాలరాజును పంపితే ఇక్కడుండి ఆ సంగతేదో చూసి వస్తాడు.. మనవాళ్ళెవరికీ అంత సీరియస్‌గా దెబ్బలు తగలలేదులే!"

"ఎవడ్రా చేసింది ఆ యాక్సిడెంటు... పట్టుకొని పొడిచి పారేయలేదా?"

"ట్రాఫిక్ అలా వున్నది నాన్నా! ఎవడికి వాడు తొందరగా వెళ్ళిపోవాలని... మన జీపు ఓ మోటర్ సైకిలిస్టును తప్పించ

బోయి రోడ్డు పక్క గుంటలో పడి తల్లకిం దులవ్వటంతో అంతా కింద పడ్డాం... ఆ పిల్లవాడు మాత్రం ఎగిరి వెనుక వస్తున్న లారీ టైర్ కింద పడ్డాడు!"

"నీకేం దెబ్బలు తగల్లేదు గదా? " ఆదుర్దాగా అడిగాడు.

"ఏమీ కాలేదు. మోచేతుల దగ్గర, మోకాళ్ళ దగ్గర డోక్కుపోయిందంతే!"

"వసూలయిన డబ్బు జాగ్రత్తగా వున్నదా? "

"అన్నీ వున్నయ్‌గాని... ముందు బాల రాజును పంపు... నేను అక్కడకు వచ్చి వివరంగా చెబుతాను!"

ఆ మాట చెబుతున్నప్పుడు అతడికి తెలియదు... అతడి వెనకాలే అంటే పనిమీద వచ్చిన ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ ఆగి వున్నాడని. అతడు దిగి అప్పుడే తన కార్యక్రమాన్ని ప్రారంభించాడని!

### కొత్తగాలి...

**పాలకులు నిర్వీర్యం**
**పాలన నిస్తేజం**
**ప్రజలు నిద్రాణం**
**చైతన్యమా! నీవెక్కడ?**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

★ ★ ★

సాయంత్రం స్కూలు అయిపోగానే మృదుల సరాసరి స్టేషన్‌కు వచ్చి ప్రశాంత్ ఎదురుగ్గా కూర్చున్నది. "రేపు వాయిదా వున్నది. మెడికల్ రిపోర్టులు రెండూ కోర్టులో ఇవ్వాలి! రిపోర్టు సరిగ్గా వచ్చిందా? " అన్నది.

"ఆసుపత్రి నుండి సీల్డ్ కవర్‌లో వచ్చింది. అది మెజిస్ట్రేట్‌గారే తెరవాలి!"

"కూర్మావతారంగాడు తప్పుడు రిపోర్ట్ ఇప్పించి వుండడుగదా!"

ఆలోచిస్తున్నట్లుగా కొద్ది క్షణాలు ఆగాడు. "అలా ఉండదమ్మా!" అన్నాడు. అక్కడ వాళ్ళు అలా చేసి వున్నట్లయితే తన దగ్గరకు డబ్బుతో మనిషిని పంపించాల్సిన అవసరం వుండేది కాదనేది అతడి నమ్మకం.

"నాకు అందరిమీదా నమ్మకం పోయింది సార్! కట్టుకున్న భర్తే నన్ను మోసం చేశాడేమోనని అనుమానం. ఆయన దుబాయ్ వెళ్ళి నాలుగేళ్ళయింది. మొదటి రెండేళ్లు డబ్బులు బాగానే పంపించేవాడు. రెండు రోజులకోసారి ఫోన్ చేస్తుండేవాడు. తరువాత తరువాత డబ్బు రావటం, ఫోన్లు చేయటం తగ్గింది. ఆరు నెలలనుంచయితే రెండూ లేవు. అక్కడ నంబరుకు చేస్తే ఆ పేరున్న మనిషెవ్వరూ లేరంటూ జవాబు. అందుకే అనుమానం... అక్కడ ఈయన ఒక్కడే ఉంటున్నాడా.. దేన్తోనయినా కాపురం పెట్టాడా అని" ఆమె తలొంచుకుని అంది.

"అనుమానం ఉన్నప్పుడు కంప్లెయింట్ ఇచ్చి మన రాయబార కార్యాలయం ద్వారా నిజానిజాలు తెలుసుకోవచ్చుగదా!"

"అలాంటి ఆలోచనలోనే ఉన్నానుకాని మధ్యలో ఈ గొడవొచ్చి నెత్తిన పడింది. నాకు అది తప్ప మరెవ్వరూ లేరు. దానిలోనే భవిష్యత్తును చూసుకుంటూ జాగ్రత్తగా పెంచుకుంటున్నాను" ఆమె కళ్ళు తడుస్తున్నాయి. "ఇంత ఘోరం జరిగి నేనూ, అదీ ఇక్కడ అన్యాయమైపోయాం!"

ప్రశాంత్ జాలిగా ఆమె వంక చూచాడు. ఆ వెధవపని చేసినవాడు నీతిలేని రాక్షసుడు. వాడికి శిక్ష పడవచ్చు. కానీ ఆ అమ్మాయికి జరిగిన అన్యాయాన్ని ఎవరు సరిదిద్దగలుగుతారు?

"నేనూ అదీ ఈ దౌర్భాగ్యపు జీవితాల్ని పోగొట్టుకున్నా సరే... ముఖ్యంగా చేయాల్సినవి రెండు పనులున్నాయి... నా కూతురుకు అన్యాయం చేసినవాడ్ని వదిలిపెట్టను. నా మెళ్ళో తాళిగట్టినవాడు నేను అనుకుంటున్నదే నిజమయితే ఇక్కడికి వచ్చి రోడ్లమీద అడుక్కుంటూ బతకాలి... ఆ రెండూ ఈ కళ్ళతో చూచేంత వరకే నేను బతికి వుండేది... తరువాత తృప్తిగా కళ్ళు మూస్తాను!" అంటూ ఆమె చటుక్కున లేచి నిలబడింది.

"మీకు రేపటి వాయిదా సంగతి గుర్తు చేసి వెళదామనే వచ్చింది... ఆసుపత్రికి వెళ్ళాలి- శారద అక్కడ మూసిన కన్ను తెరవకుండా జ్వరంతో మంచంలో పడి వున్నది!" ఆమె వడివడిగా అక్కడి నుండి వెళ్ళిపోయింది.

★ ★ ★

సాయంత్రం ఆనంద్, శ్యామలా క్లాసులో నుంచి బయటకు మాట్లాడుకుంటూ వస్తున్నారు. "నువ్వు ఈ మధ్య హోటల్ చంద్రికకు గాని వెళ్ళావా? " ఆమె వంకే తదేకంగా చూస్తూ అడిగాడు ఆనంద్.

"వెళ్ళాను!" అన్నది కళ్ళు చికిలించి, ఎందుకలా అడుగుతున్నాడో అర్థంకాక.

"ఏదైనా పార్టీ ఇచ్చిందా రాగిణి? " నవ్వాడు తనా విషయాన్ని చాలా మామూలుగా అడిగినట్లుగా.

"రాగిణి బర్త్‌డేకి ఆహ్వానిస్తే వెళ్ళాను!"

"వెంకట్, రాజు కూడా వచ్చారా? "

"అవును... వచ్చారు! ఏమైంది? " అన్నది ముఖం చిట్లించి.

కొద్ది క్షణాలు ఆలోచిస్తున్నట్లుగా ఆగాడు ఆనంద్. వెంకట్ అన్న మాటలను ఆమెకు చెబితే ఎలా స్పందిస్తుందా అని ఆలోచిస్తున్నాడు. తను విన్నదే నిజమయితే పొంచి వున్న ప్రమాదం గురించి హెచ్చరించటం మంచిది!

"అఫ్‌కోర్స్! ఇది నీ స్వంత విషయం.. ఒకసారి నీకు చెప్పాను రాగిణికి దూరంగా వుండమని. మర్చిపోయావేమోనని మరోసారి చెబుతున్నాను.. ఆమె స్నేహితులు ఎలాంటివారో నీకు తెలిసిందేగదా? "

శ్యామల కొద్దిక్షణాల వరకూ మాట్లాడలేకపోయింది. తర్వాత తేరుకొని అంది "ఆ చెట్టుకింద చేరే తొట్టిగ్యాంగ్ వస్తుందని అనుకోలేదు. ఏ మాత్రం అనుమానమొచ్చినా వెళ్ళేదాన్ని కాదు!" ఆమె వడివడిగా అడుగులు ముందుకేసింది, తాము ఎక్కాల్సిన బస్ హారన్ మోగుతుండటంతో.




**చిం**తపల్లి గ్రామం.. హైవే మీద చిలకలూరిపేటకు గుంటూరుకు మధ్యలో కాస్తంత లోపలకు ఉంది. ఉదయం ఆరు గంటలకు ప్రశాంత్ జీపులో ఆ గ్రామానికి వచ్చాడు. చలికాలం కావటంతో ఊరంతా ఇంకా నిద్రపోతున్నట్లేవున్నా కొన్ని ఇంటికప్పుల మీదుగా లేస్తున్న తెల్లటి పొగలు అప్పటికే ఆడవాళ్ళు వంట పనుల్లోకి దిగిపోయారన్నట్లుగా తెలియజేస్తోంది.

పందుంపుల్లతో వాకిటి అరుగుమీద దంత ధావనం చేస్తున్న ఓ వ్యక్తి ముందు జీపు ఆగింది. అది పోలీసు జీపుగా గుర్తించటంతో అతడు కంగారుగా నిలబడ్డాడు.

"చంద్రయ్య ఇల్లెక్కడ? "

"ఏ చంద్రయ్య సార్? "

"ఎంతమంది చంద్రయ్యలు ఉన్నారేం? " భ్రుకుటి ముడివేశాడు ప్రశాంత్.

"ఇద్దరున్నారు సార్! ఒకడు చెరువుగట్టు పక్కన మంచినీళ్ళ బావిదగ్గర గుడిసె వేసుకొని వున్నాడు.. రెండోవాడు చక్రవర్తి గారి తోటకు కాపలాగా ఆ తోటలోనే రేకుల షెడ్డులో వుంటాడు సార్!"

చూచాయగా అతడికి అర్థమయింది- తనకు కావాల్సింది తోటలోని చంద్రయ్యే అని. అందుకే "నాతోపాటు వచ్చి ఆ తోట ఎక్కడుందో చూపించు!" అన్నాడు.

అతడు భయపడుతూనే జీపెక్కాడు చేతిలో పుల్లపారేసి. "డొంకరోడ్డులో పోవాలిసార్.. దారి బాగుండదు!" అన్నాడు.

"ఫర్వాలేదు, పోగలిగినంత వరకే జీపులో పోదాం.. తర్వాత నడుద్దాం!"

జీపు కొంతదూరం పోయాక "ఏమైంది సార్? " అన్నాడు భయంతో.

"అక్కడకు వెళితేనేగాని తెలియదు!" అన్నాడు, అతడికి మరో మాటకు అవకాశమివ్వకుండా.

అది రెండెడ్ల బండ్లు తిరిగే డొంక బాట. జీపు చక్రాలు ఆ గాళ్ళలో ఇమడటం లేదు. ఆపైన రాత్రి కురిసిన వానకు నేలంతా బురద బురదగా వున్నది. ఊరికి కిలోమీటర్ దూరంలో వున్నది ఆ తోట. ఇంకా రెండువందల గజాల దూరం ఉందనగా దారి మరీ అధ్వాన్నంగా ఉండటంతో జీపును ఆపేశాడు డ్రైవరు. అందరూ దిగి గట్లమీదగా నడిచి తోటలోకి వెళ్లారు. అందులో ఎక్కువ మామిడి చెట్లే. ఓ పక్కగా బోరుబావి, దానికి పక్కగా నీళ్ళ ట్యాంకు. రెంటినీ కలుపుతూ మోటారు.

గేటు దగ్గర మనుష్యుల్ని చూస్తూనే చంద్రయ్య గుడిసె దగ్గరనుంచి పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఎదురుగ్గా పోలీసులుండటంతో కంగారు పడిపోయాడు.

"నిన్న మీ బంధువుల అబ్బాయినెవరినైనా మీ తోట యజమాని వెంట పంపించావా? "

"పంపించాను సార్! మా ఆడదానికి దూరపు బంధువవుతాడు. తింటానికి లేక అవస్థలు పడుతుంటే వారి దగ్గర కొలువుకు పంపాను!"

"ఆ పిల్లవాడు యాక్సిడెంట్‌లో చచ్చిపోయాడు!" అన్నాడు ప్రశాంత్.

"అయ్యో!" అంటూ తలపట్టుకొని అక్కడే కూలబడిపోయాడు చంద్రయ్య. అతడికి డెబ్బై ఏళ్లు ఉంటాయి. నల్లగా గడకర్రలా ఉన్నాడు. చిన్న చిన్న కళ్లు.. ముఖంమీద స్ఫోటకం మచ్చలు.. తలకు గుడ్డ చుట్టుకొన్నాడు. అంటే వాళ్లు ఇంతవరకూ అతడికి విషయం తెలియజేయలేదన్నమాట.

"అనవసరంగా ఏడవబోకు.. అతడిని వాళ్లకు ఎంతకమ్మావో చెప్పు? "

ఉలిక్కిపడ్డట్లుగా లేచి నిల్చున్నాడు. క్షణంలో ఏడుపు మాయమయింది.

"అమ్మటమేమిటి సార్! అయ్యగారు అనాథాశ్రమంలో పనిచేసేందుకు మనుషులు కావాలని ఇక్కడ్నుంచి కొంతమంది పిల్లల్ని తీసుకువెళ్లారు. ఇక్కడ దొరికే కూలీ కంటే డబ్బులెక్కువిస్తామంటే మా బంధువుల అబ్బాయినీ పంపించాను!"

"నీకు పదివేలు దేనికిచ్చారు వాళ్లు? మనిషిని కుదిరించినందుకు లంచమా? "

అతడు బిగదీసుకు పోయాడు.

"జీపెక్కు!" అన్నాడు. వెనుక కూర్చున్న కానిస్టేబుల్స్ ఇద్దరు దిగి అతడిని పట్టుకొని జీపెక్కించారు.

నిన్న సాయంత్రం యాక్సిడెంట్ తర్వాత శవాన్ని ఆస్పత్రికి పంపి, ఆ జీపులోనే ఓ పాత కేడీ ఉండటం గమనించి వాడిని పట్టుకొని రాత్రి పన్నెండు గంటలప్పుడు స్టేషన్‌కు తీసుకువచ్చారు కానిస్టేబుల్స్.

"ఎన్నాళ్ళయిందిరా సార్ దగ్గర జేరి? దొంగతనాలు మానేశావా? " అడి

గాడు ప్రశాంత్ నవ్వుతూ.

"ఆరునెలలు సార్! జీతానికి కుదిరాను... దొంగతనాలు చేయటం మానేసి చాలా కాలమయింది సార్!"

"అయితే మంచివాడివయ్యావన్నమాట.. నిన్న మీరు వస్తున్న జీపు యాక్సిడెంట్ అయినప్పుడు ఒక కుర్రవాడు లారీ కింద పడి చచ్చాడుగదా.. ఇంకా ఇద్దరు పిల్లలు చిన్న చిన్న దెబ్బలతో బయటపడ్డారు... మీ జీపులో పిల్లలెందుకు ఉన్నార్రా? " ప్రశాంతంగా అడిగాడు ప్రశాంత్.

"నాకేం తెలుస్తుంది సార్..? " అన్నాడు దణ్ణం పెడుతూ.

"అంతేనంటావా? "

"నిజం సార్... అమ్మతోడు!"

హెడ్ కానిస్టేబుల్ని పిలిచి "మూడో నంబర్ సెల్‌లో పడేసి, టీ తెచ్చి ఇవ్వు... నేను వచ్చి మాట్లాడతాను!" అన్నాడు ప్రశాంత్ సీట్‌లోనుంచి లేస్తూ. అప్పుడు అతడి చేతిలో ఓ లావుపాటి లాఠీ ఉంది.

ఆ మాట విన్న మరుక్షణంలోనే అతడు ప్రశాంత్ కాళ్లు పట్టుకొని ఏడుస్తూ వాడికి తెలిసిందంతా వివరంగా చెప్పసాగాడు.

★ ★ ★

పది గంటలకే మృదుల వచ్చి ప్రశాంత్ కోసం ఎదురు చూస్తూ కోర్టుముందు నిలుచున్నది. కూతురు ఇంకా ఆసుపత్రిలోనే ఉన్నది జ్వరం తగ్గకపోవటంతో.

కోర్టు తెరిచి ఉన్నది. లాయర్లు వస్తున్నారు. కక్షిదారులు వస్తున్నారు. ప్రశాంతూ వచ్చాడు. జడ్జిగారు వచ్చి తన సీటులో కూర్చోవటంతో హాలంతా నిశ్శబ్దం! బెంచిక్లర్క్ ఆ రోజు కేసు ఫైల్స్ తీసి ఆయన ముందు పెట్టాడు.

ముందుగా కూర్మావతారం పెట్టిన డిఫెన్స్ లాయరు లేచి, "రాత్రి నా క్లయింట్ గుర్నాథానికి గుండెనొప్పి వస్తే ఆసుపత్రిలో జేర్చారు యువరానర్! జైలు అధికారులు ఇచ్చిన లేఖను, అందుకుగాను ఆసుపత్రివారిచ్చిన ధ్రువపత్రాన్ని మీ పరిశీలనకు సమర్పిస్తున్నాను!" అంటూ కాగితాలు ఇచ్చాడు.

వాటిని పరిశీలించిన న్యాయమూర్తి, "కేసును పదిహేను రోజులకు వాయిదా వేస్తున్నాను!" అంటూ ఫైల్ మీద రాసి పక్కన పడేసి మరొకటి అందుకున్నారు.

## ఎవరి ఆనందం వారిదేనా?

ఒకరోజు ఎడిసన్ ఇంటికి రాగానే ఆయన భార్య 'రేపే మన వివాహ వార్షికోత్సవం. మీకెక్కువ ఆనందం కలిగించే ప్రాంతానికి వెళదాం. కాదనకండి!' అంది.

దానికి ఎడిసన్ తలూపుతూ 'అలాగే, తప్పకుండా వెళదాం. నీ మాట నేనెప్పుడన్నా కాదన్నానా? ' అన్నాడు లాలనగా.



రెండోరోజు ఉదయమే ఎడిసన్ భార్య చక్కగా అలంకరించుకుని, భర్తనూ ముస్తాబు చేసింది. భార్యాభర్తలు నాలుగు గుర్రాలు పూన్చిన బండి ఎక్కారు.

ఎడిసన్ స్వయంగా ఆ బండి తోలుతున్నందుకు ఆయన భార్య మరీ సంతోషించింది. ఆ బండి ఆగగానే ఆమె బయటకు చూసింది. సంభ్రమాశ్చర్యాలతో నోటమాట రాలేదామెకు. ఎందుకంటే వారు వచ్చింది లాబోరేటరీకి!

కాసేపటికి ఓ పనివాడు ఓ చిన్న కాగితం తెచ్చి ఆమె కిచ్చాడు. అందులో 'నాకెక్కువ ఆనందం కలిగించే ప్రదేశం ప్రపంచంలో ఇదే! అందుకే ఇక్కడికే వచ్చాను' అని ఎడిసన్ స్వహస్తంతో రాసిన అక్షరాలున్నాయి

ప్రశాంత్ నవ్వుకుంటూ బయటకు వచ్చేశాడు - ఇలాంటి కేసుల్లోని పెద్దమనుష్యులకు ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు గుండెనొప్పి రావటం సహజమేనని.

మృదుల అసహనంగా డిఫెన్స్ లాయరు వంక చూస్తూ బయటకు వస్తుంటే జాలిగా ఆమె వంక చూచాడు ప్రశాంత్. నిజాయితీ పరులను, సామాన్యులను రక్షించగలిగే శక్తి ఇక్కడ ఎవ్వరికీ లేదు. జాలిపడటం తప్ప చేసేదేం లేదు!

కోర్టుహాలు నుండి బయటకు వచ్చి వరండాలో నడుస్తుండగా ఆనంద్ ఎదురు పడ్డాడు. ప్రశాంత్‌ను చూస్తూనే "నమస్కారం సార్!" అన్నాడు హుషారుగా.

## కొత్తగాలి...

**నిన్నటి**
**ములాఖత్‌లు**
**రేపటి**
**మిలాఖత్‌లు**

*- అంబటి వెంకట శివారెడ్డి,*
యర్రగుంట్ల, కడప జిల్లా

"ఈ రోజు మా మూర్ఖుల కేసు ఉంటే వచ్చాను సార్! సంతోషకరమైన వార్త... వాళ్లకు విడాకులు మంజూరయ్యాయి"

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలప్పుడు శ్యామల ఆనంద్‌కు ఫోన్ చేసింది. "అవును మొన్న నాకో ప్రశ్న వేశావ్... అసలు నేను హోటల్‌కు వెళ్లిన సంగతి నీకెలా తెలిసింది? "

అతడు ఆ విషయాన్ని నాన్చదలచుకోలేదు. "వెంకట్ చెప్పాడు" అన్నాడు.

"వ్వాట్.. మీ మధ్య మాట్లాడుకునేంత సయోధ్య కూడా ఏర్పడిందా? " అన్నది పకపకా నవ్వుతూ.

"సయోధ్యా పాడా.. మనిద్దరం కాలేజీలో మాట్లాడుకోవడం చూశాడు.. ఇంకోసారి అలా నీతో మాట్లాడవద్దని నాకు వార్నింగ్ ఇచ్చాడు!"

"మీరిద్దరూ ఆ హోటల్లో కలిసి త్వరలో వివాహం చేసుకోవాలనుకున్నారట కదా!"

"ఏం మాట్లాడుతున్నావ్! ఆ రోగ్‌ను పెళ్లి చేసుకోవటమా? " అరిచిందామె.

"నాకేం తెలుసు.. మీరేం మాట్లాడుకున్నారో.. అతడన్నమాటలు చెప్పాను.. అబద్ధమయితే అభినందనలు.. నిజమయితే ఆలోచించుకొని ముందుకు అడుగు వేయమని నా ఉద్దేశ్యం!"

ఫోన్ ఆఫ్ చేస్తూనే రాగిణికి రింగ్ ఇచ్చింది. అదే ఆమె చేసిన తప్పు!

★ ★ ★

మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు మృదుల పోలీస్ స్టేషన్‌కు వచ్చింది. అప్పటికింకా ప్రశాంత్ రాలేదు.

ఆమె ముఖమంతా వాడిపోయి ఉన్నది. బాగా ఏడ్చిందన్నట్లుగా కళ్లు ఎర్రబడి ఉన్నాయి. జుట్టు చెదిరి నల్లటి ముఖమంతా ఆవరించగా చూడటానికే అసహ్యంగా ఉన్నది. ఆమె ప్రశాంత్‌కు ఏదో చెప్పాలన్నంత ఆదుర్దాగా ఉన్నది.

"సార్ ఎన్నింటికి వస్తారు? " అరుస్తున్నట్లుగా సెంట్రీని అడిగింది.

ఆమె తరచూ స్టేషన్‌కు వస్తుండటంతో అతడు ఆమెను గుర్తించాడు.

"తెలియదండి!..."

"ఇల్లెక్కడ? " అడుగుతోంటే వాకిట్లో మోటర్ బైక్ ఆగటం, దానిమీద నుంచి ప్రశాంత్ దిగటం జరిగింది!

అతడిని చూస్తూనే ఆమె వరండా మెట్ల మీదనుంచి దూకుతున్నట్లుగా దిగి దగ్గరకు వెళుతూనే "మా ఇల్లంతా ఎవరో దోచేశారు.. రాత్రి ఆసుపత్రిలో అమ్మాయి దగ్గరుండి పొద్దున్నే ఇంటికి వచ్చేటప్పటికి

తాళం పగలగొట్టి ఉన్నది. ఖరీదయిన వాటిని ఎత్తుకు పోవటమే గాకుండా తీసుకు వెళ్లటానికి వీలులేని వాటిని ధ్వంసం చేసి చిందరవందర చేశారు!" అన్నది ఏడుపును బిగపట్టుకుంటూ.

"అది చేసింది కూర్మావతారం మను ష్యులని నా అనుమానం. కేసును వెనక్కు తీసుకొనమని ఇప్పటికే నా మీద ఒత్తిడి తీసుకువస్తున్నారు. నేను ఒప్పుకోవటం లేదు... వాళ్లకు మించి నా మీద ఎవరికీ కోపం లేదు..." ఆమె ఆగకుండా మాట్లా డుతూనే ఉన్నది.

★ ★ ★

"ఈ రోజు సాయంత్రం నువ్వు నాతో పాటు మా హోటల్‌కు వస్తున్నావ్!" రాగిణి శ్యామల చేయిపట్టుకుంటూ అంది, మర్నాడు ఉదయం కాలేజీలో కనబడగానే.

శ్యామల కాస్త ఇబ్బందిగా చూచింది.

"కొందరు వాళ్ళేం మాట్లాడుతారో వాళ్లకే తెలియదు. వాటిని ఒక చెవితో విని మరో చెవితో వదిలేయాలి. అంతేగాని వాటి గురించే ఆలోచిస్తూ మన బుర్ర పాడుచేసు కోగూడదు!" అంది రాగిణి.

"ఆ వెధవ నోటికొచ్చిందల్లా వాగుతుంటే నోర్మూసుకు కూర్చోవాలా?" కస్సున లేచింది శ్యామల.

"కూల్‌డౌన్ మై డియర్.. నోటికొచ్చిం దల్లా వాగాడు కాబట్టే వెధవయ్యాడు.. ఫర్‌గెట్ ఇట్!" అనునయిస్తున్నట్లుగా ఆమె భుజం మీద చేయి వేసింది రాగిణి.

"ఇవ్వాళ అస్సలు నేను కాలేజీకి రాదలు చుకోలేదు.. ఫోను మీద నిన్ను ఒప్పిం చటం అయ్యేపని కాదని తెలిసే నిన్ను తీసుకు వెళ్లటానికే స్వయంగా వచ్చాను!"

"ఏమిటి ప్రత్యేకత?"

"రెండు పనులున్నాయి.. ముంబయిలో బ్యూటీషియన్‌గా మంచి పేరున్న స్మితా జోషీ చెన్నయ్ వెళుతూ మా బ్యూటీపార్లర్ విషయంలో సలహాలిచ్చేందుకు మా కోరిక మీద వచ్చారు. నువ్వు పోటీలో పాల్గొనే ముందు తీసుకోవాల్సిన జాగ్రత్తలను ఆమెతో చర్చించాలి. రెండోది మా చెఫ్ చేసే రకరకాల జ్యూస్‌లు రుచిచూసి ఏవి బాగున్నాయో నిర్ణయించాలి!"

"నేను అసలు ఏ అందాల పోటీలోనూ పాల్గొనని స్పష్టంగా చెప్పాను. ఇంకా సలహాలు చెప్పమంటూ ఎందుకు శ్రమ పెట్టి ఆమె సమయాన్నంతా వృథా చేయాలి? ఇక రెండోదానికైతే రెడీ!" అన్నది నవ్వుతూ శ్యామల.

"అబ్బా! అంత మొండితనం పనికిరాదు శ్యామలా. నేనేం చెప్పినా నీ మేలు కోరే.. ఎనీ హౌ.. ముందు అక్కడకు రావటానికి ఒప్పుకున్నావ్. అదే సంతోషం!"

ఇద్దరూ హోటల్ చంద్రికకు వెళ్లి ఆమె ప్రైవేట్ ఏసీ రూంలో కూర్చున్నారు. వాళ్లు కూర్చున్న ఐదు నిమిషాలలోనే సుస్మిత వచ్చింది. "నీకు గుర్తున్నదా నా బర్త్‌డే పార్టీనాడు ఇదీ, దీని కజిన్ వనజ వచ్చారు... నీకు పరిచయం చేశాను కూడా!" అన్నది రాగిణి.

"గుర్తు లేకపోవటమేమిటి... ఫస్ట్ ఇయర్ అన్నారు గదా!" ముభావంగా అన్నది శ్యామల. ఆరోజు ఈ అమ్మాయి మగపిల్లలతో సమానంగా గంతులేయ టాన్ని ఎలా మర్చిపోగలదు?

ఆనంద్ ఇంతకు ముందు కేవలం సూచ నగానే చెప్పాడు. ఈసారి చివాట్లు పెట్టినా పెట్టవచ్చు!

వాళ్లముందు ఐదు రకాల పండ్లరసాలు ఒక్కొక్కటి మూడు గ్లాసుల్లో పోసుకొని ఓ కుర్రవాడు వస్తే, వెనగ్గా వచ్చిన చీఫ్ చెఫ్, "ఇక నిర్ణయం తీసుకోవల్సింది మీరే మేడమ్.. ఒకదానికి మించిన టేస్ట్ మరో దానికి ఉంటుంది?" అన్నాడు చిన్నగా.

"ఫైన్! ఒక గంట గడిచాక రండి..

వాటి రుచుల్ని ఆస్వాదించి మా నిర్ణయం చెబుతాం!"

అతడు వెళ్లిపోయాడు.

"ఇప్పుడు వీటిల్లో ఏది మరీ బాగుంటుందో మనం నిర్ణయించాలి. అప్పుడు వాటిని మా హోటల్ కే ప్రత్యేకం అంటూ ప్రచారం మొదలు పెడతాం? " అన్నది రాగిణి వాళ్లిద్దరినీ చూస్తూ.

"పోనీ ఆ ప్రకటనలో నీ ఫొటో వేయటానికైనా అంగీకరిస్తావా? " అన్నది కంఠంలో కాస్తంత ఎగతాళిని నింపుకొని శ్యామల వంక చూస్తూ.

శ్యామల సుస్మిత వంక చూచింది.

"రాగిణి అడగాలేగాని నాకెలాంటి అభ్యంతరమూ లేదు. మన అందాలు ముడుచుకు కూర్చోవటంలో బయటపడవ్. ముందుకు దూసుకు వెళితేనే తలమీద సువర్ణ కిరీటాలను పెట్టించుకోగలిగేది!" అన్నది సుస్మిత పకపకా నవ్వుతూ.

"మనం ఇప్పుడు ఎలక్ట్రానిక్ యుగంలో ఉన్నాం. పాతకాలంలో లాగా తలుపు వెనకాల నిలబడి మాట్లాడి మగవాళ్ల ఇగోని తృప్తిపరచాల్సిన అవసరం లేదు. మన చదువుల్ని సార్థకం చేసుకొని వాళ్లమీద మన ఆధిక్యతను నిరూపించుకోవాలి!"

రాగిణి ఆనందంగా చప్పట్లు కొట్టింది. "సుస్మిత సూపర్ ఫాస్ట్!" అన్నది ఆ అమ్మాయి భుజం మీద చేతులు వేసి దగ్గరకు తీసుకుంటూ.

"నువ్వు కాదంటున్నావు కాబట్టి బలవంత పెట్టను. ఈ ఏడాది సుస్మితను అందాల పోటీలో పాల్గొనేలా చేద్దాం!"

సుస్మిత ముఖం రాగిణి మాటలకు సంతోషంతో విశాలమయింది.

శ్యామల మాట్లాడకుండా వాళ్ళిద్దరినే చూస్తూండిపోయింది కొన్ని క్షణాలు.

"ఓకే! ఇక అసలు విషయంలోకి వద్దాం. మనముందు ఐదు రకాల డ్రింకులున్నాయి కదా! ఒక్కొక్కటి మనం టేస్ట్ చేసి మార్కులు వేద్దాం. ముగ్గురం ఎక్కువ మార్కులిచ్చిన వాటితో మొదలు పెట్టి చెఫ్‌ను కూడా పిలిచి వాటిని గురించి విపులంగా చర్చించి అందులో మూడింటిని ఎన్నుకొని 'ఇవి మా హోటల్ స్పెషల్స్' అంటూ యాడ్ ఇద్దాం. వారం రోజుల్లో జనం వాటికోసం హోటల్ ముందు క్యూ కట్టాలి!" రాగిణి హుషారుగా చెబుతోంది.

"మనకు నచ్చినవే అందరికీ నచ్చాలనేమున్నది? " శ్యామల సంశయంగా అంది.

"అందుకే మూడు రకాలు ఎన్నుకుంటున్నది. అందులో మన ముగ్గురికీ నచ్చిన ఒకదానికి ఎక్కువ ధర పెట్టామనుకో దానిమీద మరింత మోజు పెరుగుతుంది జనానికి. ఈ డబ్బున్నవాళ్ల మనస్తత్వమే అది. ఎక్కువ ధర ఉన్నదానికి ఆర్డరిస్తూ నలుగురిలో తాము చాలా గొప్పవాళ్ళం అన్నట్లుగా భావిస్తుంటారు!"

"సో.. నువ్వు బిజినెస్ చిట్కాలన్నీ పట్టేశావ్!" అన్నది నవ్వుతూ శ్యామల.

కానీ ఆమెకు ఆ క్షణాన తెలియదు... రాగిణి చెబుతున్న ఈ మాటల వెనుక వెంకట్ ఉన్నాడని, శ్యామలను మాదకద్రవ్యాల ఊబిలోకి దించాలన్నదే వాళ్ళ ధ్యేయమనీను!

★ ★ ★

కాలేజీ బస్సులు వస్తున్నాయి. బస్సులు దిగిన విద్యార్థులు లోపలకు వెళుతున్నారు. శ్యామలా క్లాసులోకి వెళ్లిపోయింది.

వెనగ్గా దిగిన ఆనంద్ చెట్ల కింద కొద్దిమంది విద్యార్థులు గుమిగూడి ఉండటం చూశాడు. అది రోజూ కనబడే దృశ్యమే అయినా వాళ్లమధ్య సుస్మిత ఉండటం ఆశ్చర్యం కలిగించింది. ఆ అమ్మాయి తన తల్లి స్నేహితురాలి కూతురు. మొదటి సంవత్సరం చదువుతున్నది. కాలేజీలో జేర్చేముందు ఒకసారి తల్లీ కూతుళ్ళిద్దరూ

తమింటికి వచ్చారు, కాలేజీని గురించిన వివరాలు కనుక్కునేందుకు. తరువాత కాలేజీలో చేరాక కనబడ్డప్పుడల్లా చిరునవ్వుతో మాట్లాడిస్తుంటుంది. చదువు విషయంలో అప్పుడప్పుడూ ఇంటికొచ్చి సలహాలు అడుగుతుంటుంది.

సుస్మిత ఇప్పుడు వెంకట్ గ్యాంగ్ నడుమ ఉండటంతో అటుపక్కకు వడివడిగా వెళ్ళాడు, ఆ అమ్మాయిని ర్యాగింగ్ చేస్తున్నారేమో అన్న అనుమానం రాగా. అయినా కాలేజీ ఇప్పుడు కొత్తగా తెరవలేదు కదా!

"ఇంకొక మాట మాట్లాడావంటే ఇదుగో ఇటు చూడు.. నా చేతిలో ఉన్నది నా ఎడం కాలి చెప్పు.. దీంతోనే నీ నోట్లోని పళ్ళన్నీ ఊడగొట్టి నీ చేతిలో పెడతాను... మీ వెధవల్లో ఎవడయినా అందర్నీ ఏడిపించినట్లుగా నా జోలికి వచ్చారో ఇదే గతి పడుతుంది!" చెప్పును నేలమీద పడేసి కాలికి తొడుక్కున్నది.

"బి కేర్‌ఫుల్!" ఆ మాటలు అంటూనే సుస్మిత ఆ గుంపులోంచి వచ్చేసింది.

ఆనంద్ ఆమెను చూస్తూనే "ఏమైంది?" అన్నాడు.

"మామూలే! వీళ్ళ వెధవమాటలకు అందరూ తలవంచుకు వెళుతుంటే మరీ రెచ్చిపోతున్నారు. అప్పటికీ నా జోలికి రావద్దని ఒకటి రెండుసార్లు వార్నింగ్ ఇచ్చాను. కుక్కతోకను ఎవరూ సరిచేయలేరు. మళ్ళా పిచ్చిపిచ్చిగా పాటలు పాడుతూ కవ్విస్తున్నారు నన్ను చూసి. ఒకసారి ప్రిన్స్‌పాల్‌కు రిపోర్ట్ ఇస్తేనేగాని బుద్ధిరాదు!" అన్నది ప్రిన్స్‌పాల్ గదివైపుకు వడివడిగా అడుగులు వేస్తూ.

ఆనంద్ ఆమెను అనుసరించాడు.

అతడికీ వాళ్ళమీద కంప్లెయింట్ ఇవ్వాలనే మనస్సులో ఉన్నది. ఇంతవరకూ అవకాశం దొరకలేదు.

ప్రిన్సిపాల్ కాక మరో ఇద్దరు లెక్చరర్లు

## దేనిపైన పరిశోధన?

ఎడిసన్‌కు సభల్లోనూ, విందుల్లోనూ పాల్గొనడమంటే అంతగా ఇష్టం ఉండేది కాదు. కానీ ఒకసారి తప్పనిసరిగా మిత్రుని ఇంటికి విందుకు వెళ్ళాడు. మిత్రుడు, అతని బంధువులు ఎడిసన్‌ను మాటలతో విసుగెత్తించారు.



ఆ బంధుమిత్రుల్లో ఒకాయన ఎడిసన్‌ను 'ఇప్పుడు మీరే విషయంపై పరిశోధన చేస్తున్నారు?' అని ప్రశ్నించాడు.

అప్పటికే విసుగెత్తిన ఎడిసన్ 'ఈ ఇంటి నుండి ఎలా పరుగెత్తి పోవాలా? అనే విషయంపై పరిశోధిస్తున్నాను' అని జవాబిచ్చాడు. దాంతో ఆ ఇంటివారు తమ తప్పు తెలుసుకుని మిన్నకుండిపోయారు.

ఆయన గదిలో కూర్చొని ఉన్నారు.

సుస్మిత చెప్పింది. "భరించలేకుండా ఉన్నాం సార్ వాళ్ళగోల. ఆ చెట్లకింద జేరి ఆడపిల్లలు కనబడితే చాలు అసహ్యమైన మాటలతో హింసిస్తున్నారు, సిగరెట్టు పొగలను పైకి వదులుతూ!"

"ఎవరమ్మా వాళ్ళు?" అన్నాడు ఏమీ తెలియని వాడిలా ముఖంపెట్టి. ఆయనకు అర్థమయింది, ఆ అమ్మాయి ఎవరి గురించి చెబుతున్నదో. వాళ్ళను మార్చడం గాని, శిక్షించటంగాని తన వల్ల కాదు. ఇంతకు ముందు ఒకటి రెండుసార్లు ఈ విషయంలో కల్పించుకొని చేతులు కాల్చుకున్నాడు. తను వార్నింగ్ ఇచ్చిన మరుక్ష

ణంలోనే పెద్దపెద్ద వాళ్ళ నుండీ ఫోన్ కాల్స్. ఇలాంటి చిన్నచిన్న విషయాలను కూడా నేర్పుగా పరిష్కరించలేనివాడివి ప్రిన్స్‌పాల్‌గా ఎలా పనికొస్తావంటూ కమిటీనుంచి చివాట్లు.. సుస్మిత చెబుతుంటే ఆయన తలపట్టుకు కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగ్గా కూర్చున్న లెక్చరర్లూ ఆయన వంక జాలిగా చూస్తున్నారు.

"కాగితం రాసివ్వమ్మా.. నేను ఎంక్వయిరీ చేసి నువ్వు చెప్పింది నిజమే అయితే వాళ్ళమీద యాక్షన్ తీసుకుంటాను!" అంటూ ఓ తెల్లకాగితం ఇచ్చి చేతులు దులుపుకున్నాడు.

ఆనంద్‌కు తెలుసు వాళ్ళను అదుపులో పెట్టటం అతడివల్ల కాదని. ఇక అక్కడ ఉండటం అనవసరమనిపించింది. ఆమెను తీసుకొని బయటకు వచ్చేశాడు.

"ఈయనకు కాదు, కంప్లెయింట్ ఇవ్వాల్సింది.. వెళ్ళి కలెక్టర్‌ను, సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసును కలిసి వివరిస్తేనే గాని పరిస్థితి చక్కబడదు... పద!"

సుస్మిత 'సరే'నన్నట్లుగా తలూపి క్లాసుకు వెళ్లిపోయింది. అతడు తన క్లాసు వైపు నాలుగు అడుగులు వేశాడో లేదో, వెనగ్గా వడివడిగా వచ్చిన వెంకట్ అతడి చొక్కా కాలర్ పట్టుకుంటూ "ఏరా.. ప్రిన్స్‌పాల్‌కు రిపోర్టు ఇప్పిస్తావా, ఆ అమ్మాయి చేత? నువ్వు నల్లచెరువులో శవమై తేలే రోజులు దగ్గరపడినయ్‌రా!" అన్నాడు కళ్ళమ్మట నిప్పులు కురిపిస్తూ.

అప్పుడు గమనించాడు, అతడి గ్యాంగ్ అంతా వెనక నిలబడిన విషయం. నలువైపులా చూస్తే తెలిసినవాళ్ళెవరూ కనబడలేదు. నోరు తెరిస్తే వాళ్ళంతా కలిసి తనను కుళ్ళబొడుస్తారనీ తెలుసు. అందుకే అక్కడి నుంచి వెళ్లిపోవటమే ఉత్తమం అన్నట్లుగా చొక్కా కాలర్ మీద ఉన్న అతడి చేతిని బలంగా తోసేసి క్లాసులోకి వెళ్లిపోయాడు ఆనంద్!

"వీడు ఏం చెప్పాడో ఏమో ఆ శ్యామల రాగిణితో చెప్పిందిట, నన్ను కాలికిందవేసి నల్లిని నలిపినట్లు నలిపేస్తానని. వాళ్ళమ్మ జిల్లా జడ్జి అయితే నాకేమిటి... నేను తలుచుకుంటే నా శక్తేమిటో తల్లీ కూతుళ్ళిద్దరికీ చూపిస్తాను. ఇంతకు ముందే చెప్పాను కదా.. దాన్ని సర్వనాశనం చేయకుండా వదిలిపెట్టనని. ఆడపిల్లలందరికీ వీడే ఓ పెద్ద సలహాదారుడవుతున్నట్లున్నాడు!" పెద్దగానే అరుస్తున్న అతడి మాటలు ఆనంద్‌కు వినిపిస్తున్నాయి.

★ ★ ★

రాత్రి తొమ్మిదిగంటలు. ఇంట్లో ఆనంద్ ఒక్కడే ఉన్నాడు. అసలు చదువు సాగటం లేదు. ప్రశాంతత లేని మనస్సుకు ఏదీ ఎక్కటం లేదు. ఇక తల్లి ఇక్కడకు రాదు. కోర్టులో తీర్పు రాగానే వచ్చి ఆమె సామాన్లన్నీ తీసుకొని పుట్టింటికి వెళ్లిపోయింది. తాగుబోతు తండ్రికి తను ఇంట్లో ఉన్నా లేకపోయినా ఒకటే. ఒకట్రెండు రోజుల్లో తనూ ఓ గది తీసుకొని వెళ్లిపోవాలి...

కోర్టువారి తీర్పు ప్రకారం తను ఎవరి దగ్గరున్నా రెండోవారు ప్రతినెలా తన ఖర్చులకు అయిదు వేల రూపాయలు తన ఎకౌంట్‌లో జమ చేయాలి. తనకు ఎవరి దగ్గరా ఉండటం ఇష్టం లేకపోతే ఇద్దరూ చెరి ఐదువేలూ ఇవ్వాలి.

శ్యామలకు ఫోన్ చేశాడు. ఆమె సెల్ ఆన్ చేస్తూనే "భోం చేశావా? " అడిగింది.

"చేయలా.. తినాలనిపించటం లేదు.. శరీరం ఆకలిని చంపుకోలేదుగా. బ్రెడ్ తెచ్చుకున్నాను...!" నీరసంగా అన్నాడు.

"సాయంత్రం అమ్మ అడిగింది నీ గురించి. చెప్పాను మీవాళ్ళ కేసు తేలిన విషయం. అమ్మా బాధపడుతోంది? "

"ఎవరు బాధపడ్డా చేయగలిగిందేమున్నది... నా జీవితానికి జరగాల్సిన హాని

జరిగిపోయింది... చదువు మీద కూడా ఇచ్చ పోతున్నది... అందుకే మానేద్దామనుకుంటున్నాను!" దిగులుగా అన్నాడు.

"మానేసి ఏం చేద్దామని?"

"ఏదో ఒకటి చేయాలి! చదువుకున్న వాళ్లూ దారి తప్పి సమాజాన్ని భ్రష్టుపట్టిస్తున్నప్పుడు చూస్తూ చేతులు ముడుచుకు కూర్చునేందుకు మనస్సు అంగీకరించదు!"

"అంటే సమాజాన్ని కడిగి శుభ్రం చేయాలనా నీ తపన!" అంది శ్యామల.

"అనవసరంగా చేతులు కాల్చుకొని భంగపడబోకు... నీ చదువేదో చదువుకొని నీ జీవితం సంగతేదో చూసుకో!" మళ్లీ ఓ సలహా ఇచ్చింది.

అతడు కొద్ది క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. అతడి మౌనాన్ని కత్తిరిస్తున్నట్లుగా "ఏదో మాటల్లో ఒకసారి అమ్మ భారతంలోని ఓ చిన్న కథను చెప్పింది నాకు. ఇప్పుడు నీ మాటలు వింటుంటే ఆ కథకూ నీ మాటలకు సామ్యం కనబడుతున్నది... చెప్పేదా?"

"వద్దంటే మానేస్తావా... చెప్పు!"

"అశ్వత్థామకు మరణం లేదనేది తెలిసిందే కదా.. అతడు దివ్య శస్త్రాస్త్రవేత్తే కాకుండా బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని తండ్రి ద్రోణాచార్యుని నుంచి పొందినవాడు. దాంతో అహం బాగా పెరిగిపోయి కృష్ణుడి దగ్గరకు వెళ్లి, భూమండలాన్నే క్షణంలో బూడిద చేయగలిగిన తన దగ్గరున్న బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని బహుమానంగా ఇస్తాను.. అందుకు బదులుగా చక్రాయుధాన్ని తనకివ్వమంటాడు. అందుకు కృష్ణుడు కొంత సంశయించినా అతడితో లేనిపోని గొడవ దేనికనుకుంటూ తీసుకొమ్మని తన చక్రాయుధాన్ని అతడి ముందుంచాడట. తనకు బ్రహ్మశిరోనామకాస్త్రం వద్దని, స్నేహితుడిగా అతడికి చక్రాయుధాన్ని ఇవ్వటం తనకు చాలా ఆనందమనికూడా చెప్పాడట. ఆ మాటలకు సంతోషించిన అశ్వత్థామ తన ముందుంచిన చక్రాయుధాన్ని అందుకోబోతే ఎంత ప్రయత్నించినా దాన్ని ఎత్తలేకపోయాడట. దాంతో నిస్సహాయుడై శ్రీకృష్ణ పరమాత్మని చూస్తూ రెండు చేతులూ జోడించాడట.. అలా ఉన్నది నీ ఆలోచన!" శ్యామల పకపకా నవ్వసాగింది.

అయినా అతడు మాట్లాడలేదు. తీక్షణంగా ఆలోచిస్తున్నాడు.

"ద్రోణాచార్యుడు కొడుక్కు స్పష్టంగా చెప్పాడు- బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ఎన్నడూ మానవుల మీద ప్రయోగించబోకని. అలా ప్రయోగిస్తే అది ప్రయోగించినవారికే అపకారం చేస్తుందని. కనుక అది ప్రయోగించటం అంటే బురదలో రాయివేయటమన్నమాట... నీకు పనికిరాదు... ఇక చక్రాయుధాన్ని ప్రయోగిద్దామనుకుంటావా, దాన్ని ఎంతో బలవంతుడయిన అశ్వత్థామే ఎత్తలేకపోయాడు.. అల్పజీవివైన నువ్వెంత?"

ఒక్కసారిగా నిగ్రహించుకోలేని ఆవేశంతో పెద్దగా అరిచాడు ఆనంద్.

"నో... నో.. నేను ఆ చక్రాయుధాన్ని ఎత్తి మరీ ఉపయోగించి జరుగుతున్న పాపాన్నంతా ప్రక్షాళన చేస్తాను!" ఆకాశం ఉరుముతున్నట్లే ఉంది అతడి మాటలకు.

## కొత్తగాలి...

**సెల్**
**గొప్ప మాంత్రికుడు!**
**నీ జేబులో ఉంటూనే**
**దానికి 'చిల్లులు' పెడతాడు!!**

– ఎన్కే.నాగ్,
పెనుగొండ, ప.గో. జిల్లా

శ్యామల భయపడింది అతడి కంఠానికి, అతడి ఆవేశానికి.. అతడి నిర్ణయానికి.

"దేశాన్ని నాశనం చేస్తున్న అందరిమీదా తిరగబడి కసి తీర్చుకుంటాను! ఆ మంటల్లో పడి నేను దగ్ధమయినా సరే!" ఆ మాటలంటున్నప్పుడు అతడి ఛాతీ ఎగి రెగిరిపడుతున్నది.

అతడి ఆలోచనకు ఆమె అవాక్కయిం ది. "ఆనంద్!" అన్నది వేదనతో కూడిన కంఠంతో. "ఆవేశపడబోకు ఆనంద్! కొన్ని సమస్యలు ఒక్కడితో తీరేవి కాదు. మనం సముద్రంలో గడ్డిపోచలాంటి వాళ్ళం. ప్రశాంతంగా ఉన్నప్పుడు జీవితాన్ని ఆనం దించటం, అలల ఉద్ధృతి పెరిగినప్పుడు తల వంచటం.. జీవితాన్ని సుఖంగా అను భవిస్తూ మనమంటే అభిమానపడేవాళ్ళకు ఆనందాన్ని కలిగించటమే మనపని!"

"నేను ఎవరికి ఆనందం కలిగించాలి? నాకు ఎవరున్నారని? "

"నేనున్నాను...!" ఆ మాట అంటూనే శ్యామల సెల్ ఆఫ్ చేసేసింది.

★ ★ ★

రాత్రి పదిగంటలకు చక్రవర్తి బంగళా నుండి రెండుకార్లు బయల్దేరినయ్. వాటిల్లో ఒకదాంట్లో చక్రవర్తి ఉన్నాడు, రెండోదాంట్లో ఆ నగరంలోనే అతి సీనియ ర్లయిన ఇద్దరు న్యాయవాదులున్నారు. వాళ్ళంతా హైదరాబాద్ వెళుతున్నారు. వీరభద్రుడి విషయంలో హైకోర్టులో అప్పీల్ చేసేందుకు వాళ్లు బయల్దేరారు. అవసరమొస్తే ఢిల్లీ నుండి గూడా ఎంత ఖర్చయినా పెద్దపెద్ద లాయర్లను పిలిపించి వీరభద్రుడిని బయటకు తీసుకురావాలనేది చక్రవర్తి ఉద్దేశ్యం!

పనిలో పనిగా తన మాటవినని సెషన్స్ జడ్జి శాంతకుమారిని, ప్రతిదానికీ అడ్డుపడు తున్న ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్‌కూ స్థానచ లనం కలిగించటానికి పావులు కదపాల నేది కూడా ఆయన ఆలోచన!

★ ★ ★

ఉదయం పదిగంటలు. ప్రశాంత్ స్టేష న్‌కు వచ్చి కోర్టుకు వెళ్లవసిన కేసుల డైరీ చూసుకుంటున్నప్పుడు అతడి టేబుల్ మీద ల్యాండ్‌ఫోన్ మోగింది. రిసీవరెత్తాడు. "యస్... ఇన్‌స్పెక్టరాఫ్ పోలీస్ స్పీకింగ్!"

"నమస్కారమండీ! నేను ఇంజనీరింగ్ కాలేజీ లేడీస్ హాస్టల్ వార్డెన్ చారుమతిని మాట్లాడుతున్నాను!" చాలా గాభరాగా ఉన్నది ఆమె కంఠం.

"మా హాస్టల్లో ఉండే సుస్మిత అనే అమ్మాయి రాత్రి హాస్టల్ టెర్రేస్ మీద నుండి దూకి ఆత్మహత్య చేసుకున్నది. పొద్దున వాచ్‌మెన్ బ్యాక్‌యార్డ్‌లోకి వెళ్లిన ప్పుడు అక్కడ పిచ్చిమొక్కల నడుమ పడి వున్న ఆ అమ్మాయిని చూశాడు. అందుకే మీకు వెంటనే ఫోన్ చేస్తున్నాను! ఇప్పుడేం చేయాలో నాకు తెలియటం లేదు... మీరు వెంటనే రావాలి!" ఆమె కంఠం భయంతో తడిసిందా అనిపిస్తోంది.

"ఆ అమ్మాయి శ్వాస ఆడుతుంటే మాత్రం వెంటనే అంబులెన్స్‌కు కూడా ఫోన్ చేయండి!"

"లేదు సార్! చనిపోయింది!" కంఠం కీచుగా మారింది.

"అయితే మీరు శవాన్ని అక్కడి నుంచి కదిలించవద్దు.. నేను వస్తున్నాను!"

మరో ఐదు నిముషాల్లోనే జీపు స్టేషన్ నుంచి బయల్దేరింది. అది ఆడపిల్లల హాస్టల్ ముందు ఆగేటప్పటికి అరగంటప ట్టింది. ఆ బిల్డింగ్ ముందు అక్కడ పని చేస్తున్న వాళ్ళంతా జేరి మాట్లాడుకుంటు న్నారు. తొమ్మిదింటికే కాలేజీ ప్రారంభమ వ్వటంతో అందులో ఉండే విద్యార్థిను లంతా సుస్మిత ఆత్మహత్య విషయం తెలి యకముందే వెళ్లిపోయారు.

వార్డెన్ పరుగెత్తుకుంటూ వచ్చింది తన

# ఎగిరే విత్తనాల కథ



కదిలే గింజలు కూడా ఉన్నాయని చాలా మందికి తెలీదు. ఇవి మెక్సికోలోనే ఉన్నాయి. కాబట్టి వీటికి 'మెక్సికన్ జంపింగ్ బీన్స్' అని పేరు. అక్కడి లేతగింజలలో ఒక పురుగు గుడ్లు పెడుతుంది. ఆ విత్తనాలు ముదిరాక గుడ్లులోంచి వచ్చిన పురుగు బయటకి రాలేదు. గోధుమ రంగులో ఉండే గింజలోని ఆ పురుగు లోపల వేడిగా ఉన్నప్పుడల్లా చల్లటి వాతావరణంలోకి కదులుతుంది. దాంతో ఈ గింజ దానంతటఅదే ఎగిరినట్లుగా కనిపిస్తుంది. మెక్సికన్ జంపింగ్ బీన్స్‌లోని పురుగులకి వేడి శత్రువు. దాని నుంచి రక్షణ పొందడానికి అవి చల్లటి ప్రదేశం కోసం ఎగురుతాయి. గింజ లోపల భాగాన్ని తింటూ ఈ పురుగు కొన్ని నెలలపాటు జీవిస్తుంది. వేసవిలో అది ఆ గింజ పైపొరని ఛేదించుకుని వస్తుంది.

ఈ గింజలని కొందరు వ్యాపారులు సేకరించి అమ్ముతుంటారు. అమెరికాలోని చిన్న పిల్లల ఆట వస్తువుల దుకాణాల్లో ఇవి లభిస్తాయి. మెక్సికోలోని సునోరా, సినాలో అనే రాష్ట్రాల్లోని పర్వత ప్రాంతాల్లో మూడువేల చదరపు మైళ్ళ విస్తీర్ణంలో ఇవి పండుతున్నాయి. యూరప్, అమెరికాలకు ఎగుమతి అవుతున్నాయి. ఒకప్పుడు కోటీ ఇరవై లక్షల జంపింగ్ బీన్స్ ఎగుమతి చేసేవారు. ఇప్పుడు దాంట్లో అయిదో వంతుకే డిమాండ్ ఉంది. కారణం పిల్లలు ఇంటర్నెట్‌తో కాలక్షేపం చేయడం అధికం కావడమేనట.

భారీ కాయంతో ఆయాసపడుతూ. ఆమె సర్వీసులో ఇలాంటిది మొదటి కేసు అవ్వటంతో భయం ఆవరించింది. అంతా హాస్టల్ వెనక్కు వెళ్లారు. అక్కడంతా తుప్పలు, చెత్త, ఖాళీ ప్లాస్టిక్ సీసాలు, కవర్లతోనూ అసహ్యంగా ఉంది.

"వెనుక ఎప్పుడూ బాగు చేయించే అలవాటు లేదా? " మెడ వెనక్కు తిప్పి ఆమెనే చూస్తూ అడిగాడు ప్రశాంత్.

"మా దగ్గర పనివాళ్లు తక్కువున్నారండి.. పిల్లల అవసరాలు చూడటానికే వాళ్ళ సమయమంతా సరిపోతుంది... ఏవైనా సెలవులు వచ్చి పిల్లలు ఊళ్లకు వెళ్లినప్పుడు బాగు చేయిస్తుంటాను.. చుట్టూ శుభ్రంగా ఉంచేందుకు ఇద్దరు మనుష్యుల్ని ప్రత్యేకంగా ఇవ్వమంటే మా మేనేజ్‌మెంట్ చూద్దాం చూద్దాం అంటుందేగాని ఇవ్వటం లేదు!" అన్నది.

"ఈ అమ్మాయి ఇక్కడ పడివున్నట్లుగా ఎప్పుడు గుర్తించారు? "

"మీకు ఫోన్ చేయటానికి పావుగంట ముందు సార్. మా వాచ్‌మెన్ అటుగా వెళ్లి ఆ అమ్మాయిని చూస్తూనే కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు. నేనూ వెంటనే వెళ్లాను. చాలా మంచి అమ్మాయండి... ఎందుకు ఇలాంటి పని చేసిందో అర్థం గాకుండా ఉన్నది!"

ఆ అమ్మాయి వయస్సు పదిహేడో, పద్దెనిమిదో ఉంటుంది. పచ్చటి పసిమి. ఐదున్నర అడుగుల పొడుగు, అందమైన ముఖం. ఒంటిన పూలపూల డ్రస్సు. కాళ్లు ముడుచుకుపోయి ఒకపక్కకు ఒరిగి పడివుంది. తల గ్రానైట్ రాతిమీద పడటంతో కణతల దగ్గర నెత్తురు కారింది. శరీరం

మీద ఎక్కడా దెబ్బలున్నట్లులేవు.

డాక్టర్ని, ఫొటో్గ్రాఫర్ని పిలువమని, బాడీని ఆసుపత్రికి పంపేందుకు అంబులెన్స్ను తీసుకురమ్మనమని సబ్ ఇన్స్పెక్టర్కి జీపు ఇచ్చి పంపుతూ అందరికీ ఫోన్లు చేశాడు ప్రశాంత్, తయారుగా ఉండమని. ఏసీపీకి ఫోన్ చేసి విషయం చెప్పాడు.

"ఆ అమ్మాయి ఆత్మహత్యే చేసుకున్నదని మీరు ఎందుకు అనుకుంటున్నారు? " వార్డెన్నే చూస్తూ అడిగాడు.

అతడి చురకత్తిలాంటి చూపులకు చారుమతి తత్తరపడటం గమనించాడు. గొంతు తగ్గించి చిరునవ్వుతో "భయం దేనికి? అందరి అభిప్రాయాలు తెలుసుకుంటే ఈ చావుకు కారణమేమిటో తెలుసుకోవచ్చనేది నా ఆలోచన!" అన్నాడు అనునయంగా.

"హత్యయితే మేడ మీదనుంచి కిందకు దూకాల్సిన అవసరం ఏమున్నది సార్? " అన్నది చిన్నగా.

"ఆ అమ్మాయి పేరు? "

"సుస్మిత!"

"ఏ ఊరి అమ్మాయి? " హాస్టల్లో ఉన్నదంటే ఈ ఊరు కాదేమోనని అడిగాడు.

"విజయవాడ సార్!"

"ఆమె తల్లిదండ్రులకు చెప్పారా? "

"ఇంకా లేదండి!"

"చెప్పండి మరి. వాళ్ళకు తెలియాలి గదా!" అతడు ఆ మాట అంటుండగానే ఆమె టేబుల్ మీద ఉన్న పుస్తకాలు తీసి అమ్మాయి వివరాలున్న పేజీ తెరుస్తోంది.

"పొద్దున్నే వాచ్మేన్కు అటు వైపుకు వెళ్లాల్సిన అవసరం దేనికి వచ్చింది? "

అక్కడే తలుపు దగ్గర నిలుచున్న వాచ్మేన్ ముందుకో అడుగు వేశాడు. నల్లగా లావుగా ఉన్నాడు. కాకిగుడ్డలు ధరించి ఉన్నాడు. ముఖమంతా జిడ్డు కారుతోంది.

"నేను ఇక్కడే ఔట్ హౌస్లో ఉంటాను సార్! ఉతికిన మా గుడ్డలు మేడపైన కట్టిన తాడు మీద ఆరేస్తాం. తీసుకు వద్దామని పైకి వెళితే నా ధోవతి, మా ఆవిడ చీర కనపడలేదు. రాత్రి బాగా గాలి వచ్చింది. కిందపడ్డయ్యేమోనని పైనుంచి చూస్తే ప్రహరీ గోడ దగ్గర పడివున్నాయి.. వాటికోసం వెళ్లినప్పుడు చూచాను, గదిగోడ పక్కగా పడివున్న ఆ అమ్మాయిని... వెంటనే వచ్చి అమ్మగారికి చెప్పాను!"

ప్రశాంత్ అతడివంక కళ్ళు చికిలించి చూస్తూ "నువ్వు తెచ్చిన గుడ్డలు ఎక్కడ పెట్టావ్? " అడిగాడు.

"అదుగోనండి..వరండాలోనే ఉన్నాయి.. మా ఆవిడను తీసుకు వెళ్లమన్నాను గాని అదీ ఇక్కడే ఉండిపోయింది గొడవతో!"

"రాత్రంతా మేల్కొనే ఉంటావా? "

"పదింటివరకు ఇక్కడ గ్రిల్ దగ్గర స్టూలుమీద కూర్చొని ఉంటానండి... తరువాత గ్రిల్లు మూసి, తాళం వేసి పక్క పరుచుకుని పడుకుంటానండి!"

"అంతెత్తునుంచి మనిషి పడ్డప్పుడు నీకు శబ్దం వినిపించలేదా? "

"నిద్రలో నాకేమీ వినిపించలేదు సార్! వినిపిస్తే అప్పుడే వెళ్లి చూచేవాడిని!"

అంతా రెండో అంతస్తులో ఉన్న సుస్మిత గది దగ్గరకు వెళ్లారు.

"ఇంతకీ ఆ అమ్మాయి తల్లిదండ్రులకు ఫోన్ చేశారా లేదా? "

"నంబరు వెతికి చేస్తానండి..." అన్నది నసుగుతున్నట్లుగా వార్డెన్.

"పోనీయ్! మీ కాలేజీ మేనేజ్మెంటుకయినా తెలియబరిచారా? "

"చెప్పానండి, ప్రిన్స్పాల్ గారికి!"

"నాకు ఫోన్ చేసిన తర్వాతా, ముందా? " ఆమెనే చూస్తూ అడిగాడు.

"ముందు ప్రిన్స్పాల్ గారికి ఫోన్ చేస్తేనే ఆయనా బయల్దేరుతున్నానని చెప్పి మీ నంబరిచ్చి ఫోన్ చేయమన్నారు. అప్పుడు మీకు చేశాను!"

"ఇందాక మీరు శవాన్ని చూచిన వెంటనే నాకు ఫోన్ చేశానన్నారు!"

ఆమె తడబడుతూ "ఏమోనండి... కంగారులో అలా చెప్పివుంటానండి!"

వింతగా చూసాడు ఆమెవంక ప్రశాంత్.

దగ్గరకు వేసి ఉన్న ఆ గది తలుపును వార్డెన్ లోపలకు నెట్టింది. ప్రశాంత్ లోపల కాలు పెడుతూ "నేను చెప్పేంత వరకూ ఎవ్వరూ లోపలకు రావద్దు" అన్నాడు.

"ఇందులో ఎంతమంది ఉంటారు?" తలుపు దగ్గరే నిలుచున్న వార్డెన్‌ను అడిగాడు.

"ఇద్దరండీ.. సుస్మితతో ఉండే నీలిమ ఇవ్వాళ ఉదయం తెనాలిలో బంధువుల ఇంట్లో వివాహం జరుగుతుంటే నిన్న సాయంత్రమే వెళ్లింది" వార్డెన్ చెప్పింది.

"ఐసీ!" అంటూనే గదిలోపల అన్నీ నిశితంగా పరిశీలించసాగాడు. ఒక మంచం మీద దుప్పటి నలగకుండా ఉన్నది. రెండో దుప్పటి బాగా నలిగి, సగం కిందకు జారి ఉన్నది. "రాత్రిళ్లు ఇక్కడకు ఎవరైనా వచ్చే అవకాశమున్నదా?" పుస్తకాలు పెట్టి ఉన్న టేబుల్ దగ్గరకు వెళుతూ అడిగాడు.

"లేదండి! స్నేహితురాళ్లు ఎవరు వచ్చినా నా పర్మిషన్ తీసుకునే వస్తారండి!"

"నేనడిగేది స్నేహితురాళ్ళ గురించి కాదు.. మగ స్నేహితుల గురించి!"

"అస్సలు లోపలకు రానీయనండి... బయట చెట్టుకింద సిమెంటు బెంచీమీద కూర్చొని మాట్లాడుకోవాల్సిందే!"

"మగపిల్లల హాస్టల్ పక్కదేగదా.. అందులోని వాళ్లు మీకు తెలియకుండా దీంట్లోకి వచ్చే అవకాశం లేదా?"

"లేదండి... మధ్యగోడ చాలా ఎత్తు, ఆపైన అది ఎవరూ దాటకుండా సీసం పెంకులుగూడా పెట్టించారండి!"

సామాన్యంగా ఆత్మహత్య కేసుల్లో ఏదైనా ఉత్తరం రాసిపెట్టటం కద్దు. అలాంటిదేమైనా దొరుకుతుందేమో అన్నట్లుగా పుస్తకాల టేబుల్ వైపుకు తిరిగాడు ప్రశాంత్. పైనున్న పుస్తకంలోనే బయటకు కనబడేలా ఓ మడత పెట్టిన కాగితం కనబడింది. దాన్ని తీసుకున్నాడు ఆత్రంగా. అతడు ఊహించింది నిజమే. అది సుస్మిత రాసిన ఉత్తరమే!

"జీవితంలో ఎంతగానో నమ్మినవాళ్లే నన్ను మోసం చేశారు. ఆనంద్ మా అమ్మ స్నేహితురాలి కొడుకు. నేను కాలేజీలో జేరేముందు కాలేజీ వివరాలు కనుక్కోవటానికి వాళ్ళింటికి వెళ్లినప్పుడు మొట్టమొదటిసారిగా పరిచయమయింది. కాలేజీలో ఆనంద్‌కు చాలా మంచి పేరుండటంతో ఆ పరిచయాన్ని పెంచుకుంటూ చదువులో సలహాలు తీసుకోసాగాను. అతడి మాయమాటల్లో పడి అతనంటే

## తలుపులోని మర్మమిదేనా?

'మీ గది తలుపు ఇంత బరువుగా ఉందే' అని ఒకసారి ఎడిసన్‌ను ఆయన మిత్రుడు ప్రశ్నించాడు.

'ఓ అదా! రోజుకు ఇంచుమించు యాభై



మంది దాకా నన్ను చూడ్డానికి వస్తూ పోతూ వుంటారు. ప్రతిసారి బరువైన ఈ తలుపును తోసినప్పుడు ఇంటి కప్పు పైనున్న నీళ్ళతొట్టిలో ఒక గాలన్ నీళ్ళు పడుతుంటాయి లెండి' అని జవాబిచ్చాడు ఎడిసన్.

ఎంతగానో ఇష్టపడ్డాను. అతడిని క్షణం కూడా విడిచి ఉండలేనంత దగ్గరదాన్న య్యాను. అతడిని వివాహం చేసుకొని నా జీవితాన్నే ఓ మల్లెపందిరిగా చేసుకోవాల నుకున్నాను. కానీ చదువు అయిపోగానే ఇక్కడివాళ్ళనీ, ఈ దేశాన్ని శాశ్వతంగా వదిలేసి విదేశాలకు వెళ్లే ఆలోచనలో ఉన్నానని, వివాహం చేసుకునే ప్రసక్తే లేదని తేల్చి చెప్పాడు. అతడు ఎప్పటికీ నావాడు కాలేడు అనే విషయాన్ని జీర్ణించు కోలేకపోతున్నాను. వివాహం చేసుకొని ఇద్దరం కలిసే వెళ్ళవచ్చుగదా అని బతిమ లాడాను, ఏడ్చాను. అయినా అతడు వివా హానికి అంగీకరించలేదు. అతడు లేని జీవితం వద్దు. నేను బతికింది చాలు. నన్ను అమితంగా ప్రేమించే నా తల్లిదం డ్రుల్ని క్షమాపణలు కోరుతున్నాను..

ఆనంద్! నువ్వు ఎక్కడున్నా, ఉజ్వల భవిష్యత్తు పొందేలా చూడాలని భగవం తుని ప్రార్థిస్తున్నాను. నా ఆత్మహత్యకు పూర్తి బాధ్యత నాదే. అందరికీ వీడ్కోలు - సుస్మిత"

ఆ కాగితాన్ని చదువుతుంటే అతడి మన స్సంతా అలజడికి గురయింది. ఆనంద్ దీనికి బాధ్యుడా? నమ్మలేకుండా ఉన్నాడు. ఆమె చేతిరాత వున్న ఓ పుస్త కాన్ని వెతికి తీసుకుంటూ దాంట్లో పెట్టే శాడు ఆ కాగితాన్ని.

సరిగ్గా అప్పుడే వాకిట్లో కారు హారన్ వినబడటంతో "అదుగోండి... ప్రిన్స్‌పాల్ గారూ వచ్చారు!" అన్నది కాస్తంత రిలీఫ్ పొందినట్లుగా వార్డెన్ చారుమతి.

"ఆ అమ్మాయి శవం ఎక్కడ? " అన్నాడు ఆయన ఆదుర్దాగా పైకి వస్తూనే.

"బిల్డింగ్ వెనకాల సార్! చూపిస్తాను పదండి.." ఆయన్ను తీసుకొని చారుమతి కిందకు వెళ్లింది.

గదిలో ఇంకా ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్‌కు ప్రత్యేకంగా గుర్తించాల్సినవి ఏవీ కనబడ లేదు. బయటకు వచ్చి "ఈ మెట్లేనా టెర్రే స్‌కు వెళ్లేదారి? " అని వాచ్‌మన్‌ని అడుగు తూనే కుడివైపు ఉన్న మెట్లమీదగా పైకి వెళ్లాడు.

అక్కడనుంచి కిందికి చూసాడు. నాలుగో అంతస్తు మీదనుంచి పడటంతో వెంటనే ప్రాణం పోయివుంటుంది. అందునా తలగూడా రాయిపై పడింది..

అతడు పైనుంచి దిగుతుండగా అసి స్టెంట్ కమిషనర్ ప్రిన్స్‌పాల్‌తో మాట్లా డుతూ పైకివస్తూ కనబడ్డాడు.

"శవం కిందున్నది సార్!"

"చూశాను.. ఆ అమ్మాయి గదిలో ఆత్మ హత్య చేసుకున్నదనేందుకు ఆధారాలు ఏవైనా దొరికినయ్యా? "

చేతిలో వున్న పుస్తకంలోనుంచి ఆమె రాసి పెట్టిన లేఖను ఇస్తూ "చేతివ్రాత ఆమె దవునో కాదో తెలుసుకునేందుకు ఫోరెన్సిక్ ల్యాబ్‌కు పంపాలి సార్!" అన్నాడు.

"ఈమధ్య ఒకరోజు సుస్మిత ఆనంద్‌ను తీసుకొని కాలేజీలో పిల్లలెవరో తనని ఏడి పిస్తున్నారంటూ నా దగ్గరకు వచ్చింది!" అన్నాడు ప్రిన్సిపాల్.

"ఆ విషయాన్ని రాతపూర్వకంగా ఇస్తే ఎంక్వయిరీ చేసి యాక్షన్ తీసుకుంటానని చెప్పాను.. మళ్ళీ వాళ్ళు నా దగ్గరకు రాలేదు. కంప్లెయింట్ ఇవ్వలేదు!"

"ఎవరు గోల చేసిందీ చెప్పిందా ఆ అమ్మాయి? " అడిగాడు ప్రశాంత్.

"మా దగ్గర ఓ వెధవ గ్యాంగ్ వున్నది. వాళ్ళు ఎప్పుడూ చెట్టు కింద జేరి వచ్చే పోయే వాళ్ళను సరదాగా మాటలతో ఏడి పిస్తున్నా, ఎవరూ సీరియస్‌గా తీసుకోరు. వాళ్ళూ వాళ్ళని ఏదో ఒకటి అనేసి నవ్వు కుంటూ వెళ్ళిపోతారు. ఈ అమ్మాయి చాలా సెన్సిటివ్‌లా ఉంది. వెంటనే వాళ్ళ మీద కోపంతో నా దగ్గరకు వచ్చింది!"

"వాళ్ళెవరో మీకు తెలిసినపుడు మీరు ఆ కంప్లెయింట్ ఇవ్వకపోయినా యాక్షన్ తీసుకోవాల్సింది.. వాళ్ళు మీ స్టూడెంట్సేనా.. క్లాసులకు వెళ్ళకుండా చెట్లకింద కూర్చోవాల్సిన పనేమున్నది వాళ్ళకు! ఈ కేసుతో సంబంధం వున్నా లేకపోయినా వాళ్లను అదుపులో పెట్టటానికి మీకు దొరికిన మంచి అవకాశమిది. వెంటనే రిపోర్టు రాసివ్వండి!" ఏసీపీ సీరియస్‌గా అన్నాడు.

"కాలేజీలో డిసిప్లిన్ కాపాడాల్సిన బాధ్యత మీదే!"

తను తొందరపడి మాట్లాడానా అన్నట్లుగా నీరస పడిపోయాడు ప్రిన్సిపాల్. "అంతకుముందు ఒకసారి ఇలాగే ఒకళ్ళిద్దరు చెబితే వాళ్ళల్లో ముఖ్యులయిన వెంకట్, రాజులను పిలిచి వార్నింగ్ ఇచ్చినందుకే నా ఉద్యోగం ఊడినంత పనయింది!" అన్నాడు గొణుగుతున్నట్లుగా.

"అయితే వాళ్ళు బాగా ముదిరిపోయారన్నమాట! ప్రశాంత్ వాళ్ళను స్టేషన్‌లో కూర్చోబెట్టి నాకు ఫోన్ చేయి!"

అందరూ కిందకు వచ్చేశారు. అప్పటికే ఫొటోగ్రాఫర్ ఫొటోలు తీసుకోవటం, బాడీని డాక్టరు పరీక్షించి అంబులెన్స్‌లోకి ఎక్కించటం జరిగిపోయింది.

ప్రశాంత్ జీపెక్కబోతూ "ముందు ఆ అమ్మాయి తల్లిదండ్రులకు ఫోన్ చేసి పిలిపించి, వాళ్ళను తీసుకొని మీరు స్టేషన్‌కు రండి.. సుస్మిత రూమ్మేట్ నంబరున్నదా.. వుంటే ఆ అమ్మాయిని గూడా పిలిపించండి.. సుస్మిత గురించిన వివరాలు ఏమైనా ఇవ్వగలుగుతుందేమో చూద్దాం!" అన్నాడు హాస్టల్ వార్డెన్ చారుమతితో.

ఏసీపీ వెళ్ళటానికి ముందుకు అడుగు వేసినవాడల్లా ప్రశాంత్ దగ్గర ఆగి, "వెంటనే ఆనంద్‌ను అరెస్ట్ చేసి మేజిస్ట్రేట్ ముందు హాజరు పరచండి!!" అన్నాడు.

★ ★ ★

జిల్లా సెంట్రల్ జైలుకు బాలరాజు వచ్చాడు వీరభద్రుడిని కలవటానికి. చక్రవర్తి మనిషి అంటే ఎక్కడయినా ఆలస్యం జరగదు. అతడికి పావుగంటలోనే అనుమతి లభించింది. ములాఖత్ హాల్లోకి బాలరాజును తీసుకువెళ్ళారు.

"నా జీవితం అన్యాయమయిపోయిందిరా బాలరాజు!" ఉరిశిక్ష వేశారన్నప్పటి నుంచి వీరభద్రుడిని పూర్తిగా నిరాశ ఆవరించింది. ఎప్పుడూ పులిగాండ్రింపులా వుండే అతడి మాట బాగా దిగజారిపోయింది.

"అట్లెందుకనుకుంటావ్! సారు హైదరాబాద్ వెళ్ళింది పెద్దపెద్ద లాయర్లతో మాట్లాడటానికే. హైకోర్టుకు వెళుతున్నారు. ఆయనా బాధపడుతున్నారు నీకు జరిగిన అన్యాయానికి" అన్నాడు ధైర్యం చెబుతున్నట్లుగా బాలరాజు.

వీరభద్రుడు ఆ ధైర్య వచనాలను మనస్సుకి ఎక్కించుకునే స్థితిలో లేడు.

తను నడిరోడ్డు మీద వాడిని మర్డర్ చేసినమాట వాస్తవమే కాని, తప్పించుకుపోలేనంత పకడ్బందీగా శవం దగ్గరే తనను ఆ ఇన్‌స్పెక్టర్ పట్టుకుంటాడని కలలో కూడా ఊహించలేదు. అంతకు ముందు ఎన్నిసార్లు అలాంటివి చేయలేదు.. ఈసారే అదృష్టం ఎదురుతన్నింది.

"చెప్పు! దేనికొచ్చావ్.. సార్ ఏమన్నా చెప్పమన్నారా?"

"అదే.. హైకోర్టుకు వెళుతున్నానని చెప్పమన్నారు. అందుకే ఆయన స్వయంగా హైదరాబాద్ వెళ్ళింది.. ఇంటి ఖర్చులకు కావాల్సిన డబ్బు అయ్యగారిస్తే నేనే నీ భార్యకు ఇచ్చి వచ్చాను! వాళ్ళు కులాసాగానే వున్నారు. నిన్ను మాత్రం జైల్లో జాగ్రత్తగా వుండమన్నారు సారు. ఎవరు ఎంత కవ్వించినా కొట్లాటలకు దిగొద్దన్నారు. హైకోర్టులో నిన్ను బయటకు తీసుకు వచ్చేందుకు పెద్ద పెద్ద లాయర్ల

ద్వారా ప్రయత్నం చేస్తామన్నారు!"

"సరే.. జాగ్రత్తగానే వుంటాను!" అన్నాడు వీరభద్రుడు, అది అతడి ఒంటికి సరిపడని మాటే అయినా!

అంతగా అతడిని అనునయిస్తూ మాట్లాడుతున్నా ఆ సమయంలో బాలరాజుకు కూడా తెలియని మరొక విషయం వున్నది... లాయర్లతో హైకోర్టులో అప్పీలు చేయటానికి వెళ్లినమాట వాస్తవమేగాని... దానిలో చక్రవర్తి ఆంతర్యం వేరు అనేది!

★ ★ ★

పన్నెండు గంటలప్పుడు సబ్ ఇన్‌స్పెక్టర్ విజయ్ వచ్చాడు స్టేషన్‌కు. "ఎర్రచందనం దుంగల్ని ఫారెస్ట్ డిపార్ట్‌మెంటుకు ఇచ్చేశాం సార్. లారీ విషయంలో ఒడిస్సా పోలీసులకు చెప్పాను. దాని ఓనర్ని వచ్చి కోర్టులో దానికి సంబంధించిన పత్రాలన్నీ ఇవ్వమని. ఇక ఈ రోజు కాలేజీకి సెలవు ప్రకటించడంతో మనకు కావాల్సిన వాళ్ళెవ్వరూ దొరకలేదు సార్! మన దగ్గరున్న వాళ్ళ ఇంటి అడ్రసులకు గూడా వెళ్ళాను.. ఇంట్లో లేరు బయటకు వెళ్ళారని చెప్పారు. ఆనంద్ విషయంలోనే ఇంటికి తాళం వేసి వుండడంతో ఏ సమాచారం దొరకలేదు!"

"ఓకే! పొద్దున్నే కాలేజీ తెరవగానే వెళితే అందరూ దొరుకుతారు.. తీసుకు వచ్చి లోపల పడేయండి!"

★ ★ ★

సాయంత్రం శాంతకుమారి కోర్టు నుంచి పెందరాళే ఇంటికి వచ్చింది. అప్పటికే ఇంట్లో ఉన్న శ్యామలను చూస్తూనే ఆశ్చర్యపోయింది. "అదేమిటి.. కాలేజీలో ఆఖరి పీరియడ్ వరకూ ఉండలేదా? " అడిగింది.

"లేదమ్మా.. ఫస్ట్ ఇయర్ స్టూడెంట్ సుస్మిత అనే అమ్మాయి హాస్టల్ బిల్డింగ్‌పై నుంచి దూకి ఆత్మహత్య చేసుకున్నది! అందుకని కాలేజీకి శెలవు ఇచ్చారు!"

"అదేం మాయరోగం? " కళ్ళు చిట్లించి కూతురునే చూస్తూ అడిగిందావిడ.

"కాలేజీలో చేరుతూనే ప్రేమలో పడిపోయిందా? ఈ రోజుల్లో పిల్లలకు వెధవ్వేషాలు ఎక్కువయి జీవితాల్ని నాశనం చేసుకుంటున్నారు!"

శ్యామల మాట్లాడలేదు. ముఖమంతా జేవురించినట్లుగా అయింది.

"ఆ అమ్మాయి చచ్చిపోయినందుకు కాదు.. దానికి కారణం ఆనందే అన్నట్లుగా అంతా అనుకుంటుంటే బాధగా వుంది!"

"అతడికి ఆ అమ్మాయి తెలుసా? "

"నాకు తెలియదు.. మా దగ్గర చదువూ, చట్టుబండలూ అక్కరలేని ఓ వెధవ గ్యాంగ్ వున్నదిలే. వాళ్ళు ఆ అమ్మాయిని ర్యాగింగ్ చేస్తుంటే తీసుకెళ్ళి ప్రిన్సిపాల్ దగ్గర కంప్లెయింట్ ఇప్పించాడని తెలిసింది.. మరి పరిచయం వుండటంతోనే అలా చేశాడో... లేదా తెలిసిందేగదా అతడి సంగతి, వాళ్ళ గోల చూసి ఆవేశపడిపోయి తీసుకువెళ్ళాడో.. తరువాత కనబడ్డప్పుడు అడుగుదాంలే అనుకున్నాను గాని అవకాశం దొరకలేదు"

శాంతకుమారికి అలాంటి విద్యార్థుల్ని, వాళ్ళ గోలల్ని చూస్తున్నా, వింటున్నా మహా చికాగ్గా వుంటుంది.

"సుస్మిత రాగిణి ద్వారా నాకు తెలుసు..

## కొత్తగాలి...

**మైండ్‌కీ**
**డైమండ్‌కీ**
**కావల్సింది ఒకటే**
**సాన!!**

– ఉమాబాల చుండూరు,
హైదరాబాద్

అందుకే హాస్టల్‌కు వెళ్ళాను చూద్దామని.. అప్పటికే బాడీని పోస్టుమార్టంకు తీసుకు వెళ్ళారట.. ఆ అమ్మాయి తన ఆత్మహత్యకు కారణం ఆనందేనంటూ కాగితం రాసి పెట్టిందట. అతడిని ఏ క్షణాన్నైనా పోలీసులు అరెస్టు చేయవచ్చని అందరూ అంటుంటే అక్కడ వుండలేక వచ్చేశాను!" ఆ మాటలు అంటున్నప్పుడు ఆ అమ్మాయి కళ్ళు చెమరుస్తున్నాయి.

శాంతకుమారి జాలిగా చూసింది కూతురు వంక. "ఏం చేస్తాం... నేరం చేసినవాళ్ళు ఎవరైనా శిక్ష అనుభవించక తప్పదు గదా!" అంటూ ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

★ ★ ★

సాయంత్రం నాలుగు గంటలప్పుడు చారుమతి ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్‌కు ఫోన్ చేసింది. "నీలిమ వచ్చింది సార్? పెళ్ళి హడావుడిలో వుండటంతో సుస్మిత మరణ వార్త పొద్దుట నుంచీ తెలియలేదుట. ఎవరో టీవీ పెట్టుకు చూస్తూ, తన హాస్టల్ అమ్మాయే ఆత్మహత్య చేసుకున్నదన్న వార్తను చూసి చెప్పార్ట. వెంటనే హడావుడిగా పరిగెత్తుకుంటూ వచ్చింది! ఆ అమ్మాయిని స్టేషన్‌కు తీసుకు రమ్మనమంటారా? " ఆత్రంగా అడిగింది.

"నేను ఇప్పుడు ఆసుపత్రికి వెళుతున్నానండి... పోస్ట్‌మార్టం అవ్వగానే బాడీని సుస్మిత తల్లిదండ్రులకు అప్పచెప్పాలి... ఇవ్వాళ ఆ అమ్మాయితో మాట్లాడేందుకు వీలు పడకపోవచ్చు. ఓ పని చేయండి... రేపు ఉదయాన్నే నేను వస్తాను గాని, నీలిమను కాలేజీ మానేసి హాస్టల్‌లోనే ఉండమని చెప్పండి.. ఓకే!"

★ ★ ★

పోస్ట్‌మార్టం చేసి శవాన్ని ఇచ్చేటప్పటికి రాత్రి ఎనిమిది గంటలయింది. రిపోర్టు ఇవ్వటానికి మరో అరగంట పడుతుందన్నారు. సుస్మిత తల్లిదండ్రుల బాధ వర్ణనాతీతం. ఆ అమ్మాయి వాళ్ళకు ఇద్దరు మగ పిల్లల తరువాత పుట్టిన ఆడపిల్ల అవ్వటంతో అతి గారాబంగా పెరిగింది.

"మీరు బాడీని విజయవాడ తీసుకు వెళతారా? " అడిగాడు ప్రశాంత్.

తండ్రి నోరు తెరవలేకపోయాడు గానీ, ఆయన తమ్ముడు, "అవునండీ.. అక్కడ మాకు స్వంత ఇల్లు ఉంది. బంధువులంతా అక్కడే వున్నారు!" అన్నాడు.

ఆయన తమ్ముడే గాకుండా నలుగురయిదుగురు దగ్గర బంధువులూ వచ్చారు విజయవాడ నుంచి.

"సరే! బాడీని తీసుకువెళ్ళి కార్యక్రమాలన్నీ పూర్తిచేశాక మీరు స్టేషన్‌కు ఒకసారి రావాల్సి ఉంటుంది!"

"కేసు పెట్టటానికే కదా? " ఆ మాటలు అంటూనే సుస్మిత తండ్రి ఘొల్లుమన్నాడు.

"వదిలేసేయండి సార్! అది చచ్చిపోయింది. ఇంకా కేసంటూ పెట్టి కోర్టుల చుట్టూ తిరుగుతూ మనస్తాపం చెందటం దేనికి? దానివల్ల చనిపోయిన కూతురు తిరిగి వస్తుందా? లేనిపోని బాధ తప్ప. నేనింకా ఎక్కడికీ రానండి. మీకేమైనా సంతకాలు కావాలంటే చెప్పండి.. ఇప్పుడే పెట్టేస్తాను కేసు క్లోజ్ చేద్దురుగాని!" అన్నాడు ఆయన నిర్వేదంగా.

"అలా కాదు. నేరం చేసినవాడు శిక్ష అనుభవించక తప్పదు. ఓకే, ఇప్పుడు మీరు బాధలో వున్నారు. నేను అర్థం చేసుకోగలను. మీరు రాలేకపోతే రెండు రోజులాగి నేనే విజయవాడ వస్తాను!"

★ ★ ★

తెల్లవారేటప్పటికి నగరం నుండి వెలువడుతున్న తెలుగు పేపర్లో మొదటి పేజీలో సుస్మిత ఆత్మహత్య విషయం ప్రముఖంగా ప్రచురింపబడింది- ఇంజినీరింగ్ కాలేజీ ఆడపిల్లల హాస్టల్లో మొదటి సంవత్సరం

# కాఫీ కబుర్లు!



ఉద్యోగులు కాఫీ తాగడంపై అమెరికాలో నిర్వహించిన సర్వేలో 61 శాతం పనిచేసే చోట రెండుకప్పుల కాఫీ తాగుతామన్నారు. కాఫీ తాగకపోతే పనిచేసే సామర్థ్యం తగ్గుతుందని నలభైఆరు శాతం చెప్పారు. కాఫీ ఎక్కువగా తాగే వృత్తులవారు వరుసగా శాస్త్రవేత్తలు, లాబ్ టెక్నీషియన్లు, మార్కెటింగ్ ప్రొఫెషనల్స్, ఎడ్యుకేషన్ అడ్మినిస్ట్రేటర్స్, సంపాదకులు/రచయితలు,




వైద్యులు, వంటవాళ్లు, ప్రొఫెసర్లు, సామాజిక కార్యకర్తలు తదితరులు. వీరుకాక నర్స్, స్కిల్డ్ ట్రేడ్ పర్సనల్, పర్సనల్ కేర్‌టేకర్ తదితర వృత్తులవారు కూడా కాఫీ బాగానే తాగుతారట.

జడ్జీలు, లాయర్లు, హోటల్ కార్మికులు బ్లాక్ కాఫీ తాగితే, రచయితలు, ఉపాధ్యాయులు కాఫీకి ఏదైనా రుచిని కలిపి తాగుతారు. హ్యూమన్ రిసోర్స్ పర్సన్స్, పర్సనల్ కేర్‌టేకర్స్ పాలు, చక్కెర కలిపిన కాఫీ తాగుతారు. విమానాల్లో స్టార్‌బక్స్ లేదా ఇంకేదైనా కాఫీని కొని తెచ్చుకునేవారు కాఫీకి బాగా అలవాటు పడ్డవారేనట. ప్రపంచంలోనే రుచిగల, నాణ్యమైన కాఫీ అమెరికా, ఇంగ్లండ్‌లలోనే దొరుకుతుందని చెప్పారట. యూరప్‌లోని దేశాల్లో ముఖ్యంగా జర్మన్‌కాఫీ అంత రుచిగా ఉండదట!

విద్యార్థిని సుస్మిత మేడ మీద నుంచి దూకి ఆత్మహత్య చేసుకుందని ప్రాథమిక సమాచారం. అయితే పోస్ట్‌మార్టంలో అది ఆత్మహత్య కాదు, హత్యేనని తేలింది. అంతేగాకుండా అవివాహిత అయిన ఆమె గర్భవతి అని, బాగా మాదకద్రవ్యాలకు అలవాటు పడిందని నిర్ధారించబడింది. పూర్తి వివరాలు నాలుగో పేజీలో...

సుస్మిత కేసు నగరంలో సంచలనాన్నే కలిగించింది. హాస్టల్ గదిలో ఆమె రాసినట్లున్న ఉత్తరం నిజానికి ఆమె రాసింది కాదని పరీక్షల్లో తేలింది. అంటే ఆమెను చంపినవాడికి సుస్మితను వదిలించుకోవాలన్న కోరికే కాకుండా సహాధ్యాయి ఆనంద్‌ను ఇరికించాలన్న ఉద్దేశ్యం ఉన్నట్లుగా సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ వెల్లడించారు'

మరునాడు ఉదయం హాస్టల్‌లో పిల్లలు కాలేజీకి వెళ్ళిన తరువాత అక్కడకు వెళ్ళాడు ప్రశాంత్.

"మేడమ్! ఇక్కడ మీ డ్యూటీ ఎన్ని గంటల నుండి ఎన్ని గంటల వరకు? " వార్డెన్‌ను అడిగాడు.

"నేను ఇక్కడే ఉంటానండి.. థర్డ్ ఫ్లోర్‌లో రూం ఇచ్చారు. డ్యూటీకి ప్రత్యేకంగా టైం అంటూ ఏమీ లేదు!"

"వార్డెన్ హాస్టల్‌లోనే వుండాలనే నిబంధన ఏమైనా ఉన్నదా? "

"ఉన్నదో లేదో నాకు తెలియదుగాని, నేనే అడిగాను, ఇక్కడే వుండేందుకు అవకాశం కల్పించమని. మా అమ్మానాన్నా మాచర్లలో వుంటారు. అక్కడ మాకు స్వంత ఇల్లు ఉన్నది!"

"అంటే...? " సంశయిస్తున్నట్లుగా ఒక్క క్షణం ఆగాడు.

"మీకు వివాహం కాలేదా? "

"నా భర్త ఇదే కాలేజీలో ల్యాబ్‌లో పని చేసేవారండి. రెండేళ్ల క్రితం ఓ రోడ్ యాక్సిడెంట్‌లో చనిపోవటంతో నాకీ

ఉద్యోగాన్ని ఇచ్చారు!!" ఆమె తల వంచుకొని చిన్నగా చెప్పింది.

"ఒంటరిగా వున్నా భయం వుండదనే ఉద్దేశ్యంతో ఇక్కడే ఉండాలని నిర్ణయించుకున్నాను. పిల్లలు లేని నేను ఇక్కడే వుంటే అందరూ నా పిల్లలే అన్నట్లుగా జాగ్రత్తగా చూసుకుంటూ సంస్థకు మంచి పేరు తీసుకురావచ్చని అనుకున్నాను!"

"మీరు అంత జాగ్రత్తగా వుంటున్నా ఈ ఘోరం ఎలా జరిగింది మేడమ్? " అడిగాడు. ఆమె పైకి కనబడుతున్నంత అమాయకురాలేం కాదనిపించింది.

"అదే అర్థం కావటం లేదండి!" అన్నది దిగులుగా ప్రశాంత్‌ను చూస్తూ.

"సుస్మితది ఆత్మహత్య కాదు.. హత్య అని మీకెప్పుడు తెలిసింది? "

"రాత్రి టీవీలో చూశాను! దాంతో నా మనస్సంతా పాడయిపోయింది! హాస్టల్ లోపలకు ఓ మనిషి వచ్చి గొంతు పిసికి చంపి పైకి తీసుకువెళ్లి కిందకు పడేశాడంటే నమ్మశక్యం కాకుండా వున్నది!"

"ఆ అమ్మాయి గర్భవతి. అంతేకాదు... మాదకద్రవ్యాలకూ అలవాటు పడింది. హాస్టల్‌లో అన్నీ బాగానే సమకూరుతున్నాయన్నమాట!" కాస్తంత ఎగతాళిగా అన్నాడు, "మీరెన్ని జాగ్రత్తలు తీసుకున్నా!"

ప్రశాంత్ మాటలకు చారుమతి ముఖం పాలిపోయింది. "బయట తిరుగుతూ, బయట నుంచి వాటిని తెచ్చుకుంటుంటే రోజూ నేను వాళ్ళ బ్యాగ్‌లను చెక్ చేయలేను కదా సార్!"

"మీరు వెళ్ళి నీలిమను పంపండి!" అని ప్రశాంత్ చెప్పిన రెండు నిమిషాల్లోనే నీలిమ వచ్చింది.

"సుస్మిత నీకెన్నాళ్ళబట్టీ తెలుసు? "

"ఈ హాస్టల్‌లో జేరినప్పటి నుంచే!"

"మీ ఇద్దరూ స్నేహంగా వుంటారా? "

"ఒకే రూంలో వుంటాం కదా అంకుల్.. బాగా స్నేహంగానే వుంటాం!"

"నా ఉద్దేశ్యం.. స్వవిషయాలు చెప్పుకునేంత చనువు వున్నదా మీ మధ్య అని!"

"సుస్మిత నాతోనే కాదు, అందరితోనూ చనువుగా వుంటుంది.. అప్పుడప్పుడూ ఎగతాళి చేస్తుండేదాన్ని... నీకు స్నేహితులు కానివాళ్ళు ఎవరైనా వున్నారా అని!"

"ఆ అమ్మాయికి మగపిల్లలతో కూడా స్నేహమెక్కువేనా? "

"అవును" అన్నట్లుగా తలాడిస్తూ మౌనంగా వుండిపోయింది నీలిమ.

"సుస్మిత గర్భవతి అని తెలిసింది కదా? ఆ అమ్మాయిని తరచూ కలిసే కుర్రవాడు ఎవరో చెప్పగలవా? "

"చెప్పాను గదా అంకుల్.. అందరితోనూ సరదాగానే వుంటుంది. హాస్టల్‌కు మాత్రం దానికోసం ఎవరూ వచ్చినట్లుగా ఎప్పుడూ గమనించలేదు. కాలేజీలో అంటారా.. మా ఇద్దరిదీ ఒక గ్రూప్ కాకపోవటంతో పొద్దున బస్సు దిగాక సాయంత్రం బస్సెక్కేటంత వరకూ సామాన్యంగా కలవం!" నీలిమ చాలా తెలివిగలదనిపించింది ప్రశాంత్‌కి.

"పోనీయ్.. ఆడపిల్లలలోనే నీ తర్వాత ఇంకెవరితో ఎక్కువగా తిరిగేది? "

కొద్ది క్షణాలు ఆలోచిస్తున్నట్లుగా ఆగి "ఎక్కువగా రాగిణితోనే కనిపించేది. ఆ అమ్మాయి ఫైనల్ ఇయరేగాని ఇద్దరిదీ ఒకే గ్రూప్ అవ్వటంతో సబ్జెక్టు మీద మాట్లాడుకునేవారేమో? !"

"రాత్రి హాస్టల్‌కు వచ్చాక గదిలో డ్రగ్స్ తీసుకునే అలవాటు మీకిద్దరికీ వున్నదా? "

ప్రశాంత్ అడిగిన ప్రశ్నకు నీలిమ ముఖం కందగడ్డలా ఎర్రబడింది.

"నేనెప్పుడూ తీసుకోలేదు.. అసలు అది ఎలా వుంటుందో కూడా నాకు తెలియదు!" అంది చాలా చిన్నగా.

"అంటే సుస్మిత తీసుకునేదనేనా? "

"అదేమిటో నాకు తెలియదుగాని... ఒంట్లో బాగాలేదు. తలనొప్పిగా వున్నది.. మందేసుకు పడుకుంటే హాయిగా వుంటుంది - అంటూ అప్పుడప్పుడూ ఏవో తింటుండేది" అంది చిన్నగా.

"ఆనంద్‌తో సుస్మితకు బాగా పరిచయమున్నదా? " ఆ అమ్మాయి ముఖంలోకే చూస్తూ అడిగాడు ప్రశాంత్.

"అంత ఉందనుకోను. ఎప్పుడో మాటల్లో చెప్పింది అతడు తన తల్లి స్నేహితురాలి కొడుకని. ఒట్టి బుద్ధూ.. ఒక్క సరదాలేదూ లేదు.. ఎప్పుడూ చదువంటూ ఉంటాడు. ఎంత తెలివిగలవాడు, అందగాడయితేనేం జీవితాన్ని అనుభవించటం చేతకానప్పుడు- అంటూ!"

★ ★ ★

తొమ్మిది గంటలయింది. కాలేజీ బస్సులు ఒక్కొక్కటే వస్తున్నాయి. బస్సు దిగిన వాళ్ళు గుంపులు గుంపులుగా జేరి సుస్మిత మరణం గురించే మాట్లాడుకుంటున్నారు. చాలామంది చేతుల్లో ఆ రోజు పేపరు ఉన్నది.

వాళ్ళకెవ్వరికీ అర్థం కానిది ఆనంద్ విషయమే. ఆ అమ్మాయితో అతడు తిరగటం ఎవరూ ఇంతవరకూ చూడలేదు. వాళ్ళు కాలేజీలో ఎదురు పడినప్పుడు మాట్లాడుకునేది కొద్ది నిముషాలే. అటు సుస్మితా క్లాసులో సరదాగా వుంటూ అందరికీ స్నేహపాత్రురాలవ్వటంతో ఆమెకు తెలిసినవాళ్ళంతా జరిగినదానికి చాలా బాధ పడుతున్నారు. నిన్న తాము విన్న విషయాలకు ఈ రోజు పేపర్లో వచ్చిన వార్తలు చాలా భిన్నంగా వున్నాయి!

అంతకు మించి వాళ్ళకు మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది- కాలేజికి టూ వీలర్స్ మీద బయల్దేరిన వెంకట్, రాజులను దారిలో కాపుకాసి పోలీసులు పట్టుకొని స్టేషన్‌కు తీసుకు వెళ్లారనే వార్త!

★ ★ ★

## గాలిలో రాజీనామా!




ఆగస్టు 2010న జెట్ బ్లూ ఎయిర్‌లైన్స్‌లో పనిచేసే స్టీవెన్ స్లేటర్ అనే స్టీవార్డ్‌కు న్యూయార్కు ఎయిర్‌పోర్టులో విమానమెక్కిన ప్రయాణికుడితో వాదన మొదలైంది. అప్పటికే విమానం తలుపులు మూసే



శారు. దాంతో స్టీవార్డ్ కోపంగా ఇంటర్‌కమ్‌లో ప్రయాణికులు వినేలా 'నాతో వాదిస్తూ, నా తల్లిని తిట్టిన ప్రయాణికుడా! విను.. నేను గత ఇరవైఎనిమిదేళ్లుగా స్టీవార్డ్‌గా పని చేస్తున్నాను. ఇక చాలు, నేను ఈ ఉద్యోగానికి ఇప్పుడే రాజీనామా చేస్తున్నాను' అని ప్రకటించాడు. అతడు బయటికి వెళ్లడానికి విమానం తలుపులు తెరవడానికి పైలెట్ అంగీకరించలేదు. దాంతో స్లేటర్ ఎమర్జెన్సీ ఎగ్జిట్ తలుపు తెరచుకుని, గాలితో నింపిన స్లైడ్ మీదనుంచి కిందికి జారిపోయాడు. డిపార్చర్ లాంజ్‌లోకి వెళ్లి, టెర్మినల్ ట్రెయిన్ ఎక్కేసి ఎంచక్కా ఇంటికి వెళ్లిపోయాడు.

ఈ సమాచారం అందుకున్న పోలీసులు అతని ఇంటికి వెళ్లి విమాన ప్రయాణికులకు ప్రమాదం కలిగేలా ప్రవర్తించినందుకు అతడ్ని కస్టడీలోకి తీసుకున్నారు. నలభైతొమ్మిదేళ్ల ఈ స్టీవార్డ్, ఓవర్ హెడ్ కంపార్ట్‌మెంట్ నుంచి ఒక ప్రయాణికుడు తన సామాను తీసుకుంటుంటే వద్దని వారించాడు. దాంతో పోట్లాట మొదలైంది.

రౌడీ కస్టమర్స్‌తో తమకు ఇలాంటి చేదు అనుభవాలు అనేకం ఉన్నాయని, స్లేటర్‌ను వెంటనే విడుదల చేయాలని ఆన్‌లైన్‌లో చాలా మంది రాశారు.

# చతుర ప్రవేశిక

## ఫిబ్రవరి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. రాగిణి తండ్రి ఎవరు?
జ.
2. శ్యామల తల్లి ఎవరు?
జ.
3. సుస్మిత హత్యకు కారకుడు?
జ.
4. ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ కొడుకు?
జ.
5. గుర్నాథం తండ్రి?
జ.
6. మృదుల కూతురు?
జ.
7. నిరాహార దీక్షకు కూర్చున్నది?
జ.
8. అమర్‌కాంత్‌కు జ్ఞానపీఠం వచ్చిన ఏడాది?
జ.
9. రేడియోను కనుగొన్నది?
జ.
10. బేబీ బాక్సులు పెట్టిన దేశం?

---

పంపినవారి పేరు: ---------------

------------------వయసు (  )

చిరునామా: ----------------

------------------------

------------------------

పిన్‌కోడ్:  ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

---

ఉదయం పది దాటింది. కోర్టు ముందు మృదుల ఆత్రంగా ఎదురు చూస్తున్నది... పోలీసులు గుర్నాథాన్ని తీసుకు వస్తున్నారా లేదా అని. ప్రశాంత్ జీపులో నుంచి దిగుతూనే ఆమెకు దగ్గరగా వచ్చి "ఇవ్వాళా గుర్నాథం వచ్చేటట్లు లేదు. డాక్టర్లు అతడింకా కోలుకోలేదంటున్నారు. కేసు వాయిదా పడవచ్చు!" అన్నాడు.

నీరసంగా అతడి వంక చూసింది. "వెనుక దన్నులేని నాలాంటి వాళ్ళ గతి ఇంతే సార్! వాడిని కోర్టుకు తెప్పించటం మీ వల్ల కాదు... నా కూతురు బాధ నేను చూడలేను... దిక్కులేనిదానిలా అది ఆసుపత్రిలో పడి ఏడుస్తున్నది.. మగవాడిని చూస్తే పులిని చూచినట్లు వణికిపోతున్నది. జరుగుతున్న తీరు చూస్తుంటే ఆసుపత్రిలోనే చచ్చి శవమై వస్తుందేమోనని భయంగా వున్నది. ఈ వెధవ కేసును వదిలేద్దామన్నా ఆ రాక్షసుడిని అలా ఆంబోతులా ముద్ర వేసి దేశం మీద వదలటానికి నా మనస్సు అంగీకరించటం లేదు!" ఆమె బాధ పడుతూ అన్నది.

ఆ రోజూ అదే తీరు. కోర్టులో గుర్నాథం లాయరు లేచి, "నా క్లయింట్ ఇంకా కోలుకోలేదు యువరానర్! గుండెనొప్పితో బాధ పడుతూ ఆసుపత్రిలోనే వున్నాడు.. డాక్టర్లేమో బెడ్‌మీద నుంచి కదలటానికి వీల్లేదంటున్నారు. కేసును పదిహేను రోజులు వాయిదా వేయమని కోరుకుంటున్నాను!" అన్నాడు వినయంగా.

న్యాయమూర్తి కొద్ది క్షణాలు ఆలోచిస్తున్నట్లుగా ఆగి పబ్లిక్ ప్రాసిక్యూటర్ వంక చూశారు, ఆయన అభిప్రాయం కూడా తెలుసుకోవాలి అన్నట్లుగా.

"ఇలా ప్రతిసారీ వాయిదా పడేలా ప్రయత్నించటం నాకెందుకో అనుమానం కలిగిస్తున్నది యువరానర్. అతడికి ఇరవై ఎనిమిదేళ్లే.. ఈ ఫిర్యాదు వచ్చేంత వరకూ అతడు ఆరోగ్యంగానే రోడ్లమీద తిరుగుతు

న్నాడనేది నిర్వివాదాంశం. అటువంటప్పుడు అతడు చికిత్స పొందుతూ కూడా ఎన్ని రోజులైనా గుండెనొప్పి నుండి కోలుకోవటంలేదంటే వింతగానే ఉంది. కనుక అక్కడ అతడు పొందుతున్న వైద్య వివరాలను పరిశీలించాలని కోరుతున్నాను!"

చటుక్కున డిఫెన్స్ లాయర్ లేచి, "ఐ అబ్జెక్ట్ యువర్ ఆనర్. అతడికి స్వస్థత కలగకపోవటానికి ప్రభుత్వ ఆసుపత్రిలోని వైద్యుల శక్తిసామర్థ్యాలను శంకించటం సరికాదు!" అన్నాడు ఆవేశంగా.

ఒక్క క్షణం ఆలోచిస్తున్నట్లుగా ఆగి, "ప్లీజ్ ప్రొసీడ్!" అన్నారు న్యాయమూర్తి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను చూస్తూ.

"నేను అక్కడి వైద్యుల్ని శంకించటం లేదు. అతడి రుగ్మత ఎన్నాళ్ళకీ తగ్గటం లేదంటే మరో డాక్టర్ అభిప్రాయం పొందటం రోగికీ మంచిదే!" అన్నాడు, ఆ మాటను ఒత్తి పలుకుతూ.

న్యాయమూర్తి వడివడిగా కేసు ఫైల్ మీద రాసుకుపోతున్నాడు. "పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గారి వాదనలో అర్థమున్నదనే అనిపిస్తున్నది. వెంటనే ప్రభుత్వ ఆసుపత్రి సూపరింటెండెంట్‌ని, ఓ కార్డియాలజిస్ట్, మరో జనరల్ ఫిజిషియన్‌తో కలిసి నిందితుడిని పరీక్షించి మూడు రోజుల్లోగా నివేదిక ఇవ్వాల్సిందిగా ఆదేశిస్తున్నాను!"

★ ★ ★

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. అప్పటికే వెంకట్, రాజూ పోలీసు స్టేషన్‌కు వచ్చి రెండు గంటలు దాటింది. ఎవరితోటీ మాట్లాడేందుకు వీల్లేకుండా జీపులో ఎక్కుతుండగానే సెల్‌ఫోన్‌లు తీసేసుకోవటంతో అందరిమీదా నిప్పులు కక్కుతున్నారు. ప్రశాంత్ ఏసీపీ కోసం ఎదురు చూస్తున్నాడు. వీళ్ళను తీసుకురాగానే ఆయనకు ఫోన్ చేసి చెప్పాడు. ఒంటిగంటయింది, ఏసీపీ వచ్చేటప్పటికి. అంతవరకూ వాళ్ళ వీరంగాన్ని సహనంతో భరిస్తూనే వున్నాడు.

ఆయన వస్తూనే "ఓకే ఫ్రెండ్స్.. మీ కాలేజీ ఆడపిల్లల హాస్టల్‌లో సుస్మిత హత్య చేయబడిందనే విషయం తెలిసిందే కదా? అది మీరే చేసినట్లుగా మాకు సమాచారం అందింది. అందుకే మిమ్మల్ని ఇక్కడకు తీసుకువచ్చింది!"

ముందు కోలుకోలేని దెబ్బ కొడితే నడుం విరిగి సీదాగా మాట్లాడతారని ఆయన నమ్మకం. కానీ ముదురు మనుష్యుల ముందు అది చెల్లలేదు!

"అది పచ్చి అబద్ధం!" అన్నాడు వెంకట్.

"సుస్మితను మీరు కాలేజీ క్యాంపస్‌లో ర్యాగింగ్ చేశారు. ఆ అవమానాన్ని భరించలేక, ఆనంద్ అనే తనకు తెలిసిన కుర్రవాడిని తీసుకొని వెళ్ళి ప్రిన్సిపాల్‌కు రిపోర్ట్ ఇచ్చింది. దాంతో మీ అహమే మీలో కోపాన్ని రగిల్చింది. దాన్ని చల్లార్చుకునేందుకే అర్ధరాత్రి హాస్టల్‌కు వెళ్ళి ఆ అమ్మాయిని గొంతు పిసికి చంపి, అదో ఆత్మహత్యగా చిత్రీకరిస్తూ మేడ మీద నుంచి పడేశారు. మీ మరో శత్రువు ఆనందే ఆమె ఆత్మహత్యకు కారణంలా ఓ లేఖను సృష్టించి అందరినీ తప్పుదారి పట్టించాలనుకున్నారు... అవునా!" ఆయన వాళ్ళనే చూస్తూ ఆగాడు.

"మామీద అది చాలా ఘోరమైన ఆరోపణ" అన్నాడు కీచు గొంతుకతో రాజు.

★ ★ ★

ఒకరోజు సాయంత్రం నాలుగు గంటలప్పుడు వీరభద్రుడి భార్య తన పిల్లల్ని తీసుకొని ఆశ్రమానికి వచ్చింది.

చక్రవర్తి అప్పటికే తన నివాసాన్ని తాము నిర్వహిస్తున్న అనాథాశ్రమానికి మార్చాడు. ఆయన బాధ్యతలన్నీ పిల్లలిద్దరికీ అప్పజెప్పాడు. వ్యాపారాలన్నీ కొడుకు జయంత్‌కు, 'హోటల్ చంద్రిక'ను

కూతురు రాగిణి నిర్వహణకు వదిలేశాడు.

ఆయనతోపాటే డ్రైవర్ కోటి వచ్చాడు. నమ్మకస్తుడైన శిష్యుడు బాలరాజు వచ్చాడు. వాళ్లకు సాయంగా బాలరాజే మరి కొంతమందిని తెచ్చుకున్నాడు.

ఆశ్రమ ఆవరణలోనే రెల్లుతో రెండు గదులు, కిచెన్ ఉన్న చిన్నఇంటిని ఏర్పర చుకున్నాడు. ఇన్నాళ్ళూ ఏసీల నడుమ బతికిన చక్రవర్తికి రెల్లు ఇంటిలో ఉండ టమూ కష్టమే గనుక దానికి అన్ని వస తులూ అమరాయి. ఆ ఆవరణలోనే ఒక గుడి కూడా కట్టించుకున్నాడు.

ఉదయాన ఆశ్రమంలోని పిల్లలంతా ఆరు గంటలకల్లా లేస్తూనే తోటలో కాసిన కాయగూరలని, పూలనీ కోస్తే, తోటమా లులు విడివిడిగా వాటిని బుట్టల్లోకి సర్ది ట్రక్కులోకి ఎక్కించి నగరంలోని మార్కె ట్‌కు పంపుతారు. తరువాత పిల్లలు స్నానాలు చేసి దేవాలయానికి వెళతారు. అక్కడ ఒక పావుగంట ప్రార్థన చేస్తారు. దేవుడి పాటలు పాడతారు. తరువాత వెళ్ళి అల్పాహారం తీసుకొని చెట్ల కింద చదువుకోవటం ప్రారంభిస్తారు. నగరం నుంచి రోజూ ఇద్దరు టీచర్లు వాళ్ళకు చదువు చెప్పటానికి వస్తారు.

ఉదయం తొమ్మిది నుంచి మధ్యాహ్నం మూడు గంటలదాకా ఆ చదువు కొనసాగు తుంది. మధ్యలో భోజనాలకు ఓ అర గంట సమయం వుంటుంది. సాయంత్రం తిరిగి పిల్లలంతా తోటపనిలోకి దిగుతారు.

అప్పుడే చీకటి పడుతోంది. చక్రవర్తి పర్ణశాలముందు సింహాసనం లాంటి కుర్చీలో కూర్చునివున్నాడు. ఆయన తెల్లటి ధోవతి కట్టుకొని, తెల్లటి లాల్చీ వేసుకు న్నాడు. మెళ్ళో తులసి పూసల దండ.. నుదుట గంధపు బొట్టు..

కాస్తంత దూరంలో వీరభద్రుడి భార్య ఇద్దరు పిల్లల్ని పెట్టుకొని ఆయన్నే దీనంగా చూస్తూ కూర్చున్నది.

"నిన్న ఆయన్ను కలిసి వచ్చాను జైలు కెళ్ళి!" అన్నది తలవంచుకొని.

"ఆయనకు జైల్లో అందరూ చెబుతున్నా రట.. తనకు పడ్డ ఉరిశిక్షను తప్పించటం ఎవరి తరం కాదని!" అన్నది మళ్లీ.

ఆమెకు కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

"వెధవలు వాళ్ళకేం తెలుసు.. చేతిలో డబ్బుంటే తిమ్మిని బొమ్మిని చేయవచ్చు.. అక్కడ జైల్లో చేరేదంతా ఏమీ చేతగాని చవటలే. నీ మొగుణ్ణి జైలునుంచి తప్పించే బాధ్యత నాది. హైకోర్టులో మహా అయితే రెండేళ్లు శిక్ష పడవచ్చు. అందులో ఇప్ప టికే సంవత్సరం గడిచిపోయింది. నీకు తిండికి ఇబ్బంది లేకుండా చూస్తూనే వున్నాను కదా!" అన్నాడు అనునయంగా.

"నీకే గాదు వాడు లేకపోతే నాకెంత ఇబ్బందిగా వున్నదో తెలుసా!"

"బళ్ళో పిల్లలంతా వీళ్ళను ఎగతాళిగా చూస్తున్నారుట... హంతకుడి పిల్లలు అంటూ దగ్గరకే రానీయటం లేదట"

"ఎందుకా స్కూలుకు వెళ్ళటం వాళ్ళు? నిన్ను పిల్లల్ని తీసుకొని ఇక్కడికే వచ్చి ఉండమన్నానా? వాళ్ళకు చదువు వస్తుంది. నువ్వు ఊరికినే కూర్చొని వెధవ ఆలోచనలతో బుర్ర పాడుచేసుకోక అమ్మ గారికి తోడుగా వుండి ఇంటి పనులు చూసుకోవచ్చు. చెప్పిన మాట వినకపోతే నేనేం చేసేది!" చికాగ్గా అన్నాడు.

ఆమెకు ఇక్కడకు వచ్చి వీళ్ళకు ఊడిగం చేయటం ఏమాత్రం ఇష్టం లేదు. ఆమె వాళ్ళంతా చెవిలో ఇల్లుగట్టుకుని రోజూ పోరుతున్నారు- తన భర్త జైలుకు వెళ్ళటా నికి కారణం చక్రవర్తేనని. అందుకే ఇక్క డుంటే తననీ పిల్లల్నీ ఇంకా ఎన్ని ఇబ్బం దులకు గురిచేస్తాడో అని మనస్సులో భయంగూడా వున్నది. కానీ భర్త జైలు నుంచి విడుదలై వచ్చేంతవరకూ తనూ

జాగ్రత్తగానే మంచిగా మాట్లాడుతుండాలి!

"నీ ఇష్టం. నేనేం బలవంతం చేయను.. వాడు బయటకు వచ్చేంతవరకూ మిమ్మల్ని పోషించే బాధ్యత నాది. నేను మాట తప్పే వాడ్ని కాదు!" అన్నాడు చక్రవర్తి, ఆమెకు మరోమాటకు అవకాశమివ్వకుండా.

"అరేయ్ బాలరాజు! వీళ్ళను మన ట్రక్కులో ఎక్కించి ఇంటికి పంపరా. వెళ్ళే టప్పుడు వాళ్ళకు కావాల్సిన కూరలివ్వు!"

★ ★ ★

రాత్రి పదకొండు గంటలైంది. ప్రశాంత్ ఎక్కిన జీపు హైవే మీద విజయవాడవై పుకు దూసుకుపోతోంది.

పెదకాకాని ఇవతల నేషనల్ హైవే బైపాస్ రోడ్డువద్ద జీపు ఆపి కూర్చున్నాడు.

గంట క్రితం ఒక ఇన్‌ఫార్మర్ ఫోన్ చేసి చెప్పాడు. "తాడేపల్లి వైపు నుండి బైపాస్ రోడ్డుమీదుగా ఓ తెల్ల అంబాసిడర్ వస్తు న్నది. దాని డిక్కీలో కృష్ణా నది ఇవతల పెద్ద మొత్తంలో డబ్బు ఎక్కించి పంపుతు న్నారు.. ఇసుక వ్యాపారానికి సంబంధించి నదై వుంటుందని అనుమానం.. ఇక్కడ అది బయల్దేరి అయిదు నిమిషాలైంది.. దాని నంబరు రాసుకోండి సార్!"

వెంటనే నలుగురు కానిస్టేబుల్స్‌ను తీసుకొని బయల్దేరి అతడు చెప్పినట్లుగా పెదకాకాని ఇవతల బైపాస్ రోడ్డుకు ముందు కాపు వేశాడు. అందరూ మఫ్టీలో వున్నారు. ఇన్‌స్పెక్టర్ విజయ్ మాత్రం టూ వీలర్‌మీద వచ్చి ఓ చెట్టు చాటున ఆపుకొని దానిమీద కూర్చుని వున్నాడు.

అది అమావాస్యకు ముందురోజు అవ్వ టంతో అంతా చీకటిగా వున్నది. ఆ హైవే ఎప్పుడూ బిజీగానే వుంటుంది. ఆగకుండా లారీలు వెళుతున్నాయి, వస్తున్నాయి. అవి గాక ఆర్టీసీ బస్సులు, కార్లు.

జీపుకి, టూ వీలర్‌కు గూడా హెడ్‌లైట్లు ఆర్పేసి కూర్చున్నాడు. సరిగ్గా అరగంటకు విజయవాడవైపునుంచి దూరంగా వాహ నాల లైట్ల కాంతిలో ఓ తెల్ల అంబాసిడర్ కనబడింది. అందరూ ఎలర్ట్ అయ్యారు.

ఇద్దరు కానిస్టేబుల్స్ రోడ్డు మధ్యలో నిలబడి లిఫ్ట్ కావాలన్నట్లుగా బొటనవేలు చూపించారు.

కారు ఆగింది, వాళ్ళు అడ్డంగా నిలబడ టంతో. తనకు ఇన్‌ఫార్మర్ చెప్పిందే ఆ కారు నంబరు!

ప్రశాంత్ పక్కనుంచి డ్రైవర్ దగ్గరకు వెళ్ళాడు. కారు ఆగటంతో విజయ్ బండి మీదనుంచి దిగి ఆ కారుకు మరోవైపు వచ్చాడు. వెనగ్గా ఇద్దరు కానిస్టేబుల్స్ వెళ్ళి కారును ఆనుకొని నిలబడ్డారు.

"ఏంకావాలి? " డ్రైవర్ విసురుగా అడి గాడు తల బయటకు పెట్టి.

ప్రశాంత్ సైగ చేయటం ఆలస్యం కారు వెనుక టైర్‌లో గాలి తీసేశారు కానిస్టే బుల్స్. కారులో వున్న ఇద్దరికీ అర్థమైపో యింది తమ దగ్గరున్న డబ్బును దోచుకు నేందుకు దొంగలు చుట్టుముట్టారని. డోర్లు తీసుకొని ఇద్దరూ ఒక్కసారిగా దిగబో యారు జేబుల్లోని ఆయుధాలను చేతిల్లోకి తీసుకుంటూ. అదే వాళ్ళు చేసిన ఘోర మైన తప్పిదం!

వాళ్ళు ఊహించలేనంత వేగంతో, దిగు తుండగానే గట్టిగా పట్టుకున్నారు నలు

**కొత్తగాలి...**

**విద్య**
**సర్వయోగ**
**ప్రదాయిని**

– రాజ్‌శ్రీ ఎడ్వర్డ్,
హైదరాబాద్

గురు కానిస్టేబుల్స్ వెనకనుంచి. రోడ్డు పక్కనున్న జీపును తీసుకువచ్చి వాళ్ళ ముందు నిలబెట్టాడు. దానిమీద వున్న అక్షరాలను చూస్తూనే వాళ్ళకు తెలిసిపోయింది తమని చుట్టిముట్టింది హైవే దొంగలు కాదు, పోలీసులని!

వెంటనే సెల్‌ఫోన్లను బయటకు తీయబోయారు గాని, వాళ్ళకు ఆ అవకాశాన్ని చిక్కనీయలేదు ప్రశాంత్!

★ ★ ★

చక్రాయుధం-

పురాణకాలంలో ఏ రాక్షసుడైనా భూమ్మీద ప్రజలను హింసిస్తున్నప్పుడు శ్రీమహావిష్ణువే ఓ అవతారమెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయటానికి పూనుకునేవాడు. నేడు హిరణ్యాక్షులూ, హిరణ్యకశిపులూ, రావణాసురులు, నరకాసురులు, బకాసురులు పుడమిమీద పుట్టుగొడుగుల్లా పుట్టుకువస్తుంటే, మహావిష్ణువు లక్ష అవతారాలు ఎత్తినా వీళ్ళను నియంత్రించటం కష్టమేమో అనిపిస్తుండగా, మేమే నడుం కట్టి ఓ చక్రాయుధాన్ని తయారుచేయబూనాం. ప్రపంచ చరిత్ర చూస్తుంటే తమకు ఎదురులేదని విర్రవీగుతూ ప్రజల్ని దోచుకుతిన్న దేశాధినేతలే ప్రజల చక్రాయుధానికి మట్టి కరిచారు.

మేమంతా స్వచ్ఛందంగా ముందుకు వస్తున్న యువకులం. మా తోటి ప్రజలకు, తామేవిధంగా నేటి రాక్షసుల దోపిడీకి గురవుతున్నదీ తెలియజేస్తూ చైతన్యం తీసుకురావటమే మా చక్రాయుధ లక్ష్యం.

మాదకద్రవ్యాలు దేశమంతా విస్తరించి యువతను మత్తుకు బానిసలుగా చేస్తున్నాయి. ధనార్తులు కొందరు దొంగ మార్గాలలో వాటిని విదేశాల నుంచి దొడ్డిదారిన తీసుకువస్తూ జేబులు నింపుకుంటున్నారు. అంటే మనవాళ్ళే మనకు ద్రోహం చేస్తున్నారన్నమాట. అవి ఉపయోగిస్తున్న విద్యార్థులు విద్యనేకాక, ఆరోగ్యాన్నీ నాశనం చేసుకుంటున్నారు. దాన్ని మనం ఆపలేమా? చూస్తూ కూర్చోవటమేనా?

కొద్ది రోజుల క్రితం పొన్నూరు రోడ్డులో ఓ లారీనుండి ఎర్రచందనం దుంగలను పోలీసులు స్వాధీనం చేసుకొని అటవీశాఖకు అప్పగిస్తే అక్కడినుంచి అవి మూడు రోజుల్లోనే మాయమయ్యాయి. దానికి ఎవరు బాధ్యులు?

ఆ మధ్య చెన్నయ్ హైవే మీద యాక్సిడెంట్ అవ్వగా పన్నెండేళ్ల పిల్లవాడు జీపు లోనుంచి పడి లారీ చక్రాల కింద నలిగి చనిపోయాడు. ఆ జీపులో ఇంకా ఇద్దరు పిల్లలున్నారు. చనిపోయిన పిల్లవాడి తల్లిదండ్రులు కేసు పెట్టటానికి విముఖత చూపారు. ఆ పిల్లల్ని ఏదో ముఠాకి విక్రయించటం జరిగిందనేది చక్రాయుధం సభ్యులకు అందిన సమాచారం. వాళ్ళను కొన్నదెవరు? కొన్నవాళ్ళు ఆ పిల్లల్ని ఏవిధంగా ఉపయోగించుకుంటున్నారు? వాళ్ళను దుబాయ్ లాంటి దేశాలకు అమ్మే ప్రయత్నంలో భాగమా అది?

విద్యాలయం ఆవరణలో చెట్లకింద జేరిన కొందరు తోటి విద్యార్థులను అసభ్య పదజాలతో ఏడిపిస్తున్నారు. అది వాళ్ళకు సరదా. ఆడపిల్లలయితే ఆ మాటల్ని భరించలేక వేదన చెందుతున్నారు. కొందరు సుస్మితలే అవుతున్నారన్నా ఆశ్చర్యం లేదు. వాళ్ళను నిరోధించక తప్పదు.

ఇవన్నీ మనమంతా మనస్సు పెట్టి ఆలోచించాల్సిన విషయాలు. నీతి తప్పిన మనుష్యులు తమ గురించేగాని, తమ తోటివాళ్ళను గురించి, దేశప్రజలను గురించి, దేశాన్ని గురించిగాని ఆలోచించరు. కారణం స్వార్థం.. డబ్బును ఎలాగైనా సంపాదించాలనే యావ.. సర్వాధికారాలు తమ గుప్పిటలో ఉంచుకోవాలనే తపన..

అందుకే అది మా శక్తికి మించిన పనే

అయినా ఈ చక్రాయుధాన్ని మోయాలను కుంటున్నది... మన జనజీవనాన్ని అతలా కుతలం చేస్తున్న విషవృక్షాలను సమూ లంగా నాశనం చేయాలనేది కోరిక. అందుకు మీ ఆశీస్సులే మాకు శ్రీరామరక్ష.

అక్రమాలు కళ్ళెదుటే వరదలై పారుతు న్నాయి. దానికి అడ్డుకట్ట వేయకపోతే మ నం బతకలేం. వెంటనే మనమంతా పారలూ పలుగులూ చేబూనక తప్పదు.

సరైన సమాచారంతో అవకాశం దొరికి నప్పుడల్లా మీ ముందుకు వస్తుంటుంది చక్రాయుధం. మీరు చదవండి. మరో పది మంది చేత చదివించటమే కాదు. ఆ దు ష్కృత్యాలను ఎలా నివారించాలో ఆలో చించి కార్యాచరణకు పూనుకోండి.

నమస్కారం. శెలవ్.




**కో**ర్టుహాలంతా నిశ్శబ్దంగా వున్నది. న్యాయమూర్తి గుర్నాథం ఆరోగ్యం గురించి ప్రభుత్వాసుపత్రి సూపరింటెండెంట్ మరో ఇద్దరు డాక్టర్లతో కలిసి ఇచ్చిన నివేదిక వున్న సీల్డ్ కవరును తెరుస్తున్నారు. ఆ హాల్లో ప్రేక్షకుల నడుమ కూర్చొని వున్న మృదుల ఆ రిపోర్టులో ఏం రాశారో తెలు సుకోవటానికి ఆత్రుత పడుతున్నది. గుర్నాథం తండ్రి కూర్మావతారం అక్కడే వున్నాడు. గుర్నాథం మిత్రులూ వచ్చారు. మృదులకు తెలిసినవాళ్ళూ వచ్చివున్నారు.

జడ్జిగారు నివేదికను పూర్తిగా చదివి డిఫెన్స్ లాయర్ వంక చూసారు.

"డాక్టర్లు తమ నివేదికలో- గుర్నాథానికి ఎలాంటి అనారోగ్యమూ లేదని స్పష్టం చేశారు. అతడిని వెంటనే ఆసుపత్రి నుంచి జైలుకు తరలించాలని ఆదేశిస్తున్నాను. ఇన్నాళ్ళూ అతడు ఆడింది నాటకంగా భావిస్తూ, అతడికి వైద్యం చేస్తూ తప్పుడు రిపోర్టులిస్తున్న డాక్టర్లమీద శాఖాపరంగా విచారణ జరిపి చర్యలు తీసుకోవాలని జిల్లా ఆరోగ్యశాఖాధికారిని కోరుతున్నాను. నిందితుడి బెయిల్ పిటీషన్‌ను తిరస్క రిస్తూ, కేసును వచ్చేవారం ఇదే రోజుకు వాయిదా వేస్తున్నాను!" అంటూనే ఫైల్ మీద ఆ విషయాన్నే రాస్తూ మరో కేసు అందుకున్నారు న్యాయమూర్తి.

కూర్మావతారం బయటకు వస్తూనే నగ రంలో సమ్మె పిలుపునిచ్చాడు. వెంటనే విద్యా సంస్థలన్నీ మూత పడ్డాయి. మెయిన్ రోడ్లలో వున్న షాపులన్నీ హడా వుడిగా మూసేశారు, ఆయన కార్యకర్తలం దరూ కర్రలు తీసుకొని రోడ్డెక్కటంతో.

"కొన్ని రాజకీయపక్షాలు కుట్రపన్ని ఇప్పు డిప్పుడే పైకి వస్తూ బీద ప్రజల మన స్సుల్లో ఆరాధ్య దైవమవుతున్న యువనా యకుడిమీద అన్యాయంగా కేసు పెట్టి పోలీసులతో కుమ్మక్కయి తప్పుడు రిపోర్టు లతో అప్రతిష్టపాలు చేసి రాజకీయంగా అణగదొక్కాలనే దురుద్దేశ్యంతో కుట్రపన్ను తున్నారు... దాన్ని తిరస్కరిస్తూ ప్రజ లంతా స్వచ్ఛందంగా నగరంలో ఈ రోజు బంద్ పాటించేందుకు నిర్ణయం తీసుకు న్నారు.. ఇప్పటికయినా ప్రత్యర్థులు తాము చేసిన తప్పును సరిదిద్దుకోకపోతే మా పార్టీ చూస్తూ ఊరుకోదు! బంద్‌ను ప్రశాం తంగా పాటించాలని నేను అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రత్యర్థులు విధ్వంసా నికి దిగితే నేనుగాని, మా పార్టీగాని

బాధ్యులం కాదు!" అది కోర్టు బయట కూర్మావతారం విలేకరులకు ఎంతో ఆవేద నతో ఇచ్చిన సందేశం!

★ ★ ★

టైం చూచుకున్నాడు ఆనంద్. ఏడు దా టుతోంది. రాత్రి ఎన్నిసార్లు కాల్ చేసినా శ్యామల సెల్ స్విచ్ఆఫ్ చేసి వున్నది. ఇప్పుడు రింగవ్వడంతో ఓపిగ్గా సెల్‌ను చెవి దగ్గర పెట్టుకుని కూర్చున్నాడు.

"హలో!" అవతల శ్యామల కంఠం!

"బాగా నిద్ర వస్తోంది. ఓ గంటాగి నేనే చేస్తాను!" మాటలు ముద్దగా వున్నాయి.

"పొద్దుబోయిందాకా చదువుతున్నావా?"

"నువ్వు కాలేజీ ఎగ్గొడుతున్నప్పుడయినా ఫస్ట్‌ర్యాంకు తెచ్చుకోకపోతే నాకు ఛాన్స్ ఎప్పుడు దొరుకుతుంది?"

"డోంట్ వర్రీ! రేపు రాబోతున్న పరీక్ష లను నేను రాయటం లేదు. ఫస్ట్‌ర్యాంక్ గ్యారెంటీగా నీదే!"

"ఎందుకు రాయటం లేదు?"

"ఓ నెలరోజులపాటు దేశమంతా చుట్టి రావాలని, మూసుకుపోయిన మనస్సు కవాటాలను తెరిచి బాగు చేయించుకు రావాలని, తిరిగి వచ్చాక ఆ ఫస్ట్ ర్యాంకును నా స్వంతం చేసుకునేందుకు కొత్త ఊపిరితో ప్రయత్నించాలని!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"ఓకే మై ఫ్రెండ్! మనిద్దరి నిర్ణయాలూ చాలా వాటిలో కలుస్తుంటయ్యని తెలుసు. నేనూ పరీక్ష రాయను! ఎంత ప్రయత్నిం చినా బుర్రకెక్కటం లేదు. ఫస్ట్‌ర్యాంకు కాదు.. అసలు ఏ ర్యాంకూ రాకపోగా జీరోలతో అవమానం పొందవలసి వస్తుం దేమోననిపించి హాయిగా మానేద్దామను కుంటున్నాను. జీవితాన్ని ఎంజాయ్ చేయ టంలో కూడా సుఖమున్నదనే భావన నన్ను ఆ నిర్ణయానికి కట్టిపడేసింది. ప్లీజ్, కాసేపుండి ఫోన్ చేస్తాను.. ఏమను కోకు... కళ్ళు మూసుకుపోతున్నయి!" సెల్ ఆఫ్ చేసేసింది శ్యామల.

తన చేతిలోని సెల్‌వంకే విచిత్రంగా చాలాసేపు చూస్తూండిపోయాడు ఆనంద్!

★ ★ ★

ఉదయం పది గంటలప్పుడు సుస్మిత తల్లిదండ్రులను కలిసేందుకు విజయవాడ వెళ్ళాడు ప్రశాంత్.

సుస్మిత తండ్రి అతడిని చూస్తూనే గుర్తించాడు. "రండి!" అన్నాడు నీరసంగా.

"కేసు ఇన్వెస్టిగేట్ చేస్తున్నాం. నింది తులు త్వరలోనే దొరుకుతారనే ఆశలో వున్నాం. అందులో భాగంగానే మీ అమ్మా యిని గురించిన వివరాలను కొన్ని తెలుసు కోవటానికి వచ్చాను. అవి నిందితులను పట్టుకోవటానికి కీలకమవ్వవచ్చు!"

ఆయన చాలా పేలవంగా నవ్వాడు. "నేను ఒక్కమాట దాని గురించి చెప్పదల చుకోలేదు. అది భ్రష్టుపట్టి, చెడు తిరు గుళ్ళు తిరుగుతూ కుటుంబ పరువుకే మచ్చ తెచ్చింది. రోడ్డుమీద రూపాయి బిళ్ళపడినా దారినపోయే ప్రతివాడూ అది తనదే అన్నట్లుగా ముందుకు దూకుతాడు. ఇక అందమయిన ఆడపిల్ల రోడ్డుమీద పడిందంటే ముగింపు ఎప్పుడూ ఇలాగే వుంటుంది. ఎందుకండీ మీ ఎంక్వయి రీలు, కోర్టు విచారణలు.. ఇంకా ఇంకా దాని పేరు, మా పేర్లు నలుగురి నోళ్ళ లోనూ నానటానికా? ఏ కేసూ వద్దు.. కావాలంటే కన్న తల్లిదండ్రులమయిన మమ్మల్ని దాన్ని సరైన మార్గంలో పెంచ లేదనే అభియోగంతో అరెస్ట్‌చేసి జైలుకు పంపండి!" అన్నాడు ఆయన చేతులతో ముఖాన్ని కప్పుకొని వలవలా ఏడుస్తూ.

★ ★ ★

సాయంత్రం అయిదు గంటలప్పుడు ఏసీపీ స్టేషన్‌కు ఫోన్ చేశాడు. "వెంటనే నా దగ్గరకు రా!" అంటూ. ప్రశాంత్

అప్పుడు స్టేషన్‌లోనే వున్నాడు.

టూవీలర్ మీద బయల్దేరి ఆయనముందుకు వెళ్ళేటప్పటికి పావుగంట పట్టింది.

"కూర్చో ప్రశాంత్! కొద్దిరోజుల క్రితం రాత్రి విజయవాడ హైవేమీద కారులో తరలిస్తున్న డబ్బును పట్టుకున్నావు గదా... దాని స్వంతదారుడు ఎవరు? ఎందుకు ఆ డబ్బును కారులో తరలిస్తున్నారు? అనే విషయాలు విచారించకుండానే నువ్వు కోర్టుకు అప్పగించటమే గాకుండా, ఆదాయపు పన్ను శాఖకు కూడా తెలియబరిచావ్! ఎందుకు చేశావ్ అలా? " అడిగాడు.

"నువ్వా విషయం చెప్పిన రోజే



## కొత్తగాలి...

**మొక్కడానికి**
**రాళ్లూ రప్పలూ..**
**మెక్కడానికి**
**నవరుచులూ.. రెడీ!**

– యు. చిట్టిబాబు,
కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

అన్నాను, తొందరపడ్డావేమోనని!" అన్నాడు మళ్లీ ఆయనే సౌమ్యంగా.

"యాభై లక్షలను కారులో తరలించటం చట్ట విరుద్ధం. ఎవరికైనా ఇవ్వాల్సి వుంటే ఆ డబ్బును తమ బ్యాంక్ ఖాతాలో వేసుకొని, చెక్కు ద్వారానో, డీడీ రూపంలోనే చెల్లించాలి. అంతేగాని నిబంధనలను వ్యతిరేకిస్తున్నామని తెలిసీ గోనె సంచుల్లో కుక్కి కారులో పంపాల్సిన అవసరమేమున్నది, నల్లధనం కాకపోతే? !"

ఆయన నవ్వాడు. "పెద్దవాళ్ళతో మనం కాస్త జాగ్రత్తగా ఉండాలయ్యా! ఓ రియల్టర్ తన దగ్గర అపార్ట్‌మెంట్లు కొనుకున్న వాళ్ళు ఇచ్చిన డబ్బును బిల్డింగ్ మెటీరియల్స్‌కు ఇవ్వాల్సి సప్లయర్‌కు పంపించాడట! ఇప్పుడు అనవసరంగా ఆ డబ్బంతా కోర్టులో ఇరుక్కుంది. ఎప్పటికి రిలీజ్ అవుతుందో అంటూ బాధపడుతున్నారు!"

"అంత చిన్న విషయమైతే కోర్టు తేలిగ్గానే రిలీజ్ చేస్తుందిలేండి! వాళ్ళకు ఇబ్బందేమున్నది? "

"కానీ నువ్వు అనుకున్నంత తేలిగ్గా ఆ విషయాన్ని వదలరు వాళ్ళు!"

"ఏం చేస్తారు? " భ్రుకుటి ముడివేశాడు ప్రశాంత్.

"నువ్వు ఆ డబ్బును వదలటానికి పది లక్షలు లంచం అడిగావని, అలాంటి తప్పుడు పనులను ప్రోత్సహించటం ఇష్టం లేక నువ్వు అడిగిన డబ్బును ఇవ్వకపోవటంతో కోర్టుకు అప్పగించావని చాలా పెద్ద వాళ్ళదాకా వెళ్ళారు..

ఐయామ్ సారీ! ఇప్పుడే ఓ ఫ్యాక్స్ వచ్చింది పై అధికారుల నుంచి.. నిన్ను సస్పెండ్ చేస్తూ!"

పకపకా నవ్వాడు ప్రశాంత్. "నా పాతిక సంవత్సరాల సర్వీసులో ఇది నాలుగోసారి నేను సస్పెండవ్వటం. నా విధి నిర్వహణలో నేను ఏం చేయాలో చెబుతున్నది నా పైవాళ్ళే కాదు.. రాబందులు, బకాసురులు, వాళ్ళకు దన్నుగా నిలుస్తున్న అధికారులు.. వాళ్ళమాట వినకపోతే నన్ను నడిరోడ్డుమీద పడేసి చంపినా చంపుతారు.. ఓకే.. చూద్దాం.. కానీయండి ఎంతవరకూ వెళుతుందో.. బయటవాళ్ళను వదిలేయండి, కనీసం నా పై అధికారులైన మీరైనా నన్ను అర్థం చేసుకుంటే నాకు తృప్తిగా వుంటుంది! థాంక్యూ సార్.. నేను చార్జి ఎవరికివ్వాలి? "

"సబ్ ఇన్‌స్పెక్టర్ విజయ్‌కివ్వండి!"

★ ★ ★

సాయంత్రం ఆరు గంటలకు వెంకటేశ్వర విజ్ఞాన భవనం నిండిపోయింది.

స్టేజిమీద విశ్రాంత జీవితాన్ని గడుపుతున్న మానసిక వైద్య నిపుణులు డాక్టర్ చిదానందం కూర్చుని వున్నారు. జిల్లా సెషన్స్ జడ్జి శాంతకుమారి, జిల్లా పోలీసు సూపరింటెండెంట్ కూడా వున్నారు.

సుస్మిత మరణం నగరంలో సంచలనాన్నే కలిగించింది. ఇంజినీరింగ్ చదువుతున్న ఆడపిల్ల మాదకద్రవ్యాలకు అలవాటుపడిందనే విషయం ప్రతివాళ్ళను విభ్రాంతికి గురిచేసింది. పేరుమోసిన పత్రికలన్నీ జిల్లా ఎలా మాదకద్రవ్యాలకు కేంద్రమయిందీ, యువత ఎంతగా వాటికి బానిసలయింది తెలుపుతూ పరిశోధనాత్మక వార్తలను ప్రతిరోజూ ప్రచురిస్తుండటంతో ఎక్కడ నలుగురు జేరినా అదే విషయంపై చర్చ దాంతో ఒక స్వచ్ఛంద సంస్థ ముందుకు వచ్చి ఆ సభను ఏర్పాటు చేసి, పెద్దలందరినీ ఆహ్వానించింది.

చిదానందంగారు వృద్ధులు. ఆయన మానసిక వ్యాధి నిపుణులుగా పనిచేసి ఇరవై ఏళ్ల నుండి విశ్రాంత జీవితాన్ని గడుపుతూ ఇప్పటికీ తన దగ్గరకు వచ్చిన వారికి తగు సలహాలు ఇస్తుంటారు.

"నేడు ప్రపంచవ్యాప్తంగా ప్రజలను వివిధరకాల వ్యాధులు పట్టి పీడిస్తున్నాయి. ఈ రోగాలకు తోడు, మాదకద్రవ్యాల వ్యసనం మనం కొని తెచ్చుకుంటున్నది. మన నెత్తిన మన చేతులతో, మనమే రుద్దుకుంటుంటే అది భస్మాసుర హస్తమే అవుతున్నది. ముఖ్యంగా నేటి యువతను ఎక్కువగా ఆకర్షిస్తున్నది అదే. దేశంలోని యువతను నిర్వీర్యం చేయడానికి శత్రుదేశాల వారు వాడే ఆయుధం ఇదన్నా తప్పు లేదు. అందుకు దేశ ద్రోహుల తోడ్పాటు వుండనే వున్నది.

నల్లమందు మస్తిష్కాన్ని మొద్దుబరుస్తుందని చిన్నప్పటి నుంచి మనం వింటూనే వున్నాం. అంతకుమించిన హానికరమైనవే ఈ రోజున విస్తృతంగా దొంగరవాణాతో మన మధ్య విషాన్ని చిమ్ముతున్నాయి - పెథిడిన్, హెరాయిన్, కొకైన్, మార్ఫిన్, ఎల్ ఎస్‌డి, మరిజుయానా మొదలైనవి. వీటి ప్రభావం వలన మనిషి మానసికంగానే కాదు, శారీరకంగానూ బలహీనుడవుతాడు. పిచ్చివాడిలా ప్రవర్తిస్తాడు. అసభ్యతకు, నేరచరితకు దాసుడై, ఏం చేస్తున్నాడో అతడికే తెలియనంత హీనస్థితికి దిగజారిపోతాడు, శరీరంలోని నరాలమీద అదుపు కోల్పోయి.

ఎందుకు ముఖ్యంగా యువత దానివైపునకు ఆకర్షింపబడుతున్నదంటే అందులో కలిసివున్న పదార్థాలు, వాటిని తీసుకున్న వారికి ఉత్తేజాన్ని కలిగించి ఒకవిధమైన మత్తును కలిగిస్తూ, ఇంకాఇంకా శక్తిమంతమైనవి కావాలని శరీరం ఆరాటపడేలా చేస్తుంటాయి. ఇంజక్షన్లూ వున్నాయి. ఆ వ్యాపారం ప్రపంచవ్యాప్తంగా విస్తరించుకుపోయింది. పాట్, హెర్బ్, లీడ్, గ్రాస్, బటన్స్, రాక్, స్మాక్, జింక్ ఇలా రకరకాల పేర్లతో చలామణి అవుతుంటాయి. అవి విక్రయించేవారు కొత్తవాళ్ళకు ఇవ్వరు. గుప్తనామం చెబితేనేకాని బయటకు తీయరు.

మాదకద్రవ్యం తీసుకున్న తరువాత - మోతాదును బట్టి - ఆరు నుంచి ఎనిమిది గంటల నడుమ శరీరంపై దాని ప్రభావం ఉంటుంది. దాని శక్తి తగ్గుముఖం పడుతుంటే నరాల్లో సన్నని వణుకు ప్రారంభమవుతుంది. చల్లదనం, ఇబ్బందికరంగా ఉండటం, పదేపదే ఆవలింతలు రావడం, వడివడిగా అతి కష్టంమీద ఊపిరి పీల్చుకోవడం, కండరాలు బిగుసుకుపోతూ పిచ్చిచూపులు చూడడం మొదలుపెడతారు. ఆ పరిస్థితులలో మళ్లీ మళ్లీ దాన్నే తీసుకొని హాయిగా ఉండాలని, అన్నీ మరిచిపోవాలని తాపత్రయ పడుతుంటారు. దాని

బారి నుండి ఆ మనిషిని తప్పించాలంటే - అవి అతడికి అందుబాటులో లేకుండా చేయాలి. తీసుకునే మోతాదు తగ్గేలా చూడాలి. వాటికోసం అతడు మరీ ఆరాట పడుతుంటే తక్కువ శక్తిగల నిద్రమాత్ర లిచ్చి అతడి ఆదుర్దాని శాంతపరచాలి.

మానసిక స్వస్థతకు సైకోథెరపీ ఎంతో ముఖ్యం. అది సత్ఫలితాలు ఇస్తుంది. ఒంటరిగా గాని, సామూహికంగాకాని, కౌన్సిలింగ్ వలనగాని అతడి ఆలోచనా ధోరణి మార్పు చెందే అవకాశాలు ఎక్కువ.

ఆఖరిగా ఒక్క విషయం. దీనికి అలవాటు పడ్డంత తేలికగా, ఆ అలవాటు నుంచి తప్పించలేం. ఓ నిపుణుని పర్యవే క్షణలో ఆరు వారాల నుంచి ఆరు నెలల వరకు ఆయా వ్యక్తుల స్థితిని బట్టి ఈ అల వాటు నుంచి దారి మళ్లించి మామూలు మనిషిగా చేయవచ్చు. మన ప్రయత్నం బట్టే ఫలితముంటుంది! మరొక్క మాట - ఇక్కడున్న పెద్దలంతా నన్ను క్షమిస్తా నంటే చెబుతాను!"

"చెప్పండి... చెప్పండి!" అంటూ సభ లోని అందరూ అడిగారు.

"నేను ఎవరినీ నొప్పించాలనే ఉద్దే శ్యంతో ఈ మాటలు చెప్పటం లేదు. జరు గుతున్న విషయాన్ని మీ ముందుంచుతు న్నాను. వీటికి అలవాటు పడుతున్న యువతలో ఎక్కువభాగం డబ్బున్నవాళ్ల, పెద్దపెద్ద ఉద్యోగస్తుల పిల్లలు, రాజకీయ నాయకుల పిల్లలు. అందుకే ఎక్కడయినా వీటిని తీసుకుంటున్నవాళ్లు దొరికినా కేసులు నిలవటం లేదు. నమస్కారం!"

ఆయన తన ప్రసంగాన్ని పూర్తిచేసి కూర్చున్న రెండు నిముషాల వరకూ ఆ హాలంతా సూది కిందపడ్డా వినబడేటంత నిశ్శబ్దమేర్పడింది.

తరువాత శాంతకుమారి వేదనాపూరిత కంఠంతో దుర్వ్యసనాలకు అలవాటుపడు తున్న పిల్లల గురించి చెప్పింది. "ఇలాంటి వాటిలో చట్టం చేసే మేలుకంటే వాళ్ల తల్లి దండ్రులు అదుపు చేయటంలోనే సత్ఫలి తాలు పొందవచ్చు" అందామె.

తరువాత సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు మాట్లాడారు. "ఈ రోజు ఉదయం మన నగరంలో మాదకద్రవ్యాలను సర ఫరా చేస్తున్న ఓ నైజీరియన్ను పట్టుకో వటం జరిగింది.. అతడి ఆధారంతో డొంకను కదిలించగలమనే అనుకుం టున్నాం. ఇప్పుడే న్యాయమూర్తిగారు చెప్పి నట్లుగా చట్టాలు, పోలీసులు కాదు వాటిని సంపూర్ణంగా నిరోధించగలిగేది. మీరు మాత్రమే. మా ప్రయత్నాలలో ఎప్పుడూ లోపముండదు. మీ సహకారముంటే సఫ లీకృతలమవ్వటం మాకు తేలిక!"

శాంతకుమారి ఇంటికి వచ్చేటప్పటికి ఎని మిదిన్నరయింది. కారు దిగి మేడెక్కి తన గదిలోకి వెళ్లి డ్రస్ మార్చుకుందాం అను కుంటుండగానే ల్యాండ్ ఫోన్ మోగింది.

మంచం పక్కనున్న రిసీవరెత్తి "శాంతకు మారి దిస్‌సైడ్!" అంది.

"నమస్కారం ఆంటీ! నేను ఆనంద్‌ని!"

"ఏమయ్యా! ఎలా ఉన్నావ్.. మళ్లా చదువులో పడ్డావా? "

అటు పక్కన ఒక్కక్షణం నిశ్శబ్దమేర్ప డింది. "నన్ను అపార్థం చేసుకోనూ అంటే ఒక్కమాట చెప్పాలని ఉంది ఆంటీ!" చాలా లోగొంతుకతో అన్నాడు ఆనంద్.

"చెప్పవయ్యా! అపార్థం చేసుకోవాల్సిన అవసరం ఏమున్నది... ఏమైనా సాయం కావాల్సి వచ్చిందా? "

"అదిగాదు ఆంటీ!" అతడు ఎలా చెప్పాలా అన్నట్లుగా ఆలోచిస్తుండిపో యాడు కొద్దిసేపు.

"శ్యామల సరిగ్గా కాలేజీకి రావటం లేదు.. విచారకర విషయం ఏమిటంటే

డ్రగ్స్‌కు అలవాటు పడుతున్నదేమోనని అనుమానంగా ఉన్నది. మీరూ తెలుసుకో వటానికి ప్రయత్నించండి. నేనా విషయం ఎత్తితే మాట మారుస్తూ నన్ను తప్పిం చుకు తిరగటానికి ప్రయత్నిస్తున్నది! నా అనుమానం నిజం కాకుండా ఉండాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను, ఆంటీ!"

★ ★ ★

లోపలకు వస్తున్న శ్యామలను చూస్తూ శిలలా నిలబడిపోయింది శాంతకుమారి. ఇప్పుడు ఆమెకు స్పష్టంగా కనబడుతున్నది - కూతురు అతిగా చదవటం వలన అలా అవ్వటం కాదు - ఆ వెధవ మాదకద్రవ్యా లకు అలవాటు పడటం వలననే పిచ్చిదా నిలా తయారయింది. కళ్లల్లో, ముఖంలో మార్పు తెలుస్తూనే ఉన్నది.

శ్యామల తననే రెప్పలార్పకుండా చూస్తున్న తల్లి దగ్గరకు వచ్చి, "ఏమైం దమ్మా.. అలా ఉన్నావ్?" అన్నది.

ఆ అమ్మాయి గొంతు బలహీనంగా ఉన్నది. తను రోజూ చూస్తుండే పిల్ల ఇలా మారిపోతుంటే బయటమనిషి చెప్పేంత వరకూ తను గమనించలేకపోయిందా?

ఆమెకు దుఃఖం ముంచుకు వస్తోంది. ఎవరికి చెప్పుకుంటే తనకీ వేదన తీరు తుంది. తనవాడంటూ తమ్ముడు ఒక్కడే ఉన్నా అమెరికాలో ఉన్నాడు. అంత దూ రాన ఉన్నవాడికి చెప్పుకొని ఏం లాభం?

"ఏం లేదులే.. గుడ్డలు మార్చుకొని రా, భోంచేద్దాం!" కూతురు పక్కన లేకుండా తను ఎన్నడూ భోజనం చేయలేదు.

"నాకు ఆకలి కావటం లేదమ్మా.. నువ్వు తినేయ్!"

"ఏమైంది? ఎక్కడేం గడ్డి తిన్నావ్?" కోపాన్ని నిగ్రహించుకోలేకపోయింది.

తల్లివంక విచిత్రంగా చూసింది శ్యామల. ఏమైనా కోర్టు చికాకులేమోలే అన్నట్లుగా ఒక్కసారి భుజాలు ఎగరేసి తన గదిలోకి వెళ్లిపోయింది. శాంతకు

## జనవరి - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **ఎ. అరుంధతి** - పూనే, మహారాష్ట్ర
2. **యు. చిట్టిబాబు** - కొత్త పాల్వంచ, ఖమ్మం జిల్లా
3. **చి. పు. శాస్త్రి** - ఎల్లమ్మగుట్ట, నిజామాబాద్
4. **ఎం. ఫణికుమార్** - బోరబండ, హైదరాబాద్
5. **అంద్ర అచ్యుతరామయ్య** - తణుకు, ప.గో.జిల్లా

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. మేరీ | 6. జ్యోత్స్న |
| 2. సీతారాం | 7. మందాకిని |
| 3. ప్రణీత్ | 8. గోవిందరావు |
| 4. బాబీ | 9. 2008 |
| 5. సీతారత్నం | 10. రవీంద్ర త్రివిక్రమ్ |

మారి విసురుగా తన గదిలోకి వెళ్లి తలుపు మూస్తునే బోల్టు పెట్టేసి మంచం మీద బోర్లా పడి ఏడ్వసాగింది - 'నిన్ను ఎంత అపురూపంగా పెంచుకుంటు న్నానే... ఎందుకే ఇలా చేసి నాకు మాన సిక క్షోభ కలిగిస్తావ్? నీకేమైనా అయితే నేను భరించగలనుటే!'

ఆమెకు వివేకం, వయస్సు వెన్ను తట్టి నయి. ఏడుస్తూ కూర్చుంటే సమస్య తీరేనా? ఏదో ఒకటి చేసి దాన్ని ఆ విష వలయం నుండి బయటకు లాగాలి. తను

సాయంత్రం దానికి సంబంధించిన సభకే అధ్యక్షత వహించటం, ఇప్పుడు అది తన ఇంటే వేళ్ళానుకోవటం చాలా విచిత్రంగా తోచింది ఆమెకు. చటుక్కున పక్కనే ఉన్న ఫోన్ అందుకొని తనతోపాటు వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో వేదిక మీద మాట్లాడిన డాక్టర్ చిదానందంగారి నంబరుకు డయల్ చేసింది. ఇది రహస్యంగా దాచవలసిన విషయం కాదు!

అవతల ఆయన కంఠం వినబడగానే, "నమస్కారమండి.. నేను జిల్లాజడ్జి శాంత కుమారిని మాట్లాడుతున్నానండి! నాకో సమస్య పెనుభూతంలా మీద పడింది!" ఆ మాట చెబుతున్నప్పుడు ఆమె కంఠం బాధతో తడిసి ముద్దయింది.

"ఏమైంది? ఎందుకంత కంగారు పడుతున్నారు?" ఆయనా ఆదుర్దాగా అడిగారు. "చెప్పండి... ఏం జరిగింది?"

"నాకు ఇప్పుడే తెలిసిందండి.. మా అమ్మాయి మాదకద్రవ్యాలకు అలవాటు పడిందని!" గొంతు పెగల్చుకొని అతి కష్టం మీద చెప్పింది.

"అయ్యో.. అలాగా!" తరువాత అటు నుండి మాటే వినబడలేదు, ఆయన ఆలోచిస్తున్నట్లుగా ఉండిపోవటంతో.

"నేను ఉదయాన్నే మీ దగ్గరకు వస్తాను. అసలు ఇప్పుడే రావాలని ఉన్నది గాని ఇంత పొద్దుబోయిన తరువాత వచ్చి పెద్దవారు మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక రావటం లేదు!" వలవలా ఏడ్వ సాగింది ఫోన్‌లోనే.

"కంట్రోల్ యువర్‌సెల్ఫ్. ప్లీజ్ కంట్రోల్. పెద్దవారు, చదువుకున్నవారు.. మీరే భయపడితే ఎలా? అమ్మాయికి తెలుసా మీకా విషయం తెలుసని.."

"తెలియనట్లే అనిపిస్తోంది!"

"మీరు అమ్మాయిని ఏమీ అడగవద్దు.. అనవద్దు.. రేపు నేను హైదరాబాద్ వెళుతున్నాను. రెండు రోజులు మనం కలిసే అవకాశం లేదు.. నేను హైదరాబాద్ నుండి రాగానే మీకు ఫోన్ చేస్తాను.. అప్పుడు ఇద్దరికీ ఏ సమయం అనుకూలంగా ఉంటుందో నిర్ణయించుకుందాం!"

"నాకు ఇక ఏ సమయమైనా అనుకూలమే.. అది బాగుపడేంతవరకూ నేను కోర్టుకు వెళ్లదలుచుకోలేదు!"

"తొందరపడి నిర్ణయాలు తీసుకోవద్దు.. నేను అమ్మాయితో మాట్లాడాక చెబుతాను, మీరు ఉద్యోగానికి వెళ్లవచ్చో లేదో!"

శాంతకుమారి మర్నాడు "నాకు ఒంట్లో బాగోలేదు.. నువ్వూ కాలేజీకి వెళ్లవద్దు.. ఇంట్లోనే ఉండు!" అన్నది కూతురితో.

"మరీ విచిత్రం.. మీకు ఒంట్లో బాగుండకపోతే నేనేం చేస్తాను.. ఇంట్లో వంటామె రుక్మిణమ్మగారు ఉండనే ఉన్నది. అనవసరంగా నేను పాఠాలు పోగొట్టుకోవటం తప్ప.. ఆ లెక్చరర్లు నేను జిల్లా జడ్జిగారి కూతుర్ని గదా అని మళ్లా చెప్పరు!" అన్నది కాస్తంత ఎగతాళిని మాటల్లో రంగరించి.

"రేపు సాయంత్రం కాలేజీ అయిపోగానే స్నేహితురాలితో కలిసి ఓ చాప్టర్ పూర్తిగా చదవాలని ప్రోగ్రాం వేసుకున్నాం!"

"నా అనారోగ్యం కంటే నీ కాలేజీ, నీ స్నేహితురాళ్లు, చదువే ఎక్కువా.. నోర్మూసుకొని ఇంట్లో కూర్చొని చదువుకో.. నువ్వు మాత్రం వెళ్లటానికి వీల్లేదు!" అన్నది గయ్‌న లేస్తూ.

తల్లి ఎప్పుడూ అలా మాట్లాడటం తను చూడలేదు. ఆమెకు ఏమైంది?

మరునాడు సాయంత్రం అయ్యేటప్పటికి శ్యామల ఇక ఆగలేకపోయింది. "అమ్మా! నేను మా స్నేహితురాలింటికి వెళుతున్నాను. దానికి ఎన్నిసార్లు రింగ్ చేసినా లిఫ్ట్ చేయటం లేదు.. నీ ఆంక్షలతో నా చదువు నాశనమవుతున్నది.. అక్కడ నా

పుస్తకాలు గూడా కొన్ని ఉన్నాయి, తెచ్చుకోవాలి.. పరీక్షలు రోజుల్లోకి వచ్చినయి!"

"నేను వద్దన్నా వెళ్లటమేనా? " గొంతు పెద్దది చేసుకొని అరవటం మొదలు పెట్టింది శాంతకుమారి.

"తప్పదమ్మా! వెళ్లాలి!"

కూతురు అంత మొండిగా మాట్లాడుతుంటే ఏం చేయాలో అర్థంకాని అయోమయంలో పడింది. అది ఎంతగా చెప్పినా వినేలా లేదు. అంటే అది ఇప్పుడు చదువుకోవటానికి కాదు, డ్రగ్స్ తీసుకొని మత్తులో మునిగి తేలటానికన్నమాట వెళ్లేది.

"అయితే నా కారు తీసుకెళ్లి పుస్తకాలు తీసుకొని వెంటనే వచ్చేయ్!" అన్నది.

ఆమె ఉద్దేశ్యం అలాగయినా కూతురు రోజూ ఎక్కడకు వెళ్లేది తెలుసుకోవచ్చని!

"అక్కరలేదమ్మా! నేను ఆటోలో వెళతాను. ఒంట్లో బాగాలేదన్నావు కదా.. డాక్టరు దగ్గరకు వెళ్లిరా!" ఎత్తు మడమల చెప్పులు టకటకలాడించుకుంటూ మేడ మెట్లు దిగి వెళ్లిపోయింది శ్యామల!

★ ★ ★

మధ్యాహ్నం రెండు గంటలు. ఎండ మండిపోతోంది. జిన్నాటవర్ దగ్గర ఒక ఎర్రచొక్కా కుర్రవాడు ఏం పనిలేనివాడిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు. అయిదు నిముషాలకూ, పది నిముషాలకూ ఎవడో ఒకడు వచ్చి అతడితో చిన్నగా మాట్లాడి వెళుతున్నాడు. వచ్చినవాడి దగ్గర నుంచి డబ్బు, వాడి నుంచి చిన్న పొట్లాలు

చేతులు మారుతున్నాయి. అదీ క్షణం లోనే. మరుక్షణంలోనే ఒకళ్ళకొకళ్ళు తెలియని వాళ్ళలా దూరమయిపోతున్నారు.

సైకిల్ ఆపుకొని అతడి పక్కగా ఓ నల్లటి కుంటి కుర్రవాడు దిగాడు. అతడి గుడ్డలు మాసివున్నాయి. నుదుట సింధూరం పెట్టివున్నది. అతడు నాజ్ థియేటర్ వైపు నుంచి వచ్చి ఎర్రచొక్కా వాడి పక్కగా ఆగి "స్మాక్!" అన్నాడు చిన్నగా గొణుగుతున్నట్లుగా.

"ఫైవ్ హండ్రెడ్!"

ఆ కుర్రవాడు జేబులో నుంచి డబ్బులు తీసి, అతడి చేతిలో నుంచి పొట్లం తీసుకుంటూ ఐదొందల నోటూ ఇస్తూనే ఉన్నాడు. చుట్టూ నలుగురు మనుష్యులు జేరి ఇద్దరినీ గట్టిగా పట్టుకున్నారు. ఎర్రచొక్కావాడు వాళ్ళను విదిలించికొట్టి పారిపోవాలని చూశాడుగాని చుట్టూ ఉన్న వాళ్ళు బలిష్టులవ్వటంతో సాధ్యం కాలేదు.

మరునిముషంలో పక్కగా జీపు ఆగటంతో అతడికి అర్థమయింది తను పోలీసుల చేతుల్లో పడిపోయానని. జీపులో నుంచి ఇన్‌స్పెక్టర్ విజయ్ దిగాడు.

అతడు పట్టుబడటం వెనుక సస్పెండ్ అయిన ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ హస్తమున్నదని ఎవరికీ తెలియదు!

★ ★ ★

మూడోరోజు ఉదయం ఎనిమిది గంటలకు ప్రొఫెసర్ చిదానందంగారి నుండి ఫోన్ వచ్చింది. "సాయంత్రం ఏడుగంటలకు రండి.. మీ కోసం ఎదురు చూస్తుంటాను, ఇంకెవ్వరికీ అపాయింట్‌మెంట్ ఇవ్వకుండా!!"

"చాలా థాంక్సండీ! అలాగే. దాన్ని తీసుకువస్తాను? "

"ఈ రెండు మూడు రోజుల్లో డబ్బేమైనా ఇవ్వమని అడిగిందా? "

"పుస్తకాలు కొనుక్కోవాలి డబ్బు కావాలని రాత్రే అడిగిందండి.. నేనే రెండు రోజులాగి ఇస్తానులే అన్నాను!"

"చాలా మంచి పనిచేశారు. ఓకే! అమ్మాయిని గూడా తీసుకొని రండి. డాక్టరు దగ్గరికీ అంటే రానంటుంది.. నన్ను మీ భర్త స్నేహితుడిగా పరిచయం చేయండి. నేను అమెరికాలో ఉంటూ ఇండియాకు మా అబ్బాయి వద్దకు వచ్చినట్లుగా చెప్పండి. ముందుగా అమ్మాయి వీటికి అలవాటు పడ్డదా లేదా నిర్ధారించుకోవాలి. నిజమయితే ఎన్నాళ్ళ బట్టి, ఎంత డోసు తీసుకుంటున్నదీ, దాని ప్రభావం ఎంతగా శరీరం మీద పడిందీ తెలుసుకోవాలి. అప్పుడు నిర్ణయిద్దాం ఎలా డీఎడిక్ట్ చేయాలో!"

"అది వాటిని మానేసి మామూలు మనిషి అవుతుందంటారా? "

"మీరు కంగారు పడవద్దు. ఇరవై నాలుగు గంటలూ ఈ మత్తు పదార్థాలతో జోగుతూ పడివున్నవాళ్ళే బాగుపడి వృద్ధిలోకి వచ్చారు. తప్పకుండా మీ అమ్మాయి ఆ అలవాటు నుంచి బయటపడుతుంది!"

సాయంత్రం ఆరున్నర అవుతుండగానే ప్రొఫెసర్ చిదానందంగారింటికి బయల్దేరారు తల్లీ కూతుళ్ళిద్దరూ. శ్యామల రానని మొరాయించింది. "రెండు రోజులబట్టీ మా స్నేహితురాలి దగ్గరకు వెళ్ళటం లేదు. మా ప్రోగ్రాం అంతా పాడయిపోయింది. పరీక్షలా దగ్గరకు వస్తున్నాయి.. నువ్వెళ్ళమ్మా నన్ను సతాయించకుండా!"

"ఆయన నీ నాన్నగారి ఆప్తమిత్రులే. అమెరికా నుంచి వచ్చారు. నిన్ను చూడాలని ఆత్రుత పడుతున్నారు.. ఓ అరగంట కూర్చొని వచ్చేద్దాం.. రేపెళ్ళవుగానిలే మీ స్నేహితురాలింటికి. ఒక్కరోజులోనే నీ చదువేమీ నాశనమవ్వదుగాని, పద!"

ఏమనుకుందో ఏమో నసుక్కుంటూనే తల్లితో బయల్దేరింది.

సరిగ్గా ఏడు గంటలకు ప్రొఫెసర్ చిదానందం గారి ఇంటిముందు కారు దిగారు. హాల్లో కూర్చున్న ఆయన లేచి ఎదురొచ్చి, "రండి రండి శాంతకుమారిగారూ! ఇది శ్యామలేనా.. నేను పదేళ్ళ క్రితం వచ్చినప్పుడు ఆరో క్లాసో, ఏడో క్లాసో చదువుతున్నదని చెప్పాడు వాడు. అదే ఆఖరుసారమ్మా నేను వాడినీ చూడటం. మేం ఎంతో స్నేహంగా ఉండేవాళ్ళం. అమ్మాయిని చూస్తుంటే వాడినే చూస్తున్నట్లనిపిస్తోంది.. ఒసేయ్ రమా.. ఎవరొచ్చారో చూడు.. శంకరం భార్యాకూతురూ వచ్చారే!" అంటూ భార్యను పిలుస్తూ హడావుడి చేయసాగాడు ఆయన.

ఆయన భార్య లోపల నుండి వచ్చింది.. "రండి వదినగారూ! వంటఇంట్లో స్టౌ వెలుగుతోంది. అక్కడ కూర్చొని మాట్లాడుకుందాం!" అంటూ వెనక్కు తిరిగింది.

శాంతకుమారికి ఆమె పిలుపులోని అంతరార్థం బోధపడటంతో లోపలకు వెళ్ళిపోయింది, వెంటనే కూతుర్ని వదిలేసి.

అలా వెళుతున్నా ఆమె గుండె గుబగుబలాడుతూనే ఉన్నది, కూతురు ఆయన ముందు ఏం గొడవ చేస్తుందోనని!

అయిదు నిముషాలయింది. పది నిముషాలయింది. అరగంటయింది. గంటయింది. చిదానందంగారి భార్య శాంతకుమారిని లోపలనుండి బయటకు రానీయలేదు. శాంతకుమారి ఉద్విగ్నతతో కూతురిని గురించే ఆలోచిస్తూ అన్యమనస్కంగా ఆమె అడిగిన వాటికి సమాధానాలు చెబుతున్నది.

"రమా! అందరికీ కూల్‌డ్రింక్స్ తీసుకు నిరా" అనే పిలుపుతో శాంతకుమారి హాల్లోకి దూకినట్లుగా వెళ్లింది.

అప్పటికే శ్యామల అక్కడ లేదు. వెళ్లి కారులో కూర్చున్నది. చిదానందంగారు శాంతకుమారిని చూస్తూనే నవ్వుతూ, "డోంట్ వర్రీ.. దిగులు పడాల్సిందేమీ లేదు.. ఇంకా మొదటిమెట్టు మీదే ఉన్నది. చిన్నపిల్ల.. అందునా సున్నితురాలవ్వటంతో చిన్న మోతాదే శరీరంపై బాగా ప్రభావం చూపిస్తోంది. త్వరలోనే కోలుకుంటుంది. మీరు అదృష్టవంతులు.. చాలా త్వరగా కనుక్కున్నారు. నాకు తెలుసు వాళ్లు ఎలా ప్రవర్తిస్తారో. ముందు నాకేం తెలియదు అన్నది. డ్రగ్సంటే ఏమిటి అన్నట్లుగా ముఖం పెట్టింది. నేను నవ్వుతూ నీతోపాటు తీసుకునే నీ స్నేహితురాలే నాకు చెప్పింది. మీ అమ్మకూ చెప్పింది. అందుకే దిగులుపడి మీ అమ్మ ఉద్యోగానికి గూడా శెలవు పెట్టి ఇంట్లో కూర్చున్నది అని దబాయించేటప్పటికి

> **కొత్తగాలి...**
>
> **ఆడపిల్లని**
> **చిదిమేస్తే**
> **నీ బ్రతుకు**
> **ఛిద్రం**
>
> – భానుమూర్తి,
> హైదరాబాద్

ఏడ్వటం మొదలుపెట్టింది. మీరు మా నాన్నలాంటివారు.. మీరే నన్ను ఆదుకోవాలి. ఇది నిజం కాదని మా అమ్మకు చెప్పండి.. మళ్లీ ఇంకోసారి నేను వాటి జోలికి వెళ్లను.. ఒట్టు.. అంటూ తలమీద చేయి పెట్టుకొని నా కాళ్ల దగ్గర కూర్చున్నది!" అన్నారు ఆయన నవ్వుతూ.

ఆయన మాటలు శాంతకుమారికి ఎంతో ధైర్యాన్ని ఇవ్వగా మనస్సు స్థిమితపరచుకుంటూ కూర్చున్న సోఫాలో కాస్త వెనక్కు వాలింది. అంతేకాదు, శాంతకుమారి ఆరునెలలు శెలవు పెట్టి, కూతుర్నీ



కాలేజీ మాన్పించింది!

★ ★ ★

ఆదివారం ఉదయం తెల్లవారుతుండగానే అందరి ఇళ్లముందూ చక్రాయుధం కాగితాలు పడివున్నయ్.

చక్రాయుధం

నమస్కారం. మా మొదటి చక్రాయుధం మిమ్మల్ని బాగా ఉత్తేజపరిచిందనే అనుకుంటున్నాం. ముఖ్యకారణం దానికి ఊహించని రీతిలో వివిధ టీవీ ఛానల్స్, వార్తాపత్రికలు వేదికలవ్వటమే.

చిన్న పామునైనా పెద్దకర్రతో కొట్టాలనేది సామెత. ఈ మధ్య చిన్న చిన్న నేతలంతా మహాజోరుగా పెరిగిపోతున్నారు. వాళ్లది పెట్టుబడిలేని వ్యాపారం. ఎవరి సమస్యనైనా చిటికెలో పరిష్కరించగల సమర్థులు... దేన్నయినా వాళ్లే ముడివేయగలరు, వాళ్లే విప్పగలరు. అందులో చేతనయినంత దండుకోగలరు. ఎప్పుడో ఒకప్పుడు తెలియకుండానే మీరూ వాళ్ల చేతుల్లో పడిపోవచ్చు. తస్మాత్ జాగ్రత్త!

ఓ దురదృష్టకరమైన విషయమేమంటే మొట్ట మొదటిసారిగా మా ఆయుధానికి బలయింది ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌లోని ఇద్దరు అమాయకులైన గార్డ్స్. విధి నిర్వహణలో నిర్లక్ష్యంగా ఉన్నారనే నెపంతో సస్పెండ్ అయ్యారు. పోలీసులు పట్టుకొని అప్పజెప్పిన ఎర్రచందనం దుంగలను సొమ్ము చేసుకున్నవారు, అందుకు తోడ్పడినవారు హాయిగా కులుకుతూనే ఉన్నారు. వాళ్లేమో చాలా పెద్దవాళ్లు మరి.

మన నగరానికి హుక్కా కేంద్రాలు వచ్చినట్లుగా చక్రాయుధం తెలుసుకున్నది. అందులోకి కాలేజీ విద్యార్థులే కాకుండా కొందరు విద్యార్థినులు కూడా వస్తున్నారని వినికిడి. వాటిల్లో గంజాయి, సిగరెట్లు



కూడా దొరుకుతున్నాయనీ తెలుస్తోంది. డబ్బులోనే పరమాత్మ ఉన్నాడనేది స్పష్టం.

కొద్దిరోజుల క్రితం విజయవాడవైపు నుంచి వస్తున్న కారులో గోనె సంచుల్లో యాభై లక్షల నగదును తెస్తుండగా కాపు కాసి పట్టుకొని దాన్ని కోర్టుకు అప్పగించ టమే గాకుండా ఆదాయ పన్ను శాఖకు తెలియబరిచిన ఇన్‌స్పెక్టర్‌కు మంచి రివార్డే లభించింది. ఆయన్ను ఉద్యోగం నుంచి సస్పెండ్ చేశారు! అది నిజాయితీ పరుడికి లభించే కానుకగా ఆయన చిరున వ్వుతో స్వీకరించారు. హేట్సాఫ్ టు హిమ్!

సిటీ కమ్యూనిటీ సెంటర్‌లో చిన్న పిల్లల నడుమ పాటల పోటీ జరిగింది. ఎంత బాగా పాడారు? కొందరు పిల్లలు భరతనాట్యం చేసి కనువిందు చేశారు. కొందరు చిన్నపిల్లలు విదేశీ భామల వేషా లతో స్టేజీమీద క్యాట్‌వాక్‌తో సభ్య సమాజం సిగ్గుపడేలా ఒళ్లు విరుచుకుంటూ జుగుప్సాకరంగా తైతెక్కలాడి వాళ్ల తల్లిదం డ్రులకు ఆనందాన్ని కలిగించారు. మీరు హర్షిస్తారో లేదో తెలియదుకాని, అందులో ఆ పిల్లలు ఆరితేరేందుకు కొందరు శిక్షణ కూడా ఇప్పిస్తున్నారట.. శుభం!

వచ్చేసారి మరిన్ని విషయాలతో మీ ముందుకు వస్తాం. మా గురించిన వివ రాలు కావాలంటూ టీవీ ఛానల్స్ వారికి, పత్రికలకు ఫోన్లు వస్తున్నాయట. వారి వ ద్ద ఈ పత్రం తప్ప మరే వివరాలు లేవు. అనవసరంగా శ్రమపడకండి.. శెలవ్.

★ ★ ★

ఉదయం ఎనిమిదింటికి శాంతకుమారి తమ్ముడు అమెరికా నుంచి ఫోన్ చేశాడు.

ఇక్కడి పరిస్థితి చెబుదామా వద్దా అన్న ట్లుగా క్షణం సంశయించిందామె. ఆపైన అకస్మాత్తుగా ఒక ఆలోచన వచ్చి, "ఉద్యో

గమంటే విసుగుపుట్టి ఆరునెలలు శెలవు పెట్టానురా. నెల రోజుల విశ్రాంతి తీసుకొని, అమెరికా వద్దామని ఉంది!" అంది, ముందు కూతుర్ని ఈ వాతావరణం నుండి బయటకు తీసుకువెళ్లాలన్నట్లుగా.

"ఎంతటి శుభవార్త చెప్పావే అక్కా! నేను ఇరవయ్యేళ్ల క్రితం అమెరికా వచ్చినప్పటి నుంచి చెబుతూనే ఉన్నాను.. ఉద్యోగమో అంటూ బిగుసుకు కూర్చున్నావ్.. బావగారుండగా వ్యాపారమో అంటూ ఆయన.. సరే! ఇప్పటికయినా నీకు మంచి బుద్ధి కలిగించినందుకు తిరుపతి వెంకటేశ్వరునికి కృతజ్ఞతలు చెప్పుకుంటాను.. శెలవు కాలమంతా ఇక్కడే గడుపుదువుగాని, ఒక్కదానివే చేతులూపుకుంటూ రాబోకు.. శ్యామూను కూడా తీసుకురా!"

తమ్ముడి మాటలు తుషార వీచికలే అయినా 'దానికోసమే నేను ఇప్పుడు బయల్దేరుతున్నది' అని చెప్పలేకపోయింది.

★ ★ ★

ఉదయం పదిగంటలు. ఇంజినీరింగ్ కాలేజీలో క్లాసులు జరుగుతున్నాయి. చెట్ల కింద ఎవరూ పిల్లలు లేరు. వెంకట్‌నూ, రాజునూ పోలీస్‌స్టేషన్ సెల్‌లో పెట్టినప్పటి నుంచీ, అదీ కొద్దిగంటలే అయినా ఎవరూ అక్కడ జేరటం లేదు.

కాలేజీ అటెండర్ క్లాసుకు వచ్చి ఆనంద్ కోసం ఎవరో వచ్చి ప్రిన్సిపాల్‌గారి రూంలో కూర్చున్నట్లుగా చెప్పాడు. ఆనంద్ ప్రిన్సిపాల్ రూంకు వెళ్లాడు, తన కోసం వచ్చింది ఎవరా అన్నట్లుగా ఆలోచిస్తూ. అక్కడ తన తల్లి ఉన్నది!

ఆమెను చూస్తూనే ఆశ్చర్యపోయాడు ఆనంద్. ఆమె ఎంతగానో ఏడ్చింది అన్నట్లుగా ముఖమంతా ఉబ్బి ఉన్నది.

కొడుకును చూస్తూనే లేచి అతడి దగ్గరకు వస్తూ, "నిన్న సాయంత్రం ఆసుపత్రికి ఆటోలో వెళుతుంటే యాక్సిడెంట్ అయి అమ్మమ్మ, తాతయ్య పోయారురా!" అన్నది. ఆమె కళ్ళమ్మట నీళ్ళు ధారగా కారుతున్నాయి.

★ ★ ★

మధ్యాహ్నం మూడు గంటలయింది. డాక్టర్ చిదానందంగారు మూడు రోజుల తరువాత ఫోన్‌చేసి, "అవునూ, ఓ అబ్బాయి శ్యామల డ్రగ్స్‌కు అలవాటు పడుతున్న సంగతి మీకు చెప్పాడన్నారు కదా... అతడికి శ్యామలతో బాగా పరిచయమున్నదా? " అడిగారు.

"అవునండి... ఇద్దరూ ఒకే క్లాసు!"

"అయితే ఒక పని చేయండి.. శ్యామల కాలేజీకి వెళ్ళటంలేదు కాబట్టి అతడిని వచ్చి కాలేజీకి రాకపోవటానికి కారణం అడుగుతూ క్లాసుల్లో జరుగుతున్న పాఠాల గురించి చర్చిస్తూ కూర్చోమనండి. అలా చేయటం వలన అమ్మాయి ఆలోచనా ధోరణి మారి మనస్సుకు కొంత ఉపశమనం కలిగే అవకాశమున్నది!"

దాని ఫలితమే శ్యామల మాత్రల ప్రభావంతో నిద్రపోతున్నప్పుడు, ఆ సెల్ తీసుకొని ఆనంద్‌కు ఫోన్ చేసింది.

"ఆంటీ! ఎలా ఉన్నది శ్యామల? "

"నాకు చాలా భయంగా ఉన్నదయ్యా. ఇంత పెద్దఇంట్లో నేనూ, అదీ.. మూడో మనిషే లేరు. నువ్వు తీరిక సమయంలో వచ్చి మాట్లాడుతూంటే అది కాస్త త్వరగా తేరుకోగలదేమో!"

"తప్పకుండా ఆంటీ.. కానీ ఇంకా పది రోజుల దాకా నేను మీ ఇంటికి రాలేను.. మూడురోజుల క్రితం మా అమ్మమ్మ, తాతయ్య ఓ ప్రమాదంలో చనిపోయారు.. కర్మ నేనే చేస్తున్నాను. అది అయ్యేంతవరకూ నేను ఎవరింటికీ వెళ్లగూడదట. కాలేజీకి మాత్రం వెళ్ళివస్తున్నా!"

శాంతకుమారి అతడి మాటలకు హతాశురాలయింది.

★ ★ ★

సాయంత్రం అప్పుడప్పుడే ఎండ తగ్గుతున్న సమయంలో ప్రశాంత్ టూ వీలర్ మీద నగరానికి దూరంగా ఉన్న చక్రవర్తి నిర్వహిస్తున్న అనాథ పిల్లల ఆశ్రమానికి బయల్దేరాడు.

రోడ్డుకు అటూ ఇటూ పచ్చటి పొలాలు. మధ్యగా అక్కడక్కడా కొబ్బరిచెట్లు. రోడ్డు పక్కగా అక్కడో ఇల్లు. ఇక్కడో ఇల్లు. గడ్డి మోపులతో ఎదురొస్తున్న ట్రాక్టర్లు, ఎడ్ల బండ్లు.. నాలుగు కిలోమీటర్లు హైవే మీద వచ్చిన తరువాత దిగి కచ్చాబాటలో లోపలకు ఓ అరకిలోమీటరు వెళ్ళాలి. అనాథాశ్రమం అంటూ చక్రవర్తి లాంటివాడు ప్రారంభించటం వింతగా తోచగా దాని వివరాలు పూర్తిగా సేకరించాడు.

అతడు హెల్మెట్ పెట్టుకొని ఉండటంతో లోపలకు వస్తున్న స్కూటర్‌ను చూస్తూనే, వస్తున్నది ఎవరో అర్థంకాకపోయినా పర్ణశాల గేటు ముంగిట కూర్చొని ఉన్న బాలరాజు లేచి నిలుచున్నాడు. ప్రశాంత్ స్కూటర్‌కు స్టాండ్ వేసి, హెల్మెట్ తీసినప్పుడు గుర్తించాడు. వెంటనే ముందుకు వచ్చి "రండి సార్! అయ్యగారు ఇప్పుడే నిద్ర లేచినట్లున్నారు. చెప్పి వస్తాను! కూర్చోండి!" అంటూ కుర్చీ చూపించి వడివడిగా లోపలకు వెళ్లాడు.

తరువాత అయిదు నిమిషాల్లోనే చక్రవర్తి బయటకు వచ్చాడు.

"రా ప్రశాంత్! ఏమిటి దారి తప్పి వచ్చినట్లున్నావ్? "

"మీతో చిన్న పని పడింది సార్! మీరు ఇక్కడ తోటలో ఉంటున్నట్లుగా తెలిసి ఇటు వచ్చాను!" అన్నాడు.

"నాతో పనేమిటయ్యా బాబు! చాలా చిన్నవాడిని..!" అంటూనే అతడి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"పెద్దవాడిని అని చెప్పుకుండేవాడెవడూ పెద్దవాడు కాదు! చిన్నవాడిని అని చెప్పుకుండే వాడే చాలా పెద్దవాడు... నాకో అనుమానం సార్! సిటీలో చక్కటి బంగళా పెట్టుకొని ఇంత దూరాన ఈ పూరింట్లో ఉండటమేమిటి మీరు? "

"నా బాధ్యతలన్నీ పిల్లలకు అప్పజెప్పేశానయ్యా! ఇంకా నాకా యాంత్రిక జీవితమెందుకు.. పచ్చని చెట్ల కింద దైవధ్యానం చేసుకుంటూ గడపటమే ఈ వయస్సులో నాకు ఉత్తమం. ఇక్కడ నేనూ నా భార్య ప్రశాంత జీవితాన్ని గడుపుతున్నాం"

"నాకూ ఎందుకో విసుగు పుడుతోంది సార్! మీ ఆశ్రమ వాతావరణం చాలా బాగున్నది. నాకూ ఓ చిన్న కుటీరం ఇవ్వకూడదూ.. మీతోపాటే ఏ చీకూచింతా లేకుండా హాయిగా కాలం గడిపేస్తాను!" అన్నాడు నవ్వేస్తూ.

ఆయన వింతగా ప్రశాంత్ వంక చూచాడు. "నీ వయస్సెంత? హాయిగా ఉద్యోగం చేసుకోక ఎందుకొచ్చిన ఈ ముసలి బతుకు? ఇలా గడపవలసింది డెబ్బై ఏళ్ళు దాటి కోరికలు నశించిన తరువాత. అంతేగాని, వేడిరక్తం శరీరంలో పారుతున్నప్పుడు ఈ వాతావరణం అనుకూలం కాదు. ఓ సరదా ఉండదు.. కావాల్సిన వాళ్లెవరూ కనబడుతుండరు. ఇరవై నాలుగు గంటలూ కృష్ణా రామా అను

### కొత్తగాలి...

**క్రికెట్ క్రీడలో**
**ఆగర్భ శత్రువులు**
**బ్యాటు - బంతి**
**బౌలరు- బ్యాట్స్‌మెన్!**

– కృష్ణ మాదవరపు, కాకినాడ

కుంటూ కూర్చోవటమే!" ఆయన నవ్వాడు.

"హోదా ఉన్న ఉద్యోగాన్ని వదులుకొని చెట్లకు పాదులు తీసుకుంటూ కూర్చుంటా నంటే ముందు మీ ఆవిడా, పిల్లలూ ఒప్పు కుంటారో లేదో కనుక్కో!" అన్నాడు మళ్లీ.

"హోదాలన్నీ పోయినయ్ సార్! నేను సస్పెండ్ అయ్యాను! అందుకే మార్పు కావాలని కోరుకుంటున్నది!

"అరే.. అలాగా.. నాకు తెలియనే తెలి యదు ఆ విషయం!" అన్నాడు చక్రవర్తి ఆశ్చర్యపోతున్నట్లుగా. అయినా ఆయన కళ్ళల్లో మెరుస్తున్న వెలుగు పోలీసు డేగ కన్నుల్లో పడనే పడింది.

అసలు అతడికి అక్కడకు రావటంలోని ముఖ్యోద్దేశం తన సస్పెన్షన్‌కు ఈయనే

## కొత్తగాలి...

**ఉదయిస్తేనే**
**రవి**
**కదిలిస్తేనే**
**కవి**

– 'నిప్పు', అనకాపల్లి

కారణమయి వుండవచ్చనే అనుమానాన్ని నిర్ధారించుకునేందుకే. అదే నిజమయితే పట్టుకున్న ఎర్రచందనం దుంగలు, ఇసుక మాఫియా డబ్బు వెనక ఈయన హస్తం తప్పకుండా ఉండి ఉంటుంది! ఆపైన ఈ అనాథాశ్రమ భాగోతమూ ఆరా తీసేం దుకు అంకురార్పణ చేయవచ్చు!

"అదేం? ఎందుకు చేశారు అలా? " అన్నాడు ఆనందాన్ని నిగ్రహించుకుంటూ.

"నాకిది మామూలే సార్! సర్వీసులో ఇది నాలుగోసారి. పైవాళ్ళతో ఎన్నాళ్ళు పోరాడుతాం! అందుకే హాయిగా అన్నీ వదిలేసి ఏ చింతా లేకుండా శేషజీవితాన్ని ప్రశాంతంగా మీలాగే గడుపుదామని!" అన్నాడు ఆయన్నే తదేకంగా చూస్తూ.

"ఈ వయస్సులో నీకు ఆశ్రమవాసమేవి టయ్యా బాబు. చూద్దాంలే.. నాకు తెలియ కుండా నా ఏరియాలో మనిషిని సస్పెండ్ చేసే అధికారం ఎవరికున్నదో నాకూ తెలు సుకోవాలని ఉన్నది! నాకూ ప్రిస్టేజ్ ఇష్యూనే! అవునూ.. నీ పిల్లలు సెటిల్ అయ్యారా మరి!" అన్నాడు అతడినే కన్నా ర్పకుండా చూస్తూ.

"ఒక్కడే కొడుకు.. ఇంజినీరింగ్ మూడో సంవత్సరం ఇక్కడే చదువుతున్నాడు.. ఒక్క సంవత్సరం చదువున్నది! మీరీ వ యస్సులో శ్రమకు తోడు ఖర్చుతో కూడిన పనిని నెత్తిన పెట్టుకున్నారు సార్!"

"ఒక్కదానికి సమాధానం చెప్ప వయ్యా... మనం చివరకు పోతూ పోతూ తీసుకెళ్ళేదేమిటి? ఈ ఆస్తుల్నా? ఈ తోటల్నా? ఈ డబ్బునా? ఊహూ, ఇవేవీ మన వెంట రావు. మంచి ఒక్కటే మనల్ని అంటిపెట్టుకొని ఉండేది. మనం మంచి చేస్తే రాబోయే జన్మ మంచిది దొరక వచ్చు దానికే ఈ తాపత్రయమంతా!"

"నిజమేననుకోండి.. వచ్చే జన్మంటూ ఉన్నదో లేదో తెలియని మనం ఇప్పుడే కష్టాలు పడటం అవసరమా అని. మీకభ్యంతరం లేకపోతే ఆశ్రమాన్ని ఒక సారి చూడాలని ఉన్నది.. చెప్పాను గదా నాకూ మనస్సులో ఇలాంటి ఆశ్రమంలో ఏ చీకూచింతా లేకుండా ప్రశాంత జీవితం గడపాలనే ఉన్నదని!"

"దానిదేమున్నది పద.. ఒక రౌండ్ కొట్టి వద్దాం. అరేయ్ బాలరాజు! తోట లోని మామిడి పళ్ళు కోసి ఓ సంచిలో పెట్టి ఇవ్వరా సార్‌కి. తీసుకువెళతారు!" అన్నాడు లేచి చెప్పులేసుకుంటూ.

తోట మధ్యలో అక్కడక్కడా రెల్లుతో

వేసిన చిన్నచిన్న ఇళ్ళు, ఆ ఇళ్ళముందు చాలా శుభ్రంగా ఉండటమే గాకుండా అందంగా రంగవల్లులు.

"ఎంతమంది పిల్లలు ఉన్నారిక్కడ? "

"ఇప్పుడున్నది ఓ ఇరవై మందే. నేను మొత్తం ఓ వంద మందికి సరిపడే అన్ని వసతులూ ఏర్పరిచాను. మనం వాళ్ళను నిర్లక్ష్యం చేస్తాంగాని.. వాళ్ళల్లోనూ వజ్రా లలాంటి పిల్లలున్నారయ్యా!"

పిల్లలంతా పది పదిహేనేళ్ల మధ్యలో ఉన్నారు. శుభ్రమైన గుడ్డల్లో చక్కగా ఉన్నారు. ఓ పక్కగా వంటశాల ఉన్నది. కాస్త దూరంలో ఓ గోశాల ఉన్నది.

"నేనూ మా ఆవిడా తినేదీ వంటశాల భోజనమే!" చక్రవర్తి అన్నాడు చిర్నవ్వుతూ.

"మీరు చాలా అదృష్టవంతులు! ఏ బాధా లేకుండా ప్రశాంతంగా గడపగలుగు తున్నారంటే వందేళ్లూ ఈ అనాథలకు నిర్విఘ్నంగా సేవ చేయగలుగుతారు!" అన్నాడు ఆయన్ను మెచ్చుకుంటూ.

★ ★ ★

చక్రాయుధం

నమస్కారం. మేము ఓ విచిత్రమైన పరిస్థితిని ఎదుర్కొన్నాం. క్రితంసారి ఈ చక్రాయుధాన్ని వీధులన్నీ తిరిగి చెత్త కాగి తాలు ఏరుకునే వారి ద్వారా ఇంటింటికీ పంపిణీ చేయించటం జరిగింది. అందువ లన మన పని తేలిగ్గా అవ్వటమే గాకుండా వాళ్ళకూ ధనరూపేణా కొంత లబ్ధి చేకూర్చవచ్చనేది మా ఆలోచన. కానీ కొందరు ముసుగువీరులు అలా పంచవద్దని చెప్పి, మేం ఇచ్చే దానికంటే ఎక్కువ డబ్బులిచ్చి వాళ్ళను ఆ పని చేయ టానికి విముఖుల్ని చేశారు. దాంతో ఈ పత్రాన్ని మీ దరిజేర్చటానికి మరో దారి వెతుక్కోవాల్సి వచ్చింది.

అసలు ఇసుక మాఫియా అంటే ఏమిటో తెలుసుకోవటం అందరికీ మంచిదే. ప్రవహించే నీటి ద్వారా నదులలో ఇసుక పొరలు ఏర్పడుతాయి. ఆ ఇసుక ద్వారానే వానల వల్ల వచ్చే నీరు కొంతవరకూ భూమిలోకి ఇంకుతుంది. ఆ అవకాశాన్ని పాడు చేస్తూ ఇష్టారాజ్యంగా ఇసుకను తవ్వేస్తున్నారు, ప్రభుత్వంతో ఒడంబడిక కుదుర్చుకున్న గుత్తేదారులు. ఇసుక లేకుండా ఏ నిర్మాణపు పనీ జర గదు. ప్రజలకు దాని అవసరం ఎంతగానో ఉన్నది. అటు ఇసుక తవ్వటాన్ని లీజుకు ఇవ్వటంతో ప్రభుత్వానికీ భారీగా ఆదాయం లభిస్తుంది.

కానీ గుత్తేదారులు నియమ నిబంధల న్నింటినీ తుంగలో తొక్కి కాసులు దండు కోవడమే ధ్యేయంగా ప్రవర్తిస్తున్నారు. ఆ మాఫియాలో పెద్ద పెద్దవాళ్ళే భాగస్వా ములు కావటంతో అధికారులు ఏమీ చేయలేని స్థితి. దాంతో ప్రభుత్వ ఖజా నాకు గండికొడుతూ వాళ్ళు కోట్లల్లో అక్రమ సంపాదనకు పాల్పడుతూనే, అధి కారుల నోరు మూయించటానికి లక్షలు వెదజల్లుతున్నారు.

జీవనదుల్లో ఒకటి రెండు మీటర్లకు మించి ఇసుక తీయగూడదనే ఆంక్ష ఉన్నా దాన్ని పట్టించుకునే నాథులెవరూ లేరు. స్వార్థంతో ప్రకృతి ప్రసాదించిన సంపదను కొల్లగొడుతున్నారు. ఇసుక తరలించే లారీల కోసం నీటి ప్రవాహానికి అడ్డువ చ్చేలా రోడ్లు వేస్తున్నారు. తవ్వకాల్లో యంత్ర పరికరాలు వాడకూడదనేది నిబం ధనే అయినా యథేచ్ఛగా ప్రొక్లెయినర్ సాయంతో వందల సంఖ్యలో లారీలలో రాత్రింబగళ్ళు ఇసుకను రవాణా చేస్తు న్నారు. తెర వెనుక చక్రం తిప్పుతూ కోట్లకు కోట్లు అక్రమంగా ఆర్జిస్తున్న వ్యక్తుల వివరాలను చక్రాయుధం సభ్యులు వెలికితీసే ప్రయత్నంలో ఉన్నారు. తెలియ గానే మీ ముందుంచుతాం.

సుస్మిత హత్యకేసు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా ఉంది. నగరంలో ఆడపిల్లలకు రక్షణ లేకుండా పోతున్నది. గుర్నాథం లాంటి కీచకులు ధన బలం, అధికార బలంతో ఏమైనా చేయిస్తున్నారు. ఇలాంటి సంఘ విద్రోహ శక్తులను తాత్సారం చేస్తూ మౌనంగా కూర్చో గూడదు.

హుక్కా కేంద్రాలు ఎక్కడున్నాయో అందరికీ తెలిసినా పోలీసులకు తెలియక పోవటం చాలా వింతగానే ఉన్నది. వాటి మీద ఈ వారంలోనైనా వారు చర్య తీసుకొని మూయించకపోతే చక్రాయుధమే రంగంలోకి దిగి వాటిని గురించిన వివరాలను సంపూర్ణంగా మీ ముందుకు తీసుకు వస్తుంది. అప్పుడు నగర ప్రజలే ఏం చేయాలో నిర్ణయించుకుంటారు. యువత పాడయిపోతుంటే చూస్తూ చేతులు ముడుచుకు కూర్చోటానికి మించిన ద్రోహం మరొకటి ఉండదు.

పదిహేను రోజుల క్రితం నగర శివార్లలో కొత్తగా కడుతున్న అయిదంతస్తుల అపార్టుమెంటు కూలిన విషయం అందరికీ తెలిసిందే. డబ్బు కట్టి అందులో ఫ్లాట్లు తీసుకున్న వారికి వేరేచోట అలాంటి అపార్ట్‌మెంట్లు కట్టించి ఇస్తానని తన మీద ఎవరూ కేసు పెట్టకుండా ఆ రోజు వాగ్దానం చేసిన గుత్తేదారు, జనంలో వేడి తగ్గటంతో, తననింకెవ్వరూ ఏమీ చేయలేరనే ధైర్యంతో అలా కొత్తగా కట్టే అపార్టుమెంటుకు అయ్యే ఖర్చును సగం ఫ్లాట్ స్వంతదారులు భరిస్తే, మిగతా సగం తను భరిస్తానని, లేకపోతే తన వల్ల కాదని చేతులెత్తేశాడు. బాధితులంతా మధ్యతరగతివారు. ఇప్పటివరకూ కట్టిన డబ్బు కోసం అప్పులు చేసిన వాళ్ళు ఇక తమవల్ల కాదంటూ గోల పెడుతున్నారు. బాధితులు న్యాయస్థానానికి వెళతామని బెదిరిస్తే- 'వెళ్ళండి.. అక్కడ కింది కోర్టులోను, ఆ పైకోర్టులోనూ, ఇంకా పైపై కోర్టులలోనూ తేలేటప్పటికీ ఎన్నేళ్ళు పడుతుందో... అప్పుడు చూద్దాం'- అంటూ నిర్లక్ష్యంగా మాట్లాడుతున్నాడు. బాధితులు ఏం చేయాలో తెలియని అయోమయంలో ఉన్నారు. కొత్త వెంచర్‌లో ఫ్లాట్ అక్కర లేనివారికి, పాతదానికి కట్టిన డబ్బులో సగం ఇస్తానని ఎంతో ఉదారంగా చెబుతున్నాడు. అతడు చేసిన తప్పుకు మరొకరు శిక్ష అనుభవించాలి! ఆ గుత్తేదారుడు నగర ప్రముఖుడు, కోట్లకు పడగలెత్తిన చక్రవర్తి తనయుడు మరి! - శెలవ్.

★ ★ ★

రాత్రి పది గంటలయింది. నగరానికి దూరంగా ఉన్న ఆశ్రమ ఆవరణమంతా నిశ్శబ్దంగా ఉన్నది. అనాథ పిల్లలు భోజనాలు చేసి పడుకొని నిద్ర పోతున్నారు. చక్రవర్తి కుటీరం ముందు దీపం దేదీప్యమానంగా వెలుగుతున్నది. దానిక్రింద ఇన్నోవా కారు ఆగి ఉన్నది. అంతకు గంట క్రితం జయంత్, రాగిణి వచ్చారు. వాళ్ళమ్మ ప్రత్యేకంగా చెప్పటంతో భోజనానికి ఉండేలా వచ్చారు. అప్పటికి పావుగంట క్రితమే భోజనాలు అయినయి.

వాళ్ళు కూర్చొని మాట్లాడుకునేందుకు వెనుకగా మరోగది ఉన్నది. దానికీ ఏసీ ఉన్నది. అందులో ఎలాంటి రహస్యాలైనా మరో చెవిన పడకుండా మాట్లాడుకోవచ్చు.

"సాయంత్రం ప్రశాంత్ వచ్చాడు.. ఎందుకొచ్చాడో అర్థం కావటంలేదు. ఏ కారణం లేకుండా ఆశ్రమాన్ని చూడటానికి వచ్చాడని అనుకోను. చాలా కిలాడీ మనిషి!" అన్నాడు చక్రవర్తి.

"ఎందుకొచ్చిందీ చెప్పలేదా?" కొడుకు అడిగాడు.

"సస్పెండ్ అయినానని చెప్పి, మనకు అభ్యంతరం లేకపోతే ఈ తోటలోనే చిన్న

కుటీరం ఇస్తే ఉండిపోతానంటాడుగానీ.. అవన్నీ గాలి మాటలు.. నా చెవిలో పూలు పెట్టాలని చూసాడన్నమాట!"

"దొంగ వెధవని అసలు లోపలకు రానీయకుండా ఉండాల్సింది"

"దానివలన మనమే బయటపడతాం. వాడు సస్పెండ్ అయిన విషయమే నాకు తెలియదు అన్నట్లుగా ఆ మాట చెప్పినప్పుడు బాధపడ్డాను. దానికి కారణం మనమే అని తెలిస్తే, సస్పెన్షన్‌లో ఖాళీగా ఉంటాడు కాబట్టి ఇంకా ఇంకా మన వ్యాపార వివరాలు కూపీలాగి గోల చేస్తాడు! అందుకే సౌమ్యంగా మాట్లాడి సస్పెన్షన్ ఎత్తేసేలా ప్రయత్నిద్దాంలే అన్నటు చెప్పి పంపించాను. తోట చూస్తానంటూ అంతా తిరిగాడు!"

"పిల్లలతోగాని మాట్లాడలేదు కదా!" ఆత్రంగా అడిగాడు జయంత్.

"వాడిని వదలకూడదు, లేపేయాల్సిందే. వెధవ యాభై లక్షలను అనవసరంగా కోర్టులో ఇరకపెట్టాడు. ఎర్రచందనం దుంగల్ని పట్టించాడు. వాటిని మళ్ళా బయటకు తెచ్చేందుకు అనుకున్నదానికంటే ఎక్కువే ఖర్చు పెట్టాల్సి వచ్చింది!"

"మన విషయాల్లో వేలుపెట్టిన ఎవడినీ వదలొద్దు. శాంతకుమారి విషయంలో రాగిణి దాని కూతుర్ని భ్రష్టుపట్టించి వాళ్ళ సంతోషానికి పాతర వేసింది. అలాగే నాకు మరో ఆలోచన కూడా వచ్చింది, ఇన్‌స్పెక్టర్‌గాడి విషయంలో. వాడి కొడుకు మీ కాలేజీలోనే చదువుతున్నాడటకదా.. వాడి సంగతి నువ్వే చూసుకోరాదుటే!" అని తండ్రి అంటే ఆ అమ్మాయి నవ్వి ఊరుకున్నది. ఆ పదునైన బుర్రలో అప్పటికే దానికి కావల్సిన పథకాలు రూపుదిద్దుకుంటున్నాయి.

"శాంతకుమారి మనల్ని ఎంత ఇబ్బందుల్లో పెట్టిందో తెలుసా! పదేళ్ల క్రితం నగర శివార్లలో పదెకరాల పొలాన్ని కారుచౌకగా కొని వీరభద్రుడి పేరున రిజిస్టర్ చేయించాను, తరువాత మన పేరు మీదకు మార్పించుకోవచ్చులే అన్నట్లుగా. ఇప్పుడు దాని విలువ కోట్లకు చేరింది. వాడికా ఉరిశిక్ష పడింది. దాన్ని అమలు చేసేలోగా వాటిని మన పేరు మీదకు మార్పిడి చేయించుకోవాలి. అందుకే వాడికి తక్కువ శిక్ష పడేలా చూడాలని చాలా ప్రయత్నించాను. కానీ కలిసిరాలేదు. వాడికిగాని ఉరిశిక్ష అమలయిందంటే ఆ స్థలం కాస్తా మనకు కాకుండా పోతుంది. తేలికగా వదిలేస్తారులేరా! అంటూ మన ప్రత్యర్థిని వాడి చేత చంపించాం. కానీ కథ అడ్డం తిరిగింది. ఉరిశిక్ష పడిందనే కోపంతో ఎదురు తిరిగి రిజిస్టర్ చేయకుండా భీష్మించుకు కూర్చున్నా కూర్చోవచ్చు. వాడికి శిక్ష తగ్గించేందుకు ప్రయత్నాలు చేస్తున్నట్లుగా నటిస్తూ చిన్నగా పని సానుకూలం చేసుకోవాలి. వాడిని ఎలాగైనా బెయిల్ మీద బయటకు తీసుకురావాలి! అందుకే హైకోర్టుకు వెళుతున్నది. కానీ ఎన్ని పై కోర్టులకెళ్ళినా సెషన్స్ కోర్టు జడ్జి శాంతకుమారి విధించిన శిక్షలు తగ్గిన దాఖలాలు లేవనేది లాయర్ల మాట!" అన్నాడు.

"మరో తలనొప్పి వచ్చింది నాన్నా! మన

## కొత్తగాలి...

**కుక్కకాటుకు**
**చెప్పుదెబ్బ**
**వెన్నుపోటుకు**
**ఓటుదెబ్బ**

– నితీష్ చంద్రశేఖర్,
కర్నూలు

సిటీలో ఎవరో చక్రాయుధం అంటూ తరచూ ఇళ్ళల్లో కరపత్రాలు వేస్తున్నారు. వాటిల్లో చాలా వరకూ మన విషయాలే వస్తున్నాయి! ఏం చేయాలో తెలియటం లేదు!" అన్నాడు జయంత్.

"ఆ పని ఎవడు చేస్తున్నదీ పట్టుకోలేనప్పుడు మనం ఇంతమంది వెధవల్ని మేపటం దేనికి? జులపాలు పెంచుకొని పోటుగాళ్ళలాగా జీపుల్లో కర్రలు పట్టుకు తిరగటానికా? వాళ్ళను పట్టుకొని ఏ కీలు కాకీలు విడదీయమని చెప్పు!"

"ప్రయత్నిస్తే మనవాళ్ళకు దొరికింది రోడ్లమీద చెత్త ఏరుకుండేవాళ్ళు. ఎవరో తెలియదుగాని వాళ్ళకు డబ్బులిచ్చి అందరిళ్ళల్లో కరపత్రాలు పడేయమన్నారట. మళ్ళా గనక అట్లా చేస్తే వీపులు చిట్లకొడతామని చెప్పి, అదో గోల కాకుండా వాళ్ళ మొహాన కొంత డబ్బు పడేశాం. ఈ వారం వాళ్ళయితే చేయలేదుగాని కాగితాలు మాత్రం యథాప్రకారం అందరిళ్ళకూ జేరినయి!" అంటూ బ్రీఫ్‌కేసు తెరిచి ఇంతవరకూ వచ్చిన మూడు కరపత్రాలనూ తండ్రికిచ్చాడు.

ఆయన వాటిని చూస్తూనే కళ్ళెర్రజేసుకొని ఊగిపోయాడు. "రేపు బాలరాజును పంపమంటావా.. మనమంటే ఏమిటో అందరికీ ఒకసారి రుచి చూపించి వస్తాడు!" అన్నాడు లేచి నిలబడుతూ.

"పంపిణీ అవుతున్న ఈ కాగితాలు కాదు సమస్య. ఇందులో విషయాలను పత్రికలన్నీ ప్రముఖంగా ప్రచురిస్తున్నాయి. ఆపైన ట్రిబుల్ ఎక్స్ ఛానల్ వాళ్ళు. ప్రపంచంలో ఇంకేం వార్తలూ లేనట్లుగా, వీటినే పదేపదే చూపిస్తూ ఇష్టమొచ్చినట్లుగా ప్రసారం చేస్తున్నారు. ఎవరెవరినో పట్టుకువచ్చి స్టూడియోలో కూర్చోబెట్టి చర్చ అంటూ లైవ్ ప్రోగ్రాంలు చూపిస్తున్నారు!" అన్నాడు జయంత్ కోపంతో ఊగిపోతూ అరుస్తున్నట్లుగా.

★ ★ ★

శాంతకుమారి బంగళా తెల్లవారి తొమ్మిది గంటలయినా ఇంకా నిద్ర లేచినట్లే లేదు. అప్పటికే బాగా ఎండ గూడా ఎక్కింది. పనివాడు వాకిటి ముందున్న పూలమొక్కలకు నీళ్ళు పెడుతున్నాడు.

అప్పుడే ఆనంద్ గేటు తీసుకొని లోపలకి వచ్చాడు. అతడు గుండు చేయించుకొని, పిలక పెట్టించుకున్నాడు. శాంతకుమారి అతడిని చూస్తూనే బయటకు వచ్చి లోపలకు తీసుకువెళ్ళింది.

హాల్లో దివాన్ మీద పడుకొని పుస్తకం చదువుకుంటున్న శ్యామల, ఎవరా వచ్చింది అన్నట్లుగా తలెత్తి చూస్తూ లేచి కూర్చున్నది గాని, ఆనంద్‌ను గుర్తుపట్టలేనట్టుగా ముఖం చిట్లించింది.

"ఆనందే వచ్చింది! అట్లా చూస్తావేమిటి? " అన్నది శాంతకుమారి.

అయోమయంగా అతడి వంక చూసింది. బాగా సన్నబడ్డట్లుగా ఉన్నాడు. పచ్చటి శరీరం మీద ఇప్పుడిప్పుడే నల్లబడుతున్న గుండు. ఎవరో కొత్త మనిషిలా కనబడటంతో అతడివంక వింతగా చూచింది.

"వాళ్ళ అమ్మమ్మ, తాతయ్య పోయారట. కర్మ చేశాడు. రోజూ తలనిండా స్నానాలు, వేళకు తిండి లేకపోవటంతో అలా అయ్యాడు! కూర్చో ఆనంద్! శ్యామల ఆరోగ్యం ఈ మధ్య బాగుండటం లేదయ్యా. చూడు ఎలా చిక్కిపోయిందో.. పది రోజులబట్టి కాలేజీకి రావటం లేదు!"

"అదే నాకూ అర్థంగాక ఏమిటో సంగతి తెలుసుకుందామని వచ్చాను. డాక్టరుకు చూపించారా? "

"సీజనల్ ఫీవరట. మందులిచ్చాడు. ఇప్పుడు కాస్త నయంలే. లేచి ఇంట్లో తిరుగుతున్నది. నా ప్రాణాలన్నీ దానిమీదేనని తెలుసుకదా నీకు! అది కాలేజీకి వెళతానం

## గూఢచారులొస్తున్నారు!

తమకు కాబోయే అల్లుడు లేదా కోడలి గురించి పరిశోధించి చెప్పమని తల్లిదండ్రులు ప్రైవేట్ గూఢచారులను నియమిస్తుండటం మనదేశంలో ఇటీవల పెరిగింది. మారిన సామాజిక పరిస్థితుల్లో పెళ్లికి పూర్వం ప్రేమలు, శారీరక సంబంధాలు ఎక్కువవుతున్నాయి. పూర్వం పెళ్లిళ్ల పేరయ్యలు సంబంధాలు తెచ్చేవారు. నేడు వెబ్‌సైట్ల ద్వారా పెళ్లిళ్లు నిశ్చయమవుతున్నాయి. దాంతో వధూవరుల పూర్వాపరాలు తెలుసుకోలేక, పెళ్లయ్యాక అనేక మోసాలు బయటపడుతున్నాయి. అందువల్ల తమ పిల్లల భవిష్యత్తు దృష్ట్యా తల్లిదండ్రులు గూఢచారుల్ని ఆశ్రయిస్తున్నారు.



కేవలం వివాహపూర్వ పరిశోధనలు మాత్రమే చేసే గూఢాచార సంస్థలు కూడా ఉన్నాయి. దేశవ్యాప్తంగా డిటెక్టివ్ ఏజెన్సీలు పదిహేను వేలకు పైగా ఉన్నాయని ఓ అంచనా. ఇలాంటి ప్రైవేట్ గూఢచారుల పరిశోధనలు మనదేశంలో చట్ట విరుద్ధం కావు. అలాగనీ అవి చట్ట సమ్మతమూ కావు. తమపై జరిగినదాన్ని గూఢచర్యంగా భావించి, తమ వ్యక్తిగత స్వాతంత్ర్యం కోల్పోయామని బాధితులు కోర్టులను ఆశ్రయించవచ్చు. కానీ తమతో సంబంధం కలుపుకునే వ్యక్తుల చరిత్రను తెలుసుకునే హక్కు ఉందని మరోపక్షం చెప్పవచ్చు. విదేశాలలో ఇలాంటి పరిశోధనా సంస్థలకు లైసెన్స్‌లు జారీ చేస్తారు.

ఈ పరిశోధనల్లో వరుడు లేదా వధువు స్వభావం, సాంస్కృతిక, సాంప్రదాయ విలువలు, శీలం, నడవడిక, లైంగిక చరిత్ర, ఆర్థిక పరిస్థితి, ఇతర వ్యసనాలు మొదలైనవాటిని కనుక్కోమని కోరుతుంటారు.

టున్నా బాగా తగ్గితేనే కానీ పంపదలచుకోలేదు. పరీక్షలు జరుగుతున్నాయట గదా.. చదివి చదివి రోగం తెచ్చుకున్నది. నువ్వెలా రాస్తున్నావ్?"

"ఇదుగో మధ్యలో అమ్మమ్మ, తాతయ్య పోవటంతో పూర్తిగా మనస్సు పెట్టి చదవలేకపోయాను. చిన్నప్పుడు చాలా సంవత్సరాలు వాళ్ళ దగ్గరే పెరిగాను!" చిన్నగా అన్నాడు ఆనంద్.

"ఇంటర్నలేగదా ఫరవాలేదులే. ముసలి వాళ్ళకు కర్మ చేశావ్ కాదనకుండా. మీ అమ్మ ఎంతో తృప్తి పడివుంటుంది!"

ఆనంద్ నవ్వాడు.

"ఆమె తృప్తిపడింది అనేదానికంటే నాకు మరో విషయం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది. వాళ్ళు పోయారని తెలిసి నాన్న రావటమే కాదు, నేను ఆ కార్యక్రమాలు చేసినన్ని రోజులూ నా పక్కనే ఉన్నాడు. మా అమ్మనూ ఓదార్చాడు!"

"వీళ్ళ మధ్యలో ఏర్పడిన పీడా వాళ్ళ మీదుగా పోయిందన్నమాట. పోనీయ్‌లే.. వాళ్ళు కలవటానికి మించిన ఆనందం ఇంకేం ఉంటుంది...?"

"వాళ్ళు శాశ్వతంగా విడాకులు తీసుకున్నారు గదా ఆంటీ! ఇప్పుడు ఏవో నాలుగు మాటలు మాట్లాడుకున్నంత మాత్రాన ఒరిగేదేమున్నది?" అన్నాడు నిరాశగా.

"కాగితాల మీద విడాకులు తీసుకున్నా మనస్సులు కలిస్తే హాయిగా సంసారం చేయవచ్చు! ఇద్దరినీ ఒంటరితనం వేధిస్తుండవచ్చు. అందునా అన్ని సంవత్సరాలు కొట్టుకుంటూనో, తిట్టుకుంటూనో కలిసి

ఉన్న తరువాత? " అన్నది నవ్వి ఆమె.

"శ్యామలతో మాట్లాడుతుండు. ఇప్పుడే వస్తా!" అంటూ వాళ్ళిద్దరినీ అక్కడ వదిలేసి వెళ్ళిపోయింది ఆమె.

కొద్దిసేపు మౌనం అమావాస్యనాటి అంధకారంలా అలముకున్నది వాళ్ళ నడుమ. ఎవరు ముందు మాట్లాడాలా అనే తపన ఇద్దరినీ వేధించసాగింది.

"నేను ఘోరమైన నేరం చేశాను ఆనంద్! అమ్మను ఎంతగానో క్షోభ పెట్టాను!" అన్నది తల వంచుకొని ముందుగా శ్యామలే నోరు తెరిచి, ఇక ఆ నిశ్శబ్దాన్ని భరించలేనట్లుగా.

అప్పుడు సూటిగా చూసాడు ఆ అమ్మాయి వంక. పాలిపోయిన ముఖం, లోతుకుపోయి దిగులుగా ఉన్న కళ్ళు.. నూతిలోనుంచి వస్తున్నట్లుగా మాట...

ఆమె కొద్దిక్షణాల వరకూ మాట్లాడలేదు.

"ఈ అనారోగ్యం నేను కొని తెచ్చుకున్నది నా చేతులారా? " అన్నది సిగ్గుపడుతున్నట్లుగా నంగి నంగిగా.

"ఏం చేశావ్? " అన్నాడు, తనకు ఆ విషయం ముందే తెలుసనుకుంటే ఆమెలో న్యూనతా భావం ఏర్పడవచ్చని. చిదానందంగారి చికిత్స ఆమెకు ఎంతగానో మేలు చేసిందన్నమాట.

శాంతకుమారి మూడు కాఫీ కప్పులతో ఆ గదిలోకి వచ్చింది.

"దీని ఆరోగ్యం కుదుటపడిన తరువాత అమెరికా వెళ్ళి మా తమ్ముడి దగ్గర కొన్నాళ్లు ఉండి వద్దామని అనుకుంటున్నాం. వాళ్ళ నాన్న పోయాక నేనూ ఈ ఇల్లు వదిలి ఎక్కడకూ వెళ్ళలేదు. అది చదువుతోనూ, నేను ఉద్యోగరీత్యా చాలా ఒత్తిళ్లు ఎదుర్కొంటున్నమాట వాస్తవం! ముందు మాకు విశ్రాంతి కావాలి, ముఖ్యంగా మనస్సులకు. నీ నుండి నాకొక్కటే సాయం కావాలి. దాని చదువు కుంటు పడకూడదు.. ఈ సంవత్సరం చదువు పాడైనట్లే అనుకో.. అది చదివిందేదో మర్చిపోకుండా ఉండేలా చూడటమే గాకుండా, కొత్తగా చెప్పే పాఠాల్ని వారానికి రెండు మూడుసార్లు వచ్చి దానికి చెప్పి చదివిస్తుండాలి, అమెరికా వెళ్లేంతవరకూ!"

"తప్పకుండా ఆంటీ!"

తరువాత గంటకు ఆనంద్ వెళుతుంటే శాంతకుమారి అతడితోపాటు కిందకు వచ్చింది. "డాక్టర్ చిదానందంగారి దగ్గరకు వెళ్లి వచ్చాక ఓ వారం రోజులపాటయితే నానా గోల చేసింది. ఆయనిచ్చిన మాత్రలు వేసి శాంత పరచటం నాకు బ్రహ్మప్రళయమే అయింది. నువ్వు ఎప్పుడొస్తావా అని రోజులు లెక్క పెట్టుకుంటూ ఎదురు చూశా.. నా అదృష్టం.. అది తను చేసిన తప్పును త్వరలోనే గ్రహించి నాకూ, డాక్టర్‌గారికీ ఎంతగానో సహకరించింది!"

ఆమె మాటలు ఎంతో ఆనందాన్ని కలిగించినయ్ ఆనంద్‌కు.

★ ★ ★

కోర్టుహాలు జనంతో నిండిపోయింది. అప్పుడు ఉదయం పదకొండు గంటలయింది. ఒకవైపు బోనులో గుర్నాథం నిలుచొని ఉన్నాడు. ఎదురుగా మరోదానిలో శారద తలవంచుకొని నిలబడి ఉన్నది. ప్రేక్షకుల నడుమ గుర్నాథం స్నేహితులు, తండ్రి కూర్చొని ఉన్నారు. శారద తల్లి మృదుల కూర్చుని ఉన్నది. ప్రశాంత్ సస్పెన్షన్లో ఉన్నా మృదుల కోరటంతో వచ్చి ఆమె పక్కనే కూర్చున్నాడు. సబ్ ఇన్‌స్పెక్టర్ విజయ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ పక్కన కూర్చొని ఉన్నాడు.

రెండు రోజులబట్టి ఈకేసు విచారణ జరుగుతోంది. పబ్లిక్ ప్రాసిక్యూటర్ బోనులో ఉన్న గుర్నాథాన్ని ఎన్నిసార్లు ప్రశ్నించినా ఒకే సమాధానం. ఈ రోజూ తను రోజూ వేసే ప్రశ్ననే కాస్త అటూ





ఇటూగా మార్చి వేశాడు.

"క్రితం నెల పదహారో తారీఖు శని వారం సాయంత్రం ఏడు గంటలప్పుడు జోరున వాన కురుస్తుండగా బస్స్టాండులో బస్సుకోసం ఎదురు చూస్తూ నిల్చొని ఉన్న శారద అనే ఆ అమ్మాయిని, ఆమె ఇంటిద గ్గర దించుతానని మభ్యపెట్టి నీ కారులో ఎక్కించుకొని, ఊరిబయట ఉన్న మీ తోటకు తీసుకువెళ్లి చెరిచావనేది అభి యోగం... నీ సమాధానం ఏమిటి? "

"లక్షమంది అమ్మాయిలు నా గురించి లక్ష చెబుతారు.. వాటికన్నింటికీ నాకు సమాధానం చెప్పాల్సిన అవసరం లేదు.. నేను నిజాయితీపరుడిని.. వానలో తడు స్తున్న ఆ అమ్మాయిని మా పేటలో ఉండే అమ్మాయిగా గుర్తించి, జాలిపడి నా కారులో ఎక్కమన్నాను.. ఎక్కిన దగ్గర నుండీ వెధవ్వేషాలు వేయటం మొదలుపె ట్టింది. ముందు మంచిగా చెప్పాను. అయినా వినలేదు. మీదపడింది. ముద్దులు పెట్టుకో ప్రయత్నించింది. నేను విదిలించి కొట్టాను. కావాలని వచ్చానని అంత లోకువయ్యానా అంటూ ఎగతాళి చేస్తూ నన్ను రెచ్చగొట్టింది. నేను తల ఒగ్గ లేదు. చూడు, నిన్ను ఏం చేస్తానో అంటూ పెద్దగా అరిచి, నాకు లక్ష రూపాయలు ఇస్తే మెదలకుండా దిగి వెళ్లిపోతాను, లేదంటే నలుగురిలో నీ పరువు తీస్తాను అంటూ బెదిరించింది. కోపం పట్టలేక కారు డోరు తెరిచి ఆ వానలోనే బయటకు ఒక్కతోపు తోసి నేను వెళ్ళిపోయాను.. అసలు ఇలాంటి సిగ్గు, లజ్జలేని ఆడవాళ్లు గూడా ఉంటారా అని నాకు ఆశ్చర్యమే సింది. అప్పుడే నిర్ణయించుకున్నాను.. ఎప్పుడూ, ఎలాంటి పరిస్థితుల్లోనూ ఆడదా నికి లిఫ్ట్ ఇవ్వగూడదని.. బరితెగించిన ఆడవాళ్ళు డబ్బున్నవాళ్లను ఎలా బెదిరించి డబ్బు సంపాదించ ప్రయత్నిస్తారో ఈ అమ్మాయే నాకు ఓ పాఠం నేర్పింది!" అన్నాడు చిన్నగా గుర్నాథం.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ నవ్వి "రెండు రోజులబట్టీ ఒక్కమాట గూడా మార్చ కుండా చెప్పిందే చెబుతున్నావంటే బాగా బట్టీయం చేశావన్నమాట. ఆసుపత్రిలో దొంగ సర్టిఫికెట్లతో కాలక్షేపం చేశావు అనేదే నువ్వు నేరం చేశావనేందుకు బల మైన సాక్ష్యం!" అంటూనే న్యాయమూర్తి వైపుకు తిరిగి, "ఇతడు చెప్పేదంతా కల్పిత గాథ యువర్ ఆనర్!" అన్నాడు.

"ఇక నేరాన్ని రుజువు చేసేందుకు సాక్ష్ లను ప్రవేశపెడతాను!" అన్నాడు మళ్లీ.

న్యాయమూర్తి డిఫెన్స్ లాయర్ వంక చూసారు.

## కొత్తగాలి...

**చెట్టు నయం**
**తనను కట్టె చేసినా**
**మన కట్టెను**
**సంస్కరిస్తుంది**

*– లోగిశ లక్ష్మినాయుడు,*
సింహాచలం

ఆయన లేచి కోటు సర్దుకుంటూ శారద నిలుచున్న బోను దగ్గరకు వెళ్లి నిలుచు న్నాడు. "చూడమ్మా! నిందితుడిగా ఆ బోనులో నిల్చున్న అతడు జరిగింది య థాతథంగా చెప్పాడు.. నువ్వేమో నిజాలు చెప్పకుండా పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారిచేత ఓ గొప్ప కథ అల్లించి అమాయకుడైన అత డిని మనస్తాపానికి గురిచేస్తున్నావ్.. ఓ గౌరవనీయ కుటుంబం నుంచి వచ్చిన అతడిని నలుగురి మధ్యా దోషిగా నిలబె ట్టావ్. నీ మాటలు పరమ అసత్యాలు అని నిరూపించేందుకు నా దగ్గర ఎన్నో

ఆధారాలు ఉన్నాయి. అలా న్యాయమూర్తి ముందు నిరూపించబడిన తరువాత నీ పరిస్థితి ఏమిటో ఆలోచించుకొని, నీకు పడే శిక్షేమిటో గుర్తుకు తెచ్చుకుంటూ నేన డిగే ప్రశ్నలకు నిజాయితీగా సమాధానాలు చెప్పి నిన్ను నువ్వు కాపాడుకో!"

"యువర్ ఆనర్! గౌరవనీయులైన డిఫెన్స్ లాయరు సిగ్గుతో నలుగురు ముందూ బోనులో నిలబడిన ఆ అమ్మాయిని తన మాటలతో భయభ్రాంతురాలిని చేస్తున్నారు!"

"క్షమించాలి యువర్ ఆనర్! పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు అన్నట్లుగా నేను ఆ అమ్మాయిని ఏవిధంగానూ భయపెట్టటం లేదు! ఆమె నుండి నిజాలు రాబట్టి ఓ అమాయకుడి మనో వేదనను పోగొట్టాల నేదే నా తాపత్రయం!"

"ప్లీజ్ ప్రొసీడ్!"

"థాంక్యూ సార్!" అంటూనే శారద వైపుకు తిరిగి, "నువ్వు క్రితం నెల పద హారు శనివారం సాయంత్రం ఏడు గంట లప్పుడు జోరున వానకురుస్తున్న సమ యంలో బస్‌స్టాండులో బస్సుకోసం అన్న ట్లుగా నిల్చొని ఉన్నావ్. వానాకాలం అని తెలుసు.. అయినా ఉద్యోగం సద్యోగంలేని నువ్వు చేతిలో గొడుగు కూడా లేకుండా నిలబడాల్సిన అవసరం ఏమున్నది? నీతో పాటే ఇంకెంతమంది అమ్మాయిలు నిల్చొని ఉన్నారు అక్కడ?"

"ఐ అబ్జెక్ట్ యువర్ ఆనర్! పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు విచిత్రమైన ప్రశ్నలు వేసి ఆ అమ్మాయిని ఇరకాటంలో పెట్టి తన క్లయింట్‌కు లబ్ధి చేకూర్చాలని చూస్తు న్నారు.. ఉద్యోగాలు చేయని వాళ్ళెవరూ బజారుకు వెళ్ళరా.. బస్సుకోసం బస్‌స్టాం డులో నిలబడరా.. కచ్చితంగా గొడుగు తీసుకు వెళ్ళాలనే నిబంధన ఉన్నదా?"

"వారిని అడగదలచ్చుకున్న వాటినన్నిం టినీ అడగనీయండి, తరువాత మీ అభ్యం తరాలు తెలుపుదురుగాని!"

"థాంక్యూ యువర్ ఆనర్! ఓకే పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గారు! అభ్యంతరం చెబుతు న్నారు కాబట్టి నేను ఇక ఆ విషయం మాట్లాడను. నీ కథనాన్నే నమ్మి అందుకు అనుగుణంగా ప్రశ్నిస్తాను.. నువ్వు వాన కురుస్తుండటంతో.. తడిసిపోతాననే భయంతో, ఆయన ఇంటిదగ్గర దించుతాన న్నాడు కాబట్టి నమ్మి ఆయన కారెక్కావ్. నువ్వు ఆరోపణ చేసినట్లే ఆయన నిన్ను మీ ఇంటి దగ్గర దించకుండా వాళ్ళ తోట లోకి తీసుకువెళ్లాడు.. అవునా?"

"అవునండి!" చిన్నగా చెప్పింది.

"సరే నువ్వన్నట్లే ఆయన నిన్ను ఆయన తోటలోకి తీసుకు వెళ్ళిన తరువాత... అక్కడ ఏం జరిగిందో చెప్పమ్మా!"

"వాన బాగా కురుస్తున్నదిగదా.. కాస్త తగ్గగానే వెళ్దాం.. నాకు అర్జంటు పని ఉండి ఇక్కడకు వచ్చాను.. లోపలకు వెళ్దాం రా అన్నారు!"

"నువ్వు లోపలకు వెళ్ళావా? అక్కడ ఇంకెవరైనా ఉన్నారా?"

"కారులో కూర్చున్న నాకు లోపల ఎవ రైనా ఉన్నదీ లేనిదీ తెలియదండి. కానీ దిగి లోపలకు వెళ్ళిన తరువాత ఎవ్వరూ లేనట్లుగా గమనించాను. నేను కారులోనే కూర్చొని ఉంటాను.. మీ పని చూసుకొని రండి అంటూ వెనక్కు తిరిగాను.. కాని అప్పటికే ఆయన తలుపు మూసి బోల్టు పెట్టేశారండి.. నాకు భయమేసి కేకలు పెట్టాను.. అయినా ఆయన వినిపించుకో లేదు... మీదమీదకు వచ్చి చీరలాగే శాడు... జాకెట్టు చింపేశాడు... నన్ను మంచంమీదకు తోసేశాడు!"

"ఆయన అన్ని చేస్తున్నా నువ్వు మెదల కుండా చూస్తూ ఊరుకున్నావా?"

"తిరగబడి పెనుగులాడానండి..

అయినా ఆయన బలంముందు నేను ఏమీ చేయలేక ఓడిపోయాను..!"

"అంటే నిన్ను వివస్త్రను చేసి మంచం మీద పడేశాడు.. అవునా... దుప్పట్లు లాంటివేమీ కనబడలేదా నీకు ఆ మంచం మీద నీ శరీరాన్ని కప్పుకునేందుకు? "

పబ్లిక్ ప్రాసిక్యూటర్ లేచాడు. "ఐ అబ్జెక్ట్ యువర్ ఆనర్. గౌరవనీయమైన స్త్రీని అంత అవమానకరంగా డిఫెన్స్ లాయర్ ప్రశ్నించటం సరైన పద్ధతి కాదు!"

"ఓకే! ఇంకా నేనేమీ అడగను!" న్యాయమూర్తి ఆయన అభిప్రాయం చెప్పేలోగానే డిఫెన్స్ లాయర్ మాట మారుస్తూ, "సరే! అప్పుడు ఆయనేం చేశాడు నిన్ను? చెప్పాలి.. నువ్వు చెప్పేవన్నీ నిజాలే అనేందుకు చూసిన సాక్షులెవరైనా ఉన్నారా? " కంఠం హెచ్చించి గద్దిస్తున్నట్లు అడిగాడు.

తను సమాధానం చెప్పలేనన్నట్లుగా సిగ్గుతో తలవంచుకున్నది.

"అతడు ఏం చేశాడో స్పష్టంగా చెప్పాలి! మీద పడ్డాడా? "

శారద కళ్లు మూసుకున్నది. ఆ ప్రశ్నలను భరించలేనట్లుగా ఆమె కళ్ళవెంట నీరు ధారాపాతంగా కారుతున్నది.

"ఏడిస్తే ఓ గౌరవనీయుడి మీద వేసిన నిందలు, తప్పుడు ఆరోపణలు నిజం అవ్వవు. నీమీద పడ్డ అతడేం చేశాడు? "

ప్రేక్షకుల మధ్యలో కూర్చున్న గుర్నాథం స్నేహితులు వెకిలిగా నవ్వుతుండగా ఓ పక్కగా కూర్చున్న మృదుల, 'ఛీ... ఈ కేసుపెట్టి శారీరకంగా చచ్చినదాన్ని మానసికంగా గూడా చంపుతున్నానా' అన్నట్లుగా కుమిలిపోతోంది.

శారద కళ్ళు తెరిచి, శరీరం అగ్నిజ్వాలలతో కాలిపోతుండగా, గుండె బిగపట్టుకొని "ఇంతమందిలో పెద్దగా ఎలా చెప్పగలనండి.. కాస్త దగ్గరకు రండి!" అంది.

డిఫెన్స్ లాయరు గట్టిగా నవ్వాడు. "నాకు తెలుసు.. నువ్వు జాణవి.. ఇంతకంటే రుజువు ఇంకేం కావాలి!" అంటూ ముందుకో అడుగువేశాడు.

శారద తుపుక్కున డిఫెన్స్ లాయర్ ముఖం మీద ఉమ్మేస్తూ "అతడు అప్పుడు చేసింది ఇంతకంటే కూడా చాలా అసహ్యంగా ఉన్నదండి!" అంటూనే రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొని ఆ బోనులోనే కూలబడిపోయింది.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలప్పుడు వెంకట్ రాగిణికి ఫోన్ చేశాడు. "నీ మాటలు నీటి మీద మూటలు అయిపోతున్నాయి. నీ హోటల్లో గదిని నాకు ఊరికినే ఇవ్వనక్కరలేదులే... అద్దె కడతాను... నీ మాట నిలబెట్టుకో... ఈ రాత్రికి ఎట్టి పరిస్థితులలోనూ శ్యామల నాదవ్వాలి!"

"చూడు వెంకట్! నా హోటల్లో గదులన్నీ మూడు రోజులపాటు పత్తి ఉత్పత్తిదారుల అసోసియేషన్ వార్షిక సభలకు బుక్ చేసుకున్నారు. దాంతో నేను చాలా హడావుడిగా ఉన్నాను. నేను ఇంటర్నల్ ఎగ్జామ్స్ రాయటానికి గూడా కాలేజీకి రావటంలేదు. శ్యామలను చూసి పదిరోజులయింది. అదీ కాలేజీకి రావటంలేదని తెలిసింది. ఈ మీటింగ్‌లు అయ్యాక నీకిచ్చిన మాట తప్పకుండా నిలబెట్టుకుంటాను.. సరేనా! ఫోన్ పెట్టేస్తున్నాను!"

"ఆగు.. మనం కూర్చొని చాలా రోజులయింది. శ్యామల కూడా నువ్వు పిలిస్తే స్వర్గంలో తేలేందుకు పరుగెత్తుకుంటూ వస్తుంది. నేను దాన్ని అవకాశంగా మలుచుకుంటాను. త్వరలో డేట్ ఫిక్స్ చేయి!"

"చూద్దాంలే.. కానీ కొంత సమయం పడుతుంది! బై!" ఫోన్ పెట్టేసింది రాగిణి.

★ ★ ★

ఇంజినీరింగ్ కాలేజీలో విద్యార్థులకు ఇంటర్నల్ పరీక్షలు. విద్యార్థుల నడుమ

ఇన్విజిలేటర్లు అటూ ఇటూ తిరుగుతు న్నారు వారినే గమనిస్తూ. కిరణ్ వెనుక ఇన్విజిలేటర్ చటుక్కున ఆగాడు. వంగి కిరణ్ కాళ్ళ దగ్గర పడివున్న కాగితపు ఉండని చేతిలోకి తీసుకున్నాడు.

తన పక్కనే నిల్చున్న ఆయన్ను చూస్తూనే కిరణ్ "ఏంటి సార్? " అన్నాడు.

"ఈ కాగితం ఇక్కడకు ఎలా వచ్చిందా అని చూస్తున్నాను.. నువ్వేనా పడేసింది!"

"ఏమిటి సార్ అది? " లేచి నిలు చుంటూ ఆదుర్దాగా అడిగాడు.

"నువ్వు పరీక్షలో కాపీ చేస్తూ నన్ను చూస్తూనే భయంతో ఉండచుట్టి ఆ కాగి తాన్ని కింద పడేశావ్ కదూ!" ఆయన అరుస్తున్నట్లుగా అన్నాడు.

"చదవకుండా వచ్చి ఈ అడ్డదారులు తొక్కటమేంటి? " అంటుంటే, వరండాలో వెళుతున్న ప్రిన్సిపాల్ ఆ కేకలకు "ఏమైంది? " అంటూ వచ్చాడు. ఆయన్ను చూస్తూనే ఆ లెక్చరర్ కిరణ్ కాళ్ళవద్ద దొరికిన కాగితాన్ని చూపిస్తూ "కాపీ కొడుతూ పట్టుబడ్డాడు సార్!" అన్నాడు.

ఆయన కోపంతో ఊగిపోతూ "ముందు అతడి పేపర్ లాక్కొని బయటకు పంపే యండి. నేను నిబద్ధతకి, విలువలకు ప్రాధాన్యమిచ్చే మనిషిని. దీన్ని సహిం చను. అంతేకాదు, నేను ప్రిన్స్‌పాల్‌గా పని చేసే కాలేజీకి విలువలు లేవంటూ ఎవ రైనా వేలెత్తి చూపితే భరించలేను. నిన్ను కాలేజీ నుంచి తక్షణమే డిబార్ చేస్తు న్నాను!" అంటూ పెద్ద పెద్ద అంగలతో ఆ కాగితాన్ని తీసుకొని వెళ్ళిపోయాడు.

ఆ హాల్లో ఒక్కసారిగా సూది పడ్డా విన బడేటంత నిశ్శబ్దమేర్పడింది. కిరణ్ చాలా బుద్ధిమంతుడని, తెలివిగలవాడని, తోటి విద్యార్థులందరికీ తెలుసు. అతడికి పరీక్ష లలో కాపీ కొట్టి మరిన్ని మార్కులు తెచ్చు కోవాల్సిన అవసరమూ లేదనీ తెలుసు. ప్రిన్స్‌పాల్ చర్యను వాళ్ళు సహించలేకపో యారు. ఒక్కసారిగా అందరూ లేచి, సమాధానాలు రాస్తున్న పేపర్లను అక్కడే వదిలేసి, పెద్దపెద్దగా కేకలు వేసుకుంటూ బయటకు వచ్చేశారు.

క్షణాల్లో ఆ వార్త దావాలనంలా కాలేజీ క్యాంపస్ మొత్తాన్నీ ఆవరించింది. అన్ని గదుల్లోని విద్యార్థులూ బయటకు వచ్చి కాలేజీముందు గుమిగూడారు. "ప్రిన్సిపాల్ డౌన్‌డౌన్!" నినాదాలతో ఆ ఆవరణంతా మారుమ్రోగసాగింది.

రామం ప్రిన్సిపాల్ రూమ్‌కు వెళ్ళాడు. "కిరణ్ కాపీ కొట్టాడంటున్నారు.. మీకు దొరికిన ఆ కాగితంలోని చేతిరాత ఎవరిదో చూసారా? " విసురుగా అడిగాడు.

"నువ్వేం మాట్లాడుతున్నావ్! స్వదస్తూ రీలో రాసి స్లిప్పులు తెచ్చుకుంటారా ఎవ రైనా? లెక్చరర్ స్వయంగా చూసాడు అతడు కాపీ కొట్టటం, తనని చూడగానే ఉండచుట్టి కిందపడేయటం! ఆయన తన కళ్ళతో చూసిందాన్నే చెప్పాడు. రిపోర్టు రాసిమ్మన్నాను, ఇస్తున్నాడు. నేను ఇలాం టివి ఏమాత్రం సహించను!"

"అతడే కింద పడేస్తే తన కాళ్ళ దగ్గరే ఎందుకు పడేసుకుంటాడు సార్.. మరే పక్కవాళ్ళ దగ్గరో పడేస్తాడు గాని!"

## కొత్తగాలి...

**వినోదంతో మొదలై**
**విషాదంతో ముగిసేది**
**రాజకీయ పొత్తు**

– డి. చందూవంశీ,
కర్నూలు

"అంటే నీకూ కాపీ కొట్టే అనుభవం బాగా ఉన్నదన్నమాట. నేను ఎవరు చెప్పినా వినను.. లెక్చరర్ కళ్ళతో చూసిం దాన్నే కాదని మీ కాకమ్మ కబుర్లకు తల ఒగ్గుతానా? అది అసంభవం!"

"సరే సార్! ఇది తేలి, కిరణ్‌ని పరీక్ష రాయనిచ్చేంత వరకూ మేమూ రాయం!"

ఇంతలోనే లోపలకు పదిమంది విద్యా ర్థులు దూసుకు వచ్చారు. "ఆయనతో మాట్లాడటం అనవసరం.. బయటకు వచ్చే యండి.. ఆనంద్ నిరాహార దీక్షకు కూర్చు న్నాడు.. అతడితో పాటు మనమూ కూర్చుందాం! ఈయనగారి అన్యాయపు ధోరణి, నిరంకుశత్వం ఏమిటో మేనేజ్ మెంటే తేలుస్తుంది!" అన్నారు.

★ ★ ★

చక్రాయుధం

చక్రాయుధం పంపిణీలో ఇబ్బందులు ఎదుర్కొంటూనే ఉన్నాం. క్రితంసారి పంచిన న్యూస్‌పేపర్ కుర్రవాళ్ళు కొందరు అన్యాయంగా తన్నులు తిన్నారు.

ఇంతవరకూ చక్రాయుధం జరిగిన అక్ర మాలనే తెలియబరుస్తూ వచ్చింది. ఇక ముందు వాటితోపాటు, జరగబోయే వాటికి తెరవెనుక జరుగుతున్న ఘోరాలను తెలుసుకొని ప్రజలను ముందుగా హెచ్చ రించాలని అనుకుంటున్నాం.

అలాంటి ఓ మోసాన్ని మీ దృష్టికి తీసు కువస్తాం. క్రితంరాత్రి పదిగంటలకు నగర కళ్యాణ మండపంలో ఓ చదువుకున్న అమ్మాయి వివాహం అమెరికాలో ఉద్యోగం చేస్తూ లక్షలకు లక్షలు సంపాదిస్తున్న ఓ కుర్రవాడితో జరపటానికి నిర్ణయింపబ డింది. ముందుగానే అందరికీ తెలిస్తే అంత మంచి సంబంధాన్ని ఎవరైనా ఎక్క డ తన్నుకుపోతారోనని ఆహ్వాన పత్రికలు అచ్చువేయించేంత వరకూ బయట పెట్ట లేదు అమ్మాయి తల్లిదండ్రులు. ఎవర యినా పిల్లలకు చక్కని భవిష్యత్తుండాలనే ఆశిస్తారు. లక్షలు ఖర్చుపెట్టి అన్ని ఏర్పాట్లూ ఘనంగా చేసుకున్నారు.

చక్రాయుధం సభ్యుడయిన ఆ అమ్మాయి బంధువుకు అనుమానం రాగా, అందరం కలిసి చర్చించి, పరిశోధన మొద లు పెట్టాం. ఆ పెళ్ళికొడుకుది మన జిల్లా లోనే ఓ మారుమూల కుగ్రామం. ఇప్ప టికే అతడికి పెళ్ళవ్వగా ఓ పిల్లవాడు కూడా ఉన్నాడు. బీకాం చదువుతుండగానే అన్ని వ్యసనాలకూ బానిసయ్యాడు. అమెరి కాలో ఉద్యోగం కాదుగదా, ఇంతవరకూ అమెరికాలో కాలే మోపలేదు. నిజాలు తెలి యటంతో చక్రాయుధం మొన్నరాత్రి పిల్ల తండ్రికి ఫోనుచేసి చెబితే, ఆయన బాధతో ఏడుపు మొదలు పెట్టకముందే పెళ్ళికొ డుకు, అతడితో వచ్చిన బంధువులు పరా రయ్యారు. ఆ అమ్మాయికి ఆ దరిద్రపు పెళ్ళి తప్పినందుకు అభినందనలు!

ఇసుక మాఫియా వారు డబ్బును కారులో అక్రమంగా తరలిస్తుండగా పట్టు కున్నాడని ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్‌ను సస్పెండ్ చేయించిన సంగతి తెలిసిందే. ఆ అక్రమార్కులకు అతడిమీద కసి ఇంకా తీరలేదు. తెలివిగలవాడు, నెమ్మదస్తుడు అయిన ఇంజినీరింగ్ చదువుతున్న ఆయన కొడుకు కిరణ్‌ను పరీక్షలో కాపీ కొట్టా డంటూ అభాండం వేసి అన్యాయంగా డిబార్ చేయించారు. వాళ్ళు ఎంతకైనా తెగిస్తారనేందుకు ఇదే నిదర్శనం.

రాజకీయ నాయకుడు కూర్మావతారం కొడుకు గుర్నాథం ఓ యువతిని చెరచిన కేసులో ఆ అమ్మాయి అతడి న్యాయవాది అసభ్య ప్రశ్నల తీరును గర్హిస్తూ అవమా నించిన విషయం అందరికీ తెలిసిందే. నగరంలోని మహిళా సంఘాలు మరో అడుగు ముందుకేసి ఆ న్యాయవాది ఇంటిని ముట్టడించి ఘెరావ్ చేయటంతో

ఈ కేసునుంచి ఆయన తప్పుకున్నాడు.

చక్రాయుధం సభ్యులు మరో అక్రమ భాగోతాన్ని వెలికి తీశారు. నగరశివార్లలో కర్మాగారం స్థాపించి వెయ్యిమందికి ఉద్యోగావకాశాలు కల్పిస్తామంటూ ప్రభుత్వ భూమిని కారు చౌకకు తీసుకున్న ఓ అక్రమార్కుడు దాంట్లో విల్లాలు కట్టి పెద్దపెద్ద ఉద్యోగులకు, నాయకులకు నిర్దేశించాడు. వాటిని మధ్యతరగతి సామాన్యుడు ఎటూ కొనలేడు. ఆ ఇళ్ళమధ్యే ఈతకొలనులు, ఏసీ మినీ థియేటర్లు కూడా నిర్మించారు. కోట్ల విలువ చేసే ఆ స్థలాన్ని ఆ అక్రమార్కుడికి లక్షల్లో ఇస్తే, అతడు పెట్టిన పెట్టుబడికంటే ఎన్నోరెట్లు ఎక్కువ లభించిందని తెలుస్తోంది. శెలవ్.




"అమ్మా! నేను కాలేజీకి వెళుతున్నాను!" అన్నది శ్యామల పూజ చేసుకుంటున్న తల్లి దగ్గరకు వచ్చి. "కాలేజీలో ఆనంద్ నిరాహార దీక్షకు కూర్చున్నాడట.. చూసివస్తాను.. టీవీలో చూపిస్తున్నారు!"

"అదేమిటి? అతడు నిరాహార దీక్షకు కూర్చోవటం దేనికి.. ఏం జరిగిందట? "

"కాలేజీలో ఓ స్టూడెంటు కాపీ కొడుతుంటే పట్టుకొని డిబార్ చేశారట.. అందుకుగాను గొడవలు జరుగుతున్నయి!"

"వాళ్ళకేమైనా బుద్ధివున్నదా అసలు. కాపీ కొడుతుంటే చూస్తూ ఊరుకోవాలా? అతడు ఇలాంటి చిల్లర విషయాల్లో కల్పించుకోవటం ఏమిటి? ఇన్నాళ్ళబట్టీ తెలివిగలవాడు, బుద్ధిమంతుడు అనుకుంటున్నా!"

"అది తెలుసుకుందామనే నేను వెళుతున్నది. అతడు ఎందుకు ఆ పని చేస్తున్నాడో కనుక్కొని చివాట్లు పెట్టి వద్దామని!" అన్నది తను బయటకు వెళ్ళటానికి తల్లిని అనునయిస్తున్నట్లుగా.

"నువ్వు చివాట్లు పెడితే మానేస్తాడా? లేనిపోని వాటిలో తలదూర్చబోకు!"

తల్లి విచిత్రంగా కూతురు వంక చూసింది. డాక్టర్ చిదానందంగారు సలహా చెప్పారు గదా అని తరచూ అతడిని వచ్చి కూతుర్ని మాటల్లో పెడుతూ కాలక్షేపం చేయమన్నది. అతడూ వచ్చి అవీఇవీ కబుర్లు చెబుతూ కూర్చుంటున్నాడు. దానిప్రభావం కాదుగదా, ఇప్పుడు అతడిని చూడటానికి బయల్దేరటం? కూతురి మాట తీరు చూస్తుంటే తను వద్దన్నా ఆగేటట్లు లేదు.

తరువాత అరగంటలోనే శ్యామల కాలేజీలో ఆనంద్ దీక్షకు కూర్చున్న ప్రదేశానికి వచ్చింది. అక్కడ ఆనంద్ పక్కన రామం ఉన్నాడు. అతడిని చూస్తూనే నుదురు చిట్లించింది. మళ్ళా ఆ వెధవ గ్యాంగ్ వలలో పడలేదు కదా?

ఆనంద్ శ్యామలను చూస్తూనే పలకరింపుగా చిరునవ్వు నవ్వాడు. వెళ్ళి అతడి పక్కగా కూర్చున్నది శ్యామల. తరువాత రెండు నిముషాలకు అతడి పక్కన ఎవరూ లేకపోవటం చూచి, "నువ్వు చేస్తున్న పని తెలిసి అమ్మ అరుస్తున్నది!" అన్నది చిన్నగా.

"కిరణ్ అంటే నాకు చాలా అభిమానం ఉన్నది. అందుకనే నేను ఈ దీక్ష చేపట్టింది. అతడికి అసలు కాపీ కొట్టాల్సిన అవసరమే లేదు. అతడిని డిబార్ చేయటం వెనుక పెద్ద పెద్దవాళ్ళ హస్తమే

ఉన్నట్లనిపిస్తున్నది!"

"ఎవరికొచ్చిందా అవసరం? "

"తప్పుడు పనులు చేస్తున్నవాళ్ళకు కిరణ్ తండ్రి అవరోధమయ్యాడు. అందుకే ఆయన్ను ఉద్యోగంనుంచి సస్పెండ్ చేయించటమే గాకుండా ఇప్పుడు ఆయన కొడుకును డిబార్ చేయించి అవమానం పాలు చేస్తున్నారు. ఇది కిరణ్‌మీద కోపం కాకపోయినా వాళ్ళ దుశ్చర్యలకు అతడు సమిధయిపోతున్నాడు!"

శ్యామల ఏం మాట్లాడలేకపోయింది. ఆనంద్ ఎవరి ప్రోద్బలంతోనో, మరొకరి మెరమెచ్చులకోసమో ఏ పనీ చేయడని తెలిసినా, చుట్టూవున్న రామంలాంటి వాళ్ళను చూస్తూ అనుమానపడింది. అతడి మాటలు విన్నాక అతడు ఎవరి ఒత్తిళ్ళకూ తల ఒగ్గలేదనే అర్థమయింది.

"ఓకే! నేను నీకు చెప్పేటంతటిదాన్ని కాదు. వీలయినంత త్వరలో దీన్నుండి బయటపడు. అమ్మ కూడా నీకు అదే చెప్పమన్నది. అందుకే నేను ఇప్పుడు వచ్చింది. వస్తాను మరి!"

"థాంక్యూ!" అతడు కొద్ది క్షణాలపాటు కళ్ళుమూసుకొని ఉండి, తరువాత ఏదో చెప్పాలన్నట్లుగా కళ్ళు తెరిచాడు. అప్పటికే ఆమె కారు డోరు తెరుస్తున్నది.

ఆమె పక్కన వెంకట్ నిలబడివుండటం చూచి కంగారు పడ్డాడు ఆనంద్.

"ఏమిటీ మధ్య నీ దర్శనమే కరువయింది.. అంత సీరియస్‌గా చదువుతున్నావా? " అన్నాడు కారు డోరుమీద చేయి వేసి మూయకుండా ఆపుతూ.

చికాగ్గా చూసింది అతడి వంక శ్యామల. "మార్కులు రావాలంటే చదవాలిగా!"

"రాగిణి రేపు ఆదివారం సాయంత్రం సిట్టింగ్ ఎరేంజ్ చేసింది!" అతడు ఆలస్యం చేయదలచుకోలేదు. ఎందుకంటే ఆమె మహామొండి- తను చెప్పే మాటలు వినకుండా వెళ్ళినా వెళ్ళిపోవచ్చుని తెల్సు.

ఆ మాట వింటూనే అయోమయంగా కొద్ది క్షణాలపాటు అతడివంక చూసింది శ్యామల. తర్వాత 'సిట్టింగ్' అంటే ఏమిటో అర్థమయినట్లుగా ఒక్కసారిగా కళ్ళు మెరిపించింది. అది చాలు అతడికి ఫలితం లభిస్తున్నదని తెలుసుకోవటానికి!

"ఎక్కడ? " అడిగింది ఆత్రంగా, దానికి తానెంతో ఉత్సాహపడుతున్నట్లుగా.

వెంకట్ ఆలస్యం చేయలేదు. "హోటల్ చంద్రిక... రూం నంబరు 304... అంతా సరదా సరదాగా గడిపేయటమే!"

"ఫైన్! ఎవరెవరు వస్తున్నారు? "

"మన మిత్రులంతా! రాగిణే ఎరేంజ్ చేస్తున్నది అంటే సిట్టింగ్ ఎంత ఘనంగా ఉంటుందో చెప్పనక్కరలేదు గదా. డోంట్ మిస్సిట్. బహుశా హోటల్ వ్యాపారం మూడు పువ్వులూ ఆరుకాయల్లా నడుస్తున్న సందర్భంగా ఏర్పాటు చేస్తున్నదనుకుంటాను. ఇవ్వాళా రేపట్లో ఫోను రావచ్చు ఆమె దగ్గరనుండి నీకు!"

"తప్పకుండా వస్తాను, బై!" బయల్దేరదాం అన్నట్లుగా దూరంగా నిల్చొని ఉన్న డ్రైవర్ వంక చూచింది.

వెంకట్ ఖుషీ అయిపోయాడు ఆమె మాట తీరుకు. ఆరోజు సిట్టింగ్ అయ్యాక అందర్నీ పంపించేసి, తననూ, శ్యామలను ఒంటరిగా ఉండేలా చేయమని రాగిణికి చెప్పాలి. ఈ ఛాన్సును ఎట్టి పరిస్థితులలోనూ వదులుకోగూడదు!

అతడు చెప్పినట్లే అయింది. ఆ రాత్రే రాగిణి ఫోన్ చేసింది. "తరువాత మళ్లీ మరిచిపోతాను.. ఒక్కక్షణం తీరిక ఉండటంలేదు.. రేపు ఆదివారం సాయంత్రం మా హోటల్‌కు వచ్చేసేయ్.. సరదాగా ఓ గంట కాలక్షేపం. నేను సరిగ్గా కాలేజీకి రావటం లేదుగాని.. నువ్వెలా చదువుతున్నావ్? " అడిగింది నవ్వుతూ.





"నేనూ వెళ్ళటం లేదు!" అన్నది కీచు గొంతుకతో నీరసంగా శ్యామల.

★ ★ ★

మధ్యాహ్నం పదకొండు గంటలు దాటింది. ఎండ మండిపోతోంది. షామియానా కింద ఆనంద్‌తోపాటు చాలా మంది విద్యార్థులు కూర్చుని ఉన్నారు. వెంకట్ మిత్రబృందమంతా చెట్లకింద బండ్లమీదే కూర్చొని మామూలుగానే సిగరెట్ల పొగలు వదులుతూ వెకిలి మాటలతో చుట్టూ ఉన్న వాళ్ళను నవ్వులతో ముంచెత్తుతున్నారు. వెంకట్ ఆనందమే చెప్ప వీలుగాకుండా ఉన్నది. శ్యామల రావటానికి అంగీకరించటం అతడిని ఆకాశ వీధుల్లో తిప్పుతున్నది. వెంటనే రాగిణికి ఆ విషయం ఫోన్‌చేసి చెప్పాడు కూడా.

కాలేజీ లెక్చరర్లంతా ప్రిన్సిపాల్ గదిలోనూ, బయట వరండాలోనూ మాట్లాడుకుంటూ నిలుచున్నారు. అందులో చాలా మందికి జరిగింది బాధగానే ఉన్నది. లెక్చరర్లలో ఎక్కువమంది కిరణ్ అంటే సానుభూతి చూపిస్తున్నారు. ప్రిన్సిపాల్ ముందు ఏం మాట్లాడకున్నా, బయట మాత్రం అయనది చాలా తొందరపాటు చర్యగానే భావిస్తూ విమర్శిస్తున్నారు.

అప్పటిదాకా అక్కడే ఉన్న ట్రిబుల్ ఎక్స్ కెమేరామెన్, యాంకర్ ఓబీ వ్యాన్‌లోకి ఎక్కేశారు. అటు ప్రిన్సిపాల్‌గాని, ఇటు దీక్షాశిబిరంలోని విద్యార్థి నాయకులుగాని, సమస్య పరిష్కారానికి చొరవ చూపిస్తున్నట్లుగా కనబడటం లేదు. ఎవరికివారు బెట్టుమీదే కూర్చుని ఉన్నారు. కొత్త సమాచారాలేవీ లేకపోవటంతో వెళ్ళిపోవటానికే నిర్ణయించుకున్నారు.

ఆ వ్యాను నగరానికి మూడు కిలోమీటర్ల దూరంలోకి వచ్చింది. ట్రాఫిక్ అంతగా లేదు. యాంకరూ, కెమేరామెన్ సినిమాల విషయాలు మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు. అసిస్టెంట్లు వాళ్ళ మాటలు వింటూ ఆనందిస్తున్నారు.

వ్యాన్ మామూలు స్పీడ్‌లోనే వెళుతున్నది. ఎదురుగ్గా బహు వేగంగా వస్తున్న లారీని చూచి హారన్ కొడుతూ రోడ్డు పక్కకు తీశాడు డ్రైవరు. అక్కడంతా ఎత్తులూ పల్లాలతోనూ, కంకర గుట్టలతోనూ ఉన్నది. కాస్తంత దూరంలో చిన్న వంతెన. అతడు వ్యానును ముందుకు కదిలించలేక అక్కడే ఆపేశాడు.

లారీ దూసుకుంటూ వచ్చి వ్యాన్ పక్కగా ఆగుతుండగానే దానిమీద నుండి పదిమంది ఒక్కసారిగా కిందకు దూకారు. వాళ్ళంతా వ్యాన్‌మీద దాడిచేసి అద్దాలు పగలగొట్టారు. బిత్తరపోయి చూస్తున్న

> **కొత్తగాలి...**
>
> **మాటలో తీపితనం**
> **చేతలో దానధర్మం**
> **మంచి మనిషికి**
> **అసలు ఆభరణాలు**
>
> – వాసా ప్రభావతి,
> హైదరాబాద్

యాంకర్‌ను, ఇతర సహాయకులని, డ్రైవర్‌ని బయటకు లాగి చితక బాదారు. కెమేరాను ముక్కలు ముక్కలు చేశారు. వ్యాన్‌లోని ఎక్విప్‌మెంటుని పనికిరానంతగా ధ్వంసం చేశారు.

వ్యాన్‌లోనివాళ్ళు భయంతో వణికిపోతున్నారు. వాళ్ళు తొడుక్కున్న గుడ్డలు నెత్తుటితో తడిసి ముద్దవుతున్నాయి. తరువాత ఐదు నిముషాల్లోనే ఆ లారీ వాళ్ళను అలా వదిలేసి ముందుకు దూసుకుపోయింది.

★ ★ ★

రెండవుతుండగా ఆనంద్ కూర్చున్న

చోటుకి కాస్తంత దూరంలో ఓ స్కూటర్ ఆగింది. దానిమీద నుండి దిగుతున్న తండ్రిని చూస్తూన్న ఆనంద్‌కు ఆనందం కలిగింది. అంతకుమించి ఆయన వెనగ్గా తన వైపుకు అడుగులు వేస్తున్న తల్లి అమితాశ్చర్యాన్ని కలిగించింది.

వాళ్ళు సరాసరి ఆనంద్ దగ్గరకు వచ్చారు. "ఏమిటిరా ఇది.. ఎందుకు నీకీ లేనిపోని గొడవలు... చేసింది చాలు గాని... ఇంటికి వెళ్దాం పద! చదువును పాడుచేసుకోకపోతే ఏంటి? " అన్నారు ఇద్దరూ ఆత్రంగా.

ఆనంద్ మాట్లాడలేదు. వాళ్ళిద్దరూ మరింత దగ్గరగా వచ్చి అతడి పక్కగా

## కొత్తగాలి...



**డైటింగ్**
**ఒక్క భోజనంలోనే**
**మందుల విషయంలో కాదు!**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

కూర్చున్నారు. ఆ సమయంలోనే ప్రిన్సిపాల్ గదిలో నుండి ముగ్గురు లెక్చరర్లు వడివడిగా ఆనంద్ ముందుకు వచ్చి, "ప్రిన్సిపాల్‌గారు చేసిన తప్పును తెలుసుకొని రిజైన్ చేశారు. మిమ్మల్ని వెంటనే దీక్ష విరమించమంటున్నారు!" అన్నారు.

అంతకు పదినిముషాల క్రితం కాలేజీ మేనేజ్‌మెంటు నుండి ప్రిన్సిపాల్‌కు ఫోన్ వచ్చింది. "చిన్న విషయాలను కూడా సమర్థంగా నిర్వర్తించలేనివారు కాలేజీనేం నడుపుతారు! పేరు ప్రతిష్ఠలేం తీసుకురాగలుగుతారు? ఇలాంటివి సర్వీసులో ఎన్నో ఎదుర్కోవాల్సి ఉంటుంది. అప్పుడే మన తెలివి బయటపడేది. కాలేజీ భ్రష్టుపట్టిపోకముందే రిజైన్ చేసి వెళ్ళిపోవటం మంచిది. సామరస్య పూర్వకంగా ఈ సమస్యను ఎలా పరిష్కరించుకోవాలో మాకు తెలుసు. ఎలక్ట్రానిక్ హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంటు రంగనాథంగారికి ఛార్జి ఇవ్వండి వెంటనే!" అంటూ ఏకధాటిగా అటునుంచే మాటలు వినబడినయ్. మరుక్షణంలోనే రంగనాథంగారూ వచ్చి ఆయన ఎదురుగ్గా కూర్చున్నారు. దాని ఫలితమే ఆనంద్ దగ్గరకు ఆ ముగ్గురు లెక్చరర్ల రాక.

రామం వాళ్ళను చూస్తూనే లేచి నిలబడుతూ "ఆయన్ను రిజైన్ చేయాలని మేం కోరుకోవటంలేదే. కిరణ్‌ను డిబార్ చేస్తూ ఇచ్చిన ఉత్తర్వును ఉపసంహరించుకోవాలనేదే మా కోరిక. అది నెరవేరినప్పుడే దీక్షను విరమించేది. వెళ్ళి వారికి చెప్పండి!" అన్నాడు రామం.

తిరిగి ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళిపోయారు ముగ్గురూ, ఆ మాటలు చెప్పేందుకు.

ఉదయాన ట్రిబుల్ ఎక్స్ ఛానల్ చూస్తున్న ఆనంద్ తల్లి కొడుకు దీక్షకు కూర్చోవటాన్ని గమనించి కలతజెందింది. కొద్దిరోజుల క్రితం ఆమె తల్లీ తండ్రీ ఒకేసారి మరణించినప్పటి నుండీ జీవితంలో ఒంటరిదైపోయినట్లుగా భావిస్తూ కృంగిపోతున్న ఆమెకు కన్నకొడుకు ఇలా నిరాహార దీక్షకు కూర్చోవటం ఎంతో వేదనను కలిగించింది. ఏం చేయాలో తెలియని స్థితిలో తల్లిదండ్రులు పోయినప్పుడు భర్త వచ్చి తనను అనునయించటం పదేపదే గుర్తుకు వచ్చింది. ఆపైన ఆనంద్ కర్మ చేసినన్ని రోజులూ ఆయన పక్కనే కూర్చోవటం ఆమెను మరింతగా ఆలోచింపజేస్తున్నది ఈ మధ్యకాలంలో. ఆయన్నూ ఒంటరితనం వేధిస్తున్నట్లుగా తోస్తోంది ఆమెకు. మరే ఆలోచనా లేకుండా విడాకులు తీసుకున్నాక మొట్టమొదటి సారిగా తనంతట తాను

తన మాజీ భర్త సెల్‌కు కాల్ చేసింది.

అతడూ సెల్‌లో ఆమె నంబరు చూస్తూనే ఉద్విగ్నతకు లోనయ్యాడు.

"ముందు టీవీలో ట్రిబుల్ ఎక్స్ ఛానల్ చూడండి!" అంది తడబడుతూ.

"అదే చూస్తున్నాను!" అన్నాడు అతడూ నీరసంగా.

అలా మొదలయిన వాళ్ళ సంభాషణ ఫలితమే తరువాత గంటకు ఇద్దరూ కలిసి కొడుకును పరామర్శించటానికి రావటం, వాళ్ళు ఎంత బతిమిలాడినా అతడు మాట్లాడ లేదు.

లెక్చరర్లు వచ్చి వెళ్ళిన అరగంటకు తాత్కాలిక ప్రిన్సిపాల్‌గా ఛార్జి తీసుకున్న రంగనాథంగారు స్వయంగా వచ్చారు. పక్కన మరో లెక్చరర్ నిమ్మరసం గ్లాసును పట్టుకుని నిల్చొని ఉన్నాడు.

"కిరణ్‌ను డిబార్ చేసిన ఉత్తర్వులను ఉపసంహరించాం. మా మాట మన్నించి వెంటనే దీక్ష విరమించి కాలేజీ సవ్యంగా నడిచేలా చూడు!" అన్నారు ఆనంద్ భుజం మీద అనునయంగా చేయి వేస్తూ.

★ ★ ★

ఉదయం ఎనిమిది గంటలప్పుడు నెట్‌లో అమెరికాలో ఉన్న తమ్ముడు కనిపించి మాట్లాడటం మొదలుపెట్టాడు.

"ఏమైంది నీ అమెరికా ప్రయాణం? తేదీలు నిర్ణయిస్తే టిక్కెట్లు పంపిస్తాను!"

"వచ్చేనెల మొదటి వారంలో వద్దామను కుంటున్నాంరా. ఇద్దరం వస్తున్నాం. చెప్పాను గదా, శ్యామల బాగా డల్‌గా ఉంటున్నదని. ఈ సంవత్సరం చదువు మానిపించేశాను. అది మామూలు మనిషి అవ్వాలంటే వాతావరణం మార్పే మంచి దని డాక్టరు కూడా సూచించారు. నాదీ యాంత్రిక జీవితం అయినట్లుగా తోస్తోంది మీ బావగారు పోయింతరువాత మరీ. నాకూ రిలాక్స్ అవ్వాలనే ఉన్నది కొన్నాళ్ళ పాటు!" చిన్నగా నవ్వింది శాంతకుమారి.

"టిక్కెట్లు నువ్వు అక్కడ నుంచి పంపించటం దేనికి? నేనిక్కడ తెప్పిస్తానులే. ఈరోజే ట్రావెల్ ఏజెంటును పిలిచి ఫార్మాలిటీస్ పూర్తి చేయిస్తాను. మా ఇద్దరికీ పాస్‌పోర్టులు ఉన్నాయి కాబట్టి వీసాకు ఎక్కువ ఇబ్బంది ఉండకపోవచ్చు!

"వెల్‌కమ్. నువ్విక్కడ ఉండే రోజులన్నీ క్షణాల్లా గడిచిపోయేలా చూడటమే కాదు, శ్యామూ హుషారుగా ఇండియాకు వెళ్ళేలా చేస్తాను. అవునూ, దానికేమైనా సంబంధాలు చూడమంటావా.. చదువయిపోగానే పర్మినెంటుగా ఇక్కడకు వచ్చేయవచ్చు నువ్వా ఉద్యోగాన్ని చేసినంత కాలం చేశావ్.. వాలంటరీ తీసుకుందువుగాని!"

"అక్కడ ఎలాగూ నాలుగు నెలలు ఉంటాను గదా.. భవిష్యత్తును గురించి అప్పుడు తీరిగ్గా ఆలోచిద్దాంలే!"

'అక్కా నాదో కోరికే... నాన్న బతికున్నంత కాలం ఆయన చేతికో గడియారం ఉండేది. ఆయన దాన్ని ప్రాణంలా చూసుకునేవాడు. అదెక్కడున్నదో వెతికి, నడుస్తుంటే సరే, లేకపోతే అక్కడే బాగుచేయించి తీసుకువస్తావా? ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా నేను ఇంత దూరం వచ్చేశాను. ఆయన చివరకు నన్ను బెదిరించాడు కూడా, తనను కాదని వెళితే ఆస్తిలో పూచిక పుల్లకూడా ఇవ్వనని. అయినా ఆయన మాట వినకుండా వచ్చేశాననే బాధ అప్పుడప్పుడూ నన్ను తొలుస్తుంటుంది. ఆ గడియారం నువ్వు తీసుకువస్తే నువ్వున్న నాలుగు నెలలూ చేతికి పెట్టుకొని ఆయనతో గడిపిన నా జీవితాన్ని గుర్తుకు తెచ్చుకుంటానే అక్కా! నువ్వెళ్ళేటప్పుడు తీసుకువెళ్ళిపోదువుగాని! ఆయన కోపంతో ఎన్ని అన్నా నా మీద ఆయనకు ప్రేమ లేదని నేను ఎన్నడూ అనుకోను!"

"అది నిజంరా. ఆయన నీమాట వచ్చిన



ప్పుడల్లా కంట నీరు పెట్టుకునేవారు. ఆ గడియారాన్ని నేను మళ్ళా తీసుకువచ్చేయటం దేనికి.. అది నీదే. అంతేగాదు.. ఇక్కడ నీకు రావాల్సినవన్నీ నేను ఎంతో భద్రంగా చూసుకుంటున్నాను. నువ్వెప్పుడొచ్చినా వాటిని నీ కప్పగించేస్తాను!"

"ఆయనకు గౌరవమివ్వకుండా, ఇష్టానికి వ్యతిరేకంగా వచ్చేశాను. కనీసం ఆయన మాటకైనా గౌరవాన్ని ఇవ్వనీయ్. ఆయన ఆస్తిలో ఏదీ నాది కాదు. అన్నీ నీవే!"

తమ్ముడి మాటలకు శాంతకుమారి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లినయి.

★ ★ ★

ఉదయం పది గంటలవేళ ఇన్‌స్పెక్టర్ విజయ్ తన జీపును ఇంజినీరింగ్ కాలేజీ లేడీస్ హాస్టల్ ముందు ఆపి దిగాడు. హ్యాట్ తీసి చేత్తో పట్టుకొని వార్డెన్ కూర్చున్న గదిలో కాలుపెడుతుండగా వాచ్‌మన్ వచ్చి నమస్కరించాడు. అతడితో వచ్చిన ఇద్దరు కానిస్టేబుల్స్ గ్రిల్లు దగ్గరే నిలుచుండిపోయారు.

విజయ్ గదిలోకి వెళ్లి వార్డెన్ ఎదురు కుర్చీలో కూర్చున్నాడు. "మీ వాచ్‌మన్‌ను స్టేషన్‌కు తీసుకువెళుతున్నాను" అన్నాడు.

ఇద్దరూ గతుక్కుమన్నట్లుగా చూచారు అతడివంక.

"అతడినుండి కొన్ని విషయాలు తెలుసుకోవాలి.. మీరు స్ట్రిక్ట్‌గా ఉంటారు.. మీ వాచ్‌మన్ రాత్రిళ్లు మగపురుగును కూడా లోపలకు రానీయనంత జాగ్రత్తగా గ్రిల్లు దగ్గర కాపలా కాస్తుంటాడు.. అటువంటప్పుడు రాత్రిపూట సుస్మితను చంపి పైకల్లా మోసుకు వెళ్ళి కింద పడేయటం తోటి ఆడపిల్లల వల్ల అవుతుందా అనేది సందేహం. నా అనుమానం ఆ పనిచేసింది హాస్టల్లో ఉంటున్నవాళ్ళు కాదు.. ఎవరో బయటివాళ్ళే వచ్చారు!"

ఆ మాటలకు చారుమతి ముఖం తెల్లగా పాలిపోయింది. దిగులుగా అతడివంకే చూస్తున్నది. ఈ కేసు ఎటుపోయి ఎటు వచ్చి మెడకు చుట్టుకుంటుందో అని ఆమె భయం. అందులోను తను ఒంటరిది!

★ ★ ★

చక్రాయుధం

నమస్కారం. తప్పు చేసి తప్పించుకోవటానికి గుర్నాథమూ, కూర్మావతారమూ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమవ్వగా, నిందితుడు న్యాయస్థానంలో తలవంచక తప్పలేదు. నిజమే అతడికి శిక్షపడింది. కానీ ఆ తల్లీకూతుళ్ళకు అది ఓదార్పు అవుతుందా? దాంతో వాళ్ళ జీవితాలు బాగుపడతాయా? లేదు. మహిళా సంఘాలూ ఇన్నాళ్ళూ గుర్నాథాన్ని శిక్షించాలంటూ వాళ్ళకు అండగా నిలబడ్డమాట వాస్తవమే కానీ, ఇప్పుడు దానికి మించిన భారం మరొకటి కూడా ఉన్నది. తిరిగి ఆ తల్లీ కూతుళ్ళూ కొత్త జీవితాన్ని ప్రారంభించేందుకు మనమంతా మానసికంగా తోడ్పడాలి. అందుకు శక్తిమేర చేయూతనివ్వాలి.

మాదకద్రవ్యాల విక్రేతలను నిర్బంధించటాలు జరిగాయి. ఆ వివరాలన్నీ ఇప్పటికే వార్తా పత్రికలలోనూ, టీవీ ఛానల్స్‌లోనూ, ముఖ్యంగా ట్రిబుల్ ఎక్స్ ద్వారా అందరికీ తెలిసినయి కనుక మళ్ళా ప్రస్తావించటం లేదు. అయితే ట్రిబుల్ ఎక్స్ నగర విలేఖరి మీద దాడి చేసింది ఆ ముఠా సభ్యులేనేమో అనే అనుమానం కలుగుతుండగా పోలీసులు ఆ కోణం నుంచి విచారణ ప్రారంభించారు. మరోమాట! ట్రిబుల్ ఎక్స్ ఛానల్ ఎమ్డీకి ఆగంతకులు ఫోన్ చేసి, 'పిచ్చి పిచ్చి వార్తలు ప్రసారం చేయటం వెంటనే మానేసి, భక్తిగీతాలు పెట్టుకోండి. లేకపోతే మీ శిరచ్ఛేదన చేసి మీ ఆఫీస్ గుమ్మానికే వేలాడదీస్తాం' అంటూ బెదిరింపు ఫోనులు రాగా పోలీసులు మరింత అప్రమత్తమయ్యారు.

నగరంలోని ఇంజినీరింగ్ కళాశాల విద్యార్థులు సంఘీభావంతో అన్యాయాన్ని ఎదుర్కొని ఓ అమాయక ప్రాణిని రక్షించ గలిగారు. చెట్టుకింద జేరి తోటి విద్యార్థుల ను టీజింగ్ చేస్తూ హింసించే అడ్డగాడిద లను అరికట్టలేకపోయిన ప్రిన్సిపాల్, పరీక్ష హాల్లో ఓ విద్యార్థి కాళ్ల కింద ఎవరో పడేసిన కాగితం దొరికిందని ఆ అమాయ కుడిని డిబార్ చేసి వార్తల్లోకెక్కాడు. అది ఆయన ధైర్యమూ, ప్రతిభ కాదని, దాని వెనక పెద్ద కుట్రే వుందని తెలిసింది.

ఇసుక మాఫియా అనధికారికంగా యంత్రాల సాయంతో ఇసుకను దోచేస్తూ నీటి వనరులను నాశనం చేస్తున్నారని గతంలో చెప్పుకున్నాం. మూడు రోజుల క్రితం ప్రొక్లెయిన్లను సీజ్ చేయటానికి వెళ్ళిన అధికార్లను అక్కడి గుత్తేదారులు దుర్భాషలాడి కొట్టినంత పనిచేశారు. పై అధికారులు తమ కింది ఉద్యోగులను బల పరచకుండా మౌనం వహించటం వారికో వరమైంది. మరింత ఉత్సాహంతో దోచుకు నేందుకు పైనుంచి అనుమతి ఉందని ఆనందపడుతున్నారు. వాళ్ళ వెనుక ఉన్న రాక్షసుడు ఎక్కడ వేళ్ళూని కూర్చున్నాడో వెలికితీస్తేనేగాని వారి ఆట కట్టదు.

క్రితంసారి చక్రాయుధంలో 'సెజ్ భూమిలో విల్లాలు' అంటూ ముళ్ళకంచెను కదిలించటం జరిగింది. ఇప్పుడు ఆ వార్త డొంకనే ఊపేస్తున్నది. ఎవరికి వారు తమ పేరు బయటకు రాకుండా ఎలా జాగ్రత్తపడాలనీ ఎత్తులు వేస్తుంటే, అందులో ఇళ్ళు కొన్నవారు తేలుకుట్టిన దొంగల్లా లబలబలాడుతున్నారు. ఏం జరుగుతుందో వేచి చూద్దాం.

నగరంలో కొద్ది నెలల క్రితం 'అదృష్ట దీపిక' పేరుతో నడిబొడ్డున ఓ పెద్దషాపు వెలిసింది. ఎంచుకున్న ఏ వస్తువుకైనా దాని విలువలో నాలుగోవంతు ముందుగా చెల్లిస్తే ఇరవై ఒకటో రోజున ఆ వస్తువును ఇంకేమీ చెల్లింపు లేకుండానే ఇవ్వటం జరు

గుతుందంటూ నగరమంతా టాంటాం కొట్టారు. వేలంవెర్రిగా జనం వచ్చి డబ్బు కట్టారు. కొందరికి వారు చెప్పినట్లుగా వస్తువులు ఇచ్చారు కూడా. ఈ రోజున ఈ చక్రాయుధం చూచిన వెంటనే అలా డబ్బు కట్టి ఇంకా వస్తువులు తీసుకోనివారు, ఆ షాపును ముట్టడించండి. ఆ వ్యాపారవేత్త ఈ రాత్రికి దానిని మూసివేసి, అందులోని సామాన్లన్నింటినీ లారీలలో ఎక్కించుకొని, వసూలు చేసిన డబ్బుతోసహా పారిపోవా లని ఉన్నట్లుగా రూఢీగా తెలిసింది. తస్మాత్ జాగ్రత్త! శెలవ్!

★ ★ ★

"చక్రవర్తిగారూ! మీరు ఒకసారి హైదరాబాద్ రావాల్సి ఉంటుంది. వీరభద్రుడికి బెయిల్ ఇవ్వటానికి హైకోర్టు నిరాకరించింది! అతడి పేరున ఉన్న మీ పొలాల విషయంలో మరేదైనా మార్గం ఆలోచిద్దాం! కేసు హియరింగ్‌ను వచ్చేనెల మొదటి వారానికి వేశారు. ఆలోగా వస్తే మంచిది! వచ్చేముందు మాత్రం నాకు ఫోన్ చేయండి!" హైకోర్టు అడ్వకేట్ హైదరాబాద్ నుంచి ఫోన్ చేశాడు.

అవతల ఫోన్ పెట్టేసిన శబ్దమవ్వ టంతో తన చేతిలోని రిసీవర్ వంకే చూస్తూ ఆలోచనల్లో పడ్డాడు చక్రవర్తి. 'కోట్ల విలువ చేసే ఆ పొలాన్ని త్వరగా స్వాధీనంలోకి తెచ్చుకోవాలి' అనుకున్నాడు.

ఉదయం పదకొండు గంటలప్పుడు శాంతకుమారి తమ్ముడికి ఫోన్ చేసింది. అప్పుడు అమెరికాలో అర్ధరాత్రి అని తెలిసినా ఆనందంతో అక్కడ తెల్లవారేంతవరకూ ఆగలేకపోయింది. తన తమ్ముడు ఆ వార్త వింటే ఎంతగానో అనందిస్తాడు. అవతల ఫోన్ ఎత్తిన శబ్దం వింటూనే, "అరేయ్! అక్కయ్యనురా.. మాట్లాడుతున్నది!" అన్నది పెద్దగా.

"చెప్పక్కా!" మంచి నిద్రలో ఉండి విసుగ్గా ఫోనెత్తిన అతడు అక్క కంఠం వింటూనే లేచి కూర్చున్నాడు.

"సంతోషకరమైన వార్తరా! నాకు హైకోర్ట్ జడ్జిగా ప్రమోషన్ వచ్చినట్లు ఇప్పుడే తెలిసింది. తెల్లవారేదాకా నీకు చెప్పకుండా ఉండలేకపోయా. నిద్ర చెడగొడితే సారీ!" అందామె.

"చాలా సంతోషం అక్కా! ఎప్పుడు ఆ బాధ్యత స్వీకారం? "

"ఇంకా తెలియదు. ఒక నెల పట్టవచ్చులే. అందుకే వెంటనే అమెరికా వచ్చి నీ దగ్గర రెండుమూడు వారాలు ఉండి ఇక్కడ ఏ రోజు జేరాలో తెలియగానే వచ్చేద్దామనుకుంటున్నాను! మరో విషయం నేను హైకోర్ట్‌జడ్జిగా ప్రమాణస్వీకారం చేస్తున్నప్పుడు మీరంతా ఇక్కడ ఉండాలి!"

"అలాగే అక్కా! చాలా సంతోషం. ముందు ఇక్కడికొచ్చే ఏర్పాట్లు చూడు!"

ఫోన్ పెట్టేస్తుండగా ఆనంద్, శ్యామల ఆమె ఎదురుగా వచ్చి కూర్చున్నారు.

"ఆంటీ! ఓ వార్త. అది శుభమో, అశుభమో నాకయితే తెలియటంలేదు గాని రాత్రి అమ్మ తిరిగి నాన్న దగ్గరకు వచ్చేసింది!" అన్నాడు నవ్వుతూ.

"శుభవార్తే! అనుమానం దేనికి? "

"ఏం లేదు. కొట్టుకు చస్తూ, సిగ్గులేకుండా కోర్టుదాకా వెళ్ళి విడిపోయి, మళ్ళీ కలుస్తున్నారంటే ఆ ఇంటిని మరోసారి రావణకాష్టం చేయాలనా? " అతడి ముఖం ఎరుపెక్కింది ఆ మాటలంటున్నప్పుడు.

"సానుకూలంగా ఆలోచించు ఆనంద్.. అన్ని సంవత్సరాలు కలిసి కాపురం చేసిం తరువాత ఇప్పుడు ఒంటరితనం ఇద్దరినీ వేధిస్తూ ఉండవచ్చు అందునా మీ అమ్మ కయితే తల్లీదండ్రీ మరణించటం పెద్ద అగాథమే. అయితే నీ మకాం మారిపోతున్నదన్నమాట!"

"నాకు ఇష్టంలేదు ఆంటీ! ఆ సంసారం

ఎలా నడుస్తుందో కొద్దిరోజులు చూసి మారాలని. వాళ్ళయితే నామీద అన్ని విధాల ఒత్తిడి తీసుకు వస్తున్నారు! అంతే కాదు, మరొక విచిత్రమైన విషయం.. అమ్మ బామ్మనూ, తాతయ్యనూ అనాథాశ్రమం నుండి ఇంటికి తీసుకు వస్తుందట. ఇంట్లో వంటకు వంటమనిషిని, ముసలివాళ్ళకోసం ప్రత్యేకంగా ఓ మనిషినీ పెడుతుందట. అప్పటికీ వాళ్ళకు ఇబ్బందిగా ఉంటే తను ఉద్యోగం మానేస్తుందట!" అని పకపకా నవ్వుతూ లేచాడు.

అతడితోపాటు శ్యామలా లేచింది. "అమ్మా! నాకు అమెరికాలో కాలక్షేపానికి కొన్ని పుస్తకాలు కొని తెచ్చుకుంటాను, ఆనంద్‌తో వెళ్ళి!" అన్నది చిన్నగా.

"అక్కడ మనం రెండు మూడు వారాలకు మించి ఉండం. నేనూ త్వరగా వచ్చేయాలి. నన్ను హైకోర్టు జడ్జిగా నియమిస్తున్నట్లుగా తెలిసింది!" అన్నది సంతోషంగా.

"అభినందనలు ఆంటీ. చాలా సంతోషకరమైన వార్త! అయితే మీరు మా ఊరును, మమ్మల్ని వదలి వెళుతున్నారన్న మాట!" అన్నాడు ఆనంద్ దిగులుగా, శ్యామల వైపుకు ఓరగా చూస్తూ.

శ్యామలా, ఆనంద్ పక్కపక్కగా నడుచుకుంటూ వరండా మెట్లు దిగుతున్నారు. జంటగా వెళుతున్న వాళ్ళను చూస్తుంటే ఓ వింత భావన ఆమెలోని నరాలన్నింటినీ పట్టుకు కదిలించటమేగాకుండా కళ్ళు కాంతిమంతమవ్వటంతో వాళ్ళనే చూస్తూ వచ్చి పోర్టికోలో నిలబడింది, ఆ దృశ్యం ఆమెకు అపురూపంగా తోచగా! వాళ్ళు కారు వెనుక తలుపులు తీసి చెరొక వైపు నుంచీ ఎక్కారు. ఇక అక్కడ నిలుచోలేక పోయింది. వడివడిగా లోపలకు వచ్చి హాల్లో సోఫాలో కూర్చుంటూ కళ్ళుమూసుకున్నది. ఆనంద్‌నీ ఆమెరికా తీసుకువెళ్ళి తమ్ముడికి చూపించి, అతడూ సరేనంటే అల్లుడిగా ఎందుకు చేసుకోగూడదు?

★ ★ ★

శనివారం సాయంత్రం అయిదు గంటల సమయం. నగరంలోని అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ పోలీస్ ఛేంబర్‌లో రహస్య సమావేశం. దానికి రాష్ట్ర ఇంటెలిజెన్స్ శాఖ అధికారులు ఇద్దరు వచ్చారు. జిల్లా ఎస్పీ, నగరంలోని ఐదుగురు ఇన్‌స్పెక్టర్లు ఉన్నారు. సీబీఐ, యాంటీ నార్కోటిక్స్ శాఖ అధికారులు వచ్చారు.

"ఆపరేషన్ 'క్లీన్ స్వీప్'లో ఆరు బృందాలుంటాయి. ఒక్కటి తప్ప అన్నీ ఒక్కొక్క ఇన్‌స్పెక్టర్ ఆధ్వర్యంలో ఉంటాయి.

ఆయనకు సహాయంగా సబ్ ఇన్‌స్పెక్టర్, ఇరవైమంది సాయుధ పోలీసులు ఉంటారు. అవసరమొస్తే కాల్పులు జరపటానికి కూడా జంకవద్దు. 'క్లీన్‌స్వీప్'లో పాల్గొనేది ఐదు టీమ్‌లే. ఆరోటీమ్ రిజర్వ్‌లో ఉండి ఎక్కడ సాయం కావాల్సి వస్తే అక్కడకు పరుగెడుతుంది. ఈ టీమ్‌లు కాక హెడ్‌క్వార్టర్స్‌లో రెండు వందలమంది సాయుధ రిజర్వ్ పోలీసులు పది వెహికల్స్‌తో తయారుగా ఉంటారు!"

అందరూ అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ పోలీస్ చెప్పే మాటలను ఉత్కంఠతో వింటున్నారు.

"డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ ప్రశాంత్ ఆధ్వర్యంలో ఆపరేషన్ 'క్లీన్‌స్వీప్' నిర్వహించబడుతుంది!"

ప్రశాంత్‌మీద సస్పెన్షన్ ఆరోజు మధ్యాహ్నం ఎత్తివేయటమే గాకుండా డీఎస్పీగా పదోన్నతి ఇవ్వటం, అతడు చార్జి తీసుకోవటం కూడా జరిగిపోయాయి.

"రాత్రి ఎనిమిది గంటలకు ఆపరేషన్ 'క్లీన్‌స్వీప్' ప్రారంభమవుతుంది. అన్ని కేంద్రాల మీద దాడి ఒకేసారి జరగాలి. అనుమానితులెవరూ తప్పించుకుపోయే

వీలులేకుండా చాలా పకడ్బందీగా ప్రశాంత్ ప్రణాళికను తయారు చేశాడు. మీరు దానిని అమలు పరచటంలోనే మీ శక్తి యుక్తులన్నీ ప్రదర్శించాలి!" అన్నాడు ఏసీపీ తన ముందున్న ఆఫీసర్లతో.

"ఇప్పుడు ప్రశాంత్ ఎవరెవరికి ఏయే విధులు అప్పజెబుతున్నదీ చెబుతాడు"

ఎవరు చేయాల్సిన పనులు వాళ్ళకు అప్పజెప్పి పంపేటప్పటికి ఏడు గంటల పైన ముప్ఫయ్ నిముషాలయింది. ప్రశాంత్ బయటకు వచ్చి జీపెక్కగానే అది రయ్‌న ముందుకు దూసుకుపోసాగింది. దానివెనక ఏసీపీ కారు, సూపరింటెండెంట్ కారు బయల్దేరినయి. వాటి వెనుక రిజర్వు పోలీసులతో నిండివున్న నాలుగు వ్యాన్లు. వారి వాహనాలన్నీ నగర శివార్లలోకి రావటానికి అరగంట పట్టింది. హైవేమీద అవి కొంతదూరం వెళ్ళిన తరువాత రోడ్డు దిగి కచ్చారోడ్డులో పయనించసాగినయి. దీపాలు లేని రోడ్డు. రెండు వైపుల పెద్దపెద్ద చెట్లు. వాటి మొదళ్ళలో గుబురుగా పెరిగిన పిచ్చి మొక్కలు. వాటి మీద ఎగురుతున్న మిణుగురు పురుగులు. నరసంచారం లేని బాట.

ఆ బాటలో పావుగంట ప్రయాణిస్తేనే గాని దీపాలు కనబడలేదు. అనాథాశ్రమం దాపులోకి వచ్చేటప్పటికి సరిగ్గా ఐదు నిముషాలు తక్కువ ఎనిమిది గంటలయింది. జీపు, కార్లు ఆగినయి గాని ఎవ్వరూ దిగలేదు. తరువాత కొద్ది నిముషాల్లోనే మరో ఐదారు కార్లు వచ్చి వాళ్ళ పక్కగా ఆగినయి. అందులో సీబీఐ అధికారులు, యాంటీ నార్కొటిక్స్ శాఖ అధికారులు, హైదరాబాద్ నుంచి వచ్చిన ఇంటెలిజన్స్ శాఖ అధికారులు ఉన్నారు.

అందరూ వాహనాలను అక్కడే ఉంచి దిగి కాలినడకన బయల్దేరారు. వాళ్ళంతా ఆ ఆశ్రమం గేటు దగ్గరకి రావటానికి మూడు నిముషాలు పట్టింది. గేటు దగ్గర అటూ ఇటూ సిమెంటు దిమ్మెలు తప్ప, చుట్టూ అంతా ఇనుపముళ్ళ కంచె వేసి ఉన్నది. దాని లోపలకు వెళ్ళాలన్నా బయటకు రావాలన్నా ఆ గేటు ఒక్కటే దారి. గేటు దగ్గర ఇద్దరు కాపలా ఉన్నారు. వాళ్ళు నోరు తెరిచి వీళ్ళను ప్రశ్నించే లోగానే నలుగురు పోలీసు జవాన్లు ముందుకు వచ్చి వాళ్ళ రెక్కలు వెనక్కు విరిచి తీసుకువెళ్ళి వ్యాన్ ఎక్కించారు.

వ్యాన్లలో నుంచి దిగిన రిజర్వు పోలీసుల్లో సగం మంది ఆశ్రమాన్ని అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టారు. కొందరు లోపలకు వెళ్తున్న ఆఫీసర్ల వెనుకే నడుస్తున్నారు. అవసరమొస్తే ఉపయోగించేందుకు వీలుగా తుపాకీలు చేబూనారు.

ఒక్కసారిగా వస్తున్న అంతమందిని చూస్తూనే ప్రధాన కుటీరం ముందు కూర్చొని ఉన్న బాలరాజు వడివడిగా అడుగులు వేస్తూ వాళ్ళ దగ్గరకు వచ్చాడు. కొత్తవాళ్ళు లోపలకు వస్తుంటే గేటు దగ్గరనుంచి తనకు సిగ్నల్ అందుతుంది. అది రాకపోవటం అతడికి వింతగా తోచి భ్రుకుటి ముడిపడింది.

అందరికంటే ముందున్న ప్రశాంత్‌ను చూస్తూనే ఉలిక్కిపడ్డ అతడికి వెనకాల ఉన్న పోలీసు బలగమంతా కనబడింది.

## కొత్తగాలి...

**అక్షరాలే అస్త్రాలు**
**అక్షౌహిణీల సైన్యాలు**
**కదిలించే శకటాలు**
**ఆలోచనల బావుటాలు**

– వి. సూర్యారావు,
అనకాపల్లి

చటుక్కున వెనక్కు తిరిగి పరుగెత్తబోయాడుగాని అప్పటికే ప్రశాంత్ అతడిని పట్టుకొని ఓ ఇన్‌స్పెక్టర్ వైపుకు తోస్తూ, "వ్యాన్‌లో ఎక్కించు!" అంటూ కదిలాడు.

ప్రశాంత్ సరాసరి చక్రవర్తి కుటీరం తలుపు దగ్గర నిలుచున్నాడో లేదో లోపల నుండి ఐదారుగురు బయటకు వచ్చి "ఎవరు కావాలి? " అన్నారు.

"చక్రవర్తిగారిని పిలువు!"

"వారు వెనుక గదిలో భోజనం చేస్తున్నారు. ఇప్పుడు ఎవ్వరినీ కలవరు!" అన్నాడు అందులో ఒకతను దురుసుగా.

"అయితే మేమే వెళతాం లోపలకు!" అంటూ లోపలకు అడుగులు వేస్తుండగానే

కొత్తగాలి...

**బొగ్గు మసి**
**ప్రధాని పరువు**
**నుసి!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

చక్రవర్తే బయటకు వచ్చాడు.

"ఎస్. ఎవరు? ఏం కావాలి? " అరుస్తున్నట్లుగా అడిగాడు. డ్రస్‌లో ఉన్న ప్రశాంత్‌ను చూస్తూనే గుర్తించాడు. అతడి వెనగ్గా ఉన్న ఏసీపీని గుర్తించాడు. ఎస్పీని గుర్తించాడు. అతడికి ఏమీ అర్థం కాలేదు. సస్పెన్షన్‌లో ఉన్న ప్రశాంత్ తనకు తెలియకుండా డ్రెస్‌లోకి మారటమే కాకుండా అందరినీ తీసుకొని వచ్చాడంటే? నుదుటి మీద చిరుచెమటలు పట్టాయి.

"ఆశ్రమం సెర్చ్ చేయటానికి వచ్చాం సార్. ఇదుగోండి వారంట్!"

తనని తాను నిబ్బరించుకుంటూ పెద్దగా నవ్వాడు. "ఆశ్రమంలో సెర్చ్ చేసేందుకు ఏముంటాయి ప్రశాంత్? అల్యూమినియం చిప్పలు తప్ప!" అన్నాడు.

"అలా కూర్చోండి.. మాట్లాడదాం. అసలు విషయమేమిటి? దేనికోసం వెతకాలనుకుంటున్నారు? " అంటూనే సెల్‌ఫోన్ చేతిలోకి తీసుకొని నంబరు నొక్కసాగాడు.

ఎస్పీ ముందుకు ఓ అడుగువేసి, "సారీ సార్! మీరిక్కడి నుండి ఎవ్వరికీ ఫోన్ చేయటానికి వీల్లేదు, ప్లీజ్!" అన్నాడు.

"ఏమిటీ దౌర్జన్యం? " అరుస్తున్నట్లుగా అడిగాడు ఆయన. ఓ పక్కగా ఆయన శిష్యులంతా వాళ్ళ మాటలకు కుతకుతా ఉడికిపోతున్నారు. లోపలకు వచ్చిన పోలీసులు వాళ్ళందరినీ చుట్టుముట్టి ఉన్నారు.

"బాలరాజు ఎక్కడ? " వాళ్ళను అడిగాడు అరుస్తున్నట్లుగా చక్రవర్తి.

వాళ్ళు నోరు తెరిచేలోగానే "వ్యానులో కాళ్ళు బారజాపుకు కూర్చున్నాడు!" అన్నాడు ప్రశాంత్.

ఆ మాట వింటూనే చక్రవర్తికి సగం ప్రాణం పోయింది. నిలువు గుడ్లేశాడు. 'అంటే తను ఊహించలేని రీతిలో చాల పెద్దఎత్తులోనే వచ్చారన్నమాట!'

ప్రశాంత్ కానిస్టేబుల్స్‌ని చూస్తూ "ఇక్కడున్న అన్ని కుటీరాల్లోనూ నేలమీద పరిచిన బండల్ని పగలగొట్టాలి. లోపల రహస్యమాళిగలు ఉంటాయి! ఎవరు అడ్డు వచ్చినా తీసుకెళ్లి వ్యాన్‌లో పడేయండి!"

"నో.. నో. అక్కడ మీరనుకుంటున్నట్లుగా ఏమీలేవు. వాటిని పగలగొడితే మాత్రం ఊరుకోను. కావాలంటే గదుల్లో వెతికి మీకు కావాల్సినవి దొరికితే తీసుకు వెళ్ళండి" కోపంతో ఊగిపోతూ చక్రవర్తి ముందుకు దూసుకువస్తూ అన్నాడు.

"చక్రవర్తిగారు! మాతో సహకరించకపోతే ముందుగానే మిమ్మల్ని అరెస్ట్ చేయాల్సి ఉంటుంది. ఇప్పటికే హత్య

కేసులో మీ పుత్రుడు మా నిర్బంధంలో ఉన్నాడు. మాదక ద్రవ్యాల కేసులో మీ కూతురు బేడీలు వేయించుకున్నది. కృష్ణ ఒడ్డున మీ ప్రాక్లైయిన్లనన్నింటినీ అదుపులోకి తీసుకున్నాం! అక్కడి మీ శిష్యబృందమంతా మా బందీలై ఉన్నారు!"

తరువాత అరగంటలోనే ఆ ఆశ్రమ ఆవరణలోని అన్ని కుటీరాలలోనూ నేల మాళిగలను తెరవటం జరిగిపోయింది.

అక్రమ ఇసుక రవాణాలో సంపాదించిన ధనంతో కొన్న బంగారు బిస్కెట్లు, వెండీ కడ్డీలనూ చూస్తున్న అధికారులకు కళ్ళు తిరిగినంత పనయింది. వాటిని అట్టపెట్టెల్లో చక్కగా సర్ది భూమిలో పాతిపెట్టి ఉంచారు. వాటి విలువ కొన్ని వందల కోట్లు ఉంటుంది. ఇక అనాథబాలలంటూ ఉంచిన కుటీరాల్లో మాదక ద్రవ్యాలు ముఖ్యంగా రెండు కేజీల కొకైన్, దాన్నే అరగ్రాము, పావుగ్రాముగా కట్టిన చిన్న చిన్న పొట్లాలు, కొన్ని చోట్ల పొగాకు తీసివేసి గంజాయి నింపిన సిగరెట్లు దొరికినయి. వాటిన్నిటిని వ్యాన్లలో జేర్చటానికి అక్కడకు వచ్చిన అధికారులకు రెండు గంటలు పట్టింది. వాటితోపాటే చక్రవర్తితో సహా అక్కడున్న అందరినీ వ్యానులలో ఎక్కించారు.

★ ★ ★

ఉదయం ఎనిమిది గంటలు. పోర్టికోలో నిలబెట్టి ఉన్న కారులో వెనుక సీట్లో శాంతకుమారి, శ్యామల కూర్చున్నారు. ముందు డ్రైవరు పక్కన ఆనంద్ కూర్చున్నాడు. అందరూ చెన్నయ్ వెళుతున్నారు. అక్కడ రాత్రి పది గంటలకు అమెరికా వెళ్ళే విమానం ఎక్కాలి వాళ్ళు.

"అదేమిటి.. నిన్నెందుకు తీసుకు వెళుతున్నది అమెరికా ఆమె?" తల్లి అడిగింది ఆనంద్‌ను, వారం రోజుల క్రితం అతడు ఆ విషయం చెప్పగానే.

"శెలవులే కదా? వస్తావా అంది.. ఎందుకు ఆంటీ డబ్బు ఖర్చు అన్నాను.. దాన్ని గురించి ఆలోచించవద్దు.. శ్యామ లకు మరో జీవితాన్నిచ్చి నాకు ఎంతో మనశ్శాంతిని కలిగించావ్.. వాటిముందు ఈ మాత్రం డబ్బు నీకోసం ఖర్చుపెట్టడం నాకు భారం కాదు అన్నది.. అమ్మానాన్న లను అడిగి చెబుతానన్నాను!"

తల్లి నవ్వింది. "నిన్ను తన అల్లుడిగా చేసుకోవాలనుకుంటున్నదా ఏమిటిరా? "

"నాకయితే తెలియదు.. ఆమెకు అలాంటి ఉద్దేశ్యమే ఉండాలిగాని శ్యామ లకు మించిన మరోపిల్ల నాకు భార్యగా ఇంకెక్కడ దొరుకుతుంది? "

కళ్ళు పెద్దవి చేసుకొని తల్లీదండ్రీ అత డినే చూస్తూ ఉండిపోయారు.

శాంతకుమారి తమ్ముడూ అదే ప్రశ్న వేశాడు, "తమ్ముడూ! శ్యామల స్నేహితు డిని కూడా తీసుకు వస్తున్నానురా నాతో పాటు. పదిహేను రోజులే గదా అని. నీకేం ఇబ్బంది ఉండదు కదా!" అంది.

అతడూ నవ్వుతూ "కాబోయే అల్లుడా ఏమిటి? " అన్నాడు.

"ఇంతవరకయితే శ్యామలను కాని, అత డినికాని అడగలేదు.. నువ్వు చూసి ఓకే అంటే వాళ్ళిద్దరినీ అడిగి, వాళ్ళూ సరేనంటే పచ్చజెండా ఊపేయటమే! శ్యామల ఆనందం కంటే నాకు కావాల్సిందేమున్న దిరా? " అన్నది నవ్వుతూ.

వాళ్ళు ఎక్కిన కారు వెళ్ళిపోయింది.

ఆనంద్ తండ్రి స్కూటర్ స్టార్ట్ చేశాడు. భార్య వెనకాల ఎక్కి అతడికి ఆనుకు కూర్చున్నది. ఇద్దరూ కలిసి ఉండటం వాళ్ళకు ఇప్పుడు ఎంతో ఆనందాన్ని కలిగి స్తోంది. అటు ఇంట్లో పెద్దవాళ్ళు ఉండ టమూ ఇంటికి ఒక కళను తెచ్చింది.

★ ★ ★

చక్రాయుధం

నమస్కారం. చక్రాయుధం ఆవిర్భావా నికి కారణం- ఒకనాడు చెడు స్నేహాలతో, మాదకద్రవ్యాలతో మత్తులో మునిగి, చదు వును నిర్లక్ష్యం చేసి, తల్లిదండ్రుల చేతే 'ఛీ' అనిపించుకున్న ఇంజనీరింగ్ కాలేజ్ విద్యార్థి రామం అంటే ఎవ్వరూ నమ్మకపో వచ్చు. తన తప్పిదాన్ని తాను తెలుసుకొని బాగుపడటమే గాకుండా, సమాజ ప్రక్షాళ నకే పూనుకోవటం గుండె నిబ్బరం కలిగిన మనిషే చేయగలుగుతాడు. అతడికి చేయూతనిచ్చి మంచిమార్గాన పెట్టి ప్రోత్స హించింది, తోటి విద్యార్థి ఆనంద్! ఒక విధంగా చక్రాయుధాన్ని తీసుకురావటానికి వాళ్ళను ఉత్తేజపరిచింది అన్నాహజారే లాంటి మహోన్నత వ్యక్తుల మాటలే!

త్వరలో చక్రాయుధాన్ని వారపత్రికగా తీసుకురావాలనేది ఆ ఇద్దరు మిత్రుల దృఢ సంకల్పమే కాదు, వాళ్ళకు ఈ యజ్ఞంలో దన్నుగా నిలిచిన ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థులు, అజ్ఞాతంగా వుండి వన రులను సమకూరుస్తూ, ఉన్నతాశయాలతో సంఘాన్ని ప్రక్షాళన చేయాలనుకుంటన్న కొందరు పెద్దలూ కోరుకుంటున్నారు.

అందరికీ చక్రాయుధం వినమ్రంగా శిరస్సు వంచి నమస్కరిస్తోంది.

చిట్టచివరకు ఎట్లాగైతేనేం పోలీసులు హుక్కాకేంద్రాల మీద దాడిచేసి వాటి నిర్వాహకులను నిర్బంధించగలిగారు. ఆశ్చ ర్యకరమైన విషయం ఏమిటంటే అక్కడ జేరిన వాళ్ళంతా బాగా డబ్బున్నవాళ్ళ పిల్లలూ, పెద్దపెద్ద ఉద్యోగస్తుల పిల్లలూ. వాళ్ళ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని వివరాలను గుప్తంగానే ఉంచుతున్నాం. వాళ్ళు చేస్తున్న తప్పు తెలుసుకొని మంచి మార్గానికి మరలుతారనేది మా విశ్వాసం.

ఇసుక మాఫియా మీద దాడులు, మాద కద్రవ్యాల విక్రేతలను నిర్బంధించటం గురించి క్రితం చక్రాయుధంలోనే చెప్పుకో

వటం జరిగింది. ఆపైన మా అనుమానాలు నిజమయ్యాయి. ఆ మాఫియానే ట్రిబుల్ఎక్స్ ఛానల్ ఓబీ వ్యాన్ మీద దాడిచేసి, విలేఖరిని, కెమేరామేన్‌నూ కొట్టటమే కాకుండా, అందులోని ఎక్విప్‌మెంట్‌నంతా ధ్వంసంచేసి, దాని ఎమ్డీని బెదిరించారనేది రుజువవ్వటంతో పోలీసులు కేసులు నమోదు చేసి అనుమానితుల్ని కస్టడీలోకి తీసుకున్నారు.

ఇంజనీరింగ్ కాలేజిలో మొదటి సంవత్సరం చదువుతున్న విద్యార్థిని సుస్మితను వివాహం చేసుకుంటానని మాయమాటలు చెప్పి అనుభవించి, మోసం చేసిన జయంత్‌ను, ఆ అమ్మాయి ఎదురు తిరిగి రోడ్డు మీదకు ఈడుస్తానంటూ బెదిరించటంతో హత్య చేసిన అతడు, అందుకు సహకరించిన హాస్టల్ వార్డెన్ చారుమతి కటకటాల వెనుక కూర్చొని విశ్రాంతి తీసుకుంటున్నారు. అతడి చెల్లెలు రాగిణి మాదకద్రవ్యాల ప్రభావంతో మానసికంగా పతనమై ఆసుపత్రిలో చికిత్స పొందుతోంది.

కాలేజి చెట్టుకింద కూర్చొని తోటి విద్యార్థులను ఏడిపిస్తుండే ముఠా నాయకులయిన వెంకట్, రాజులు ప్రస్తుతం అజ్ఞాతంలోకి వెళ్లిపోయారు. జయంత్, రాగిణుల పుట్టుకకు కారణభూతుడైన ప్రముఖ వ్యాపారస్తుడు, విద్యాసంస్థలకు ఛైర్మన్ అయిన చక్రవర్తి అనాథల బాగుకోసం తాపత్రయ పడుతున్నట్లు నాటకమాడుతూ, వాళ్ళచేతే మాదకద్రవ్యాలను పంపిణీ చేయిస్తూ, దానికి ఆశ్రమాన్నే కేంద్రంగా చేయటంతో జైలు పాలవ్వక తప్పలేదు.

కుటుంబ ఉన్నతికీ, పతనానికీ ఇంటి యజమానే మూలమని ఆయన నిరూపించాడు! అలాగే మనిషి నిష్ఠగా ఉంటే ఏమైనా చేయగలడు అనేందుకు నిదర్శనం ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్. అతడు దేనికీ వెరవని మనిషి. ఏ ప్రలోభాలకూ లొంగని మనిషి. కనుకనే ఇబ్బందులతో అవమానాల పాలయినా విజయం సాధించగలిగాడు. తన వ్యక్తిత్వమేమిటో నిరూపించుకోగలిగాడు. అతడి నిజాయితీని గుర్తించిన పైఅధికారులు అతడికి పదోన్నతి కలిగించారు. ప్రశాంత్‌లాంటి వ్యక్తులతో తమ శాఖను బలపరుచుకుంటున్నందుకు వారిని హృదయపూర్వకంగా అభినందిద్దాం.

నగరానికి ఉత్తరాన నాలుగెకరాల భూమిని ప్లాట్లుగా చేసి విక్రయించబోతున్నారు. కావాలంటే ఇళ్ళుకూడా నిర్మించి ఇస్తారట. బ్యాంకులనుండి అప్పులు ఏర్పాటు చేస్తారట. అక్కడే వారి కార్యాలయం కట్టేందుకు ఓ ప్రముఖ రాజకీయ నాయకుడి చేత భూమిపూజను ఈ ఉదయం పదిగంటలకు చేయిస్తున్నారు. నగరవాసులారా! అందులో ప్లాట్లు ఎవరూ కొనబోకండి. అది ప్రభుత్వస్థలం. ఎనభై సంవత్సరాల క్రితం వరకూ అది స్మశాన భూమి. ఇప్పటికీ ఒక మూల శిథిలావస్థలో ఉన్న సమాధులు కనబడుతుంటాయి. అది కబ్జాచేసిన ఘనుడు ఓ భూబకాసురుడు!

ఒక అన్యాయాన్ని ఎదురించలేకపోవటం వంద అన్యాయాలు చేసిన దానితో సమానం. మన సంఘీభావమే మనకు రక్ష. చెడును ఎదుర్కోవటానికి మానసికంగా ధైర్యం లేకపోతే మీ పేరూ, ఊరూ రహస్యంగానే ఉంచి వివరాలను మాత్రం చక్రాయుధంకు తెలియబరచండి. మా సభ్యులు దాన్ని తవ్వితీసి బట్టబయలు చేయటానికి ప్రయత్నిస్తారు. మనందరం సుఖమైన జీవితాన్ని గడపాలనేదే చక్రాయుధం ఆదర్శం.

దీన్ని వారంవారం కొని చదవండి. కొనలేని వాళ్ళకిచ్చి చదివించండి. మీ చేయూతే మనందరికీ శ్రీరామరక్ష. ©



# చతుర ప్ర.జ.



పాఠకుల ప్రశ్నలకు
అవధాన సరస్వతి
డా. మేడసాని మోహన్
సమాధానాలు

ప్ర. ద్రావిడ వేదాలు అంటే ఏమిటి? అవి ఎలా వచ్చాయి?

– పి. గోవిందరావు, ఆల్విన్ కాలనీ, హైదరాబాద్

జ. ద్రవిడ దేశంలో అవతరించిన పంద్రెండు మంది ఆళ్వారులు శ్రీమన్నారాయణుని స్తోత్రంగా చెప్పిన పాశురాలను ద్రవిడ వేదం అంటారు. పాశురాలంటే, తమిళంలో పద్యాలు లేదా స్తుతిగీతాలు. ఈ పన్నిద్దరు ఆళ్వారులు చెప్పిన పాశురాలు నాలుగువేలు ఉంటాయి. ఈ నాలుగు వేల పాశురాలను 'నాలాయిర దివ్య ప్రబంధం' అనీ 'ద్రావిడ వేదాలు' - అని పేర్కొం టారు. ఋగ్వేదాదులకు ఎంత ప్రాధాన్యం ఉన్నదో ఈ ద్రావిడ వేదాలకు కూడా అంతటి ప్రాధాన్యం ఉంది.

ప్ర. 'న కార్తీక సమో మాసః' కార్తీక మాసా నికి అంత విశిష్టత ఎలా వచ్చింది?

– నోముల సురేందర్‌రావు, హబ్సీగూడ, హైదరాబాద్

జ. కార్తీక మాసానికి విశిష్టత కలిగించే కార ణాలు ప్రధానంగా రెండు. (1) యోగనిద్ర నుండి మేల్కాంచిన శ్రీమన్నారాయణుడు పరమ పదంలో శేషశయ్యపై తన లీలామంగళ దివ్య మూర్తితో సనక సనందనాదులకు సాక్షాత్కరించి అనుగ్రహించడం. ఈ పర్వదినమే ఉత్థాన ఏకా దశి. వెంటనే 'నామ సంకీర్తనం యస్యం సర్వ పాప ప్రణాశనమ్'- అన్న శ్రీమద్భాగవత సూక్తిని నిరూపించే కైశిక ద్వాదశి కూడ వస్తుంది. (2) కార్తీక దీపాలు వెలిగించుకోవడం- అంటే అజ్ఞా నాంధకారం నుండి సుజ్ఞానమనే వెలుగులోకి రావడం. కార్తీక స్నానాల ఆంతర్యం ఏమిటంటే జీవులు దేహ సంబంధమైన, ఆత్మ సంబంధ మైన అన్ని దోషాలు ప్రక్షాళన చేసుకోవడం. ఈవిధంగా అభిషేక ప్రియుడైన శివునికి, అలం కార ప్రియుడైన శ్రీమన్నారాయణునకు సంబం ధించిన ముఖ్యమైన ఐతిహ్యాల కారణంగా కార్తీక మాసం ఎంతో వైశిష్ట్యాన్ని సంతరించుకొంది. సమాజంలో సంఘీభావం పెంపొందాలనే భావంతో పెద్దలు ఏర్పరచిన సంప్రదాయమే కార్తీక వనభోజనాలు.

ప్ర. నర్మదా నదికి పుష్కరాలొచ్చాయి కదా! ఈ సంవత్సరమంతా పెద్దలకు పిండ ప్రదానాలు నర్మదా నదీ తీరంలోనే చేయాలా? ఎక్కడ చేసినా నర్మదా నది సన్నిధి అని చేసుకుంటే సరి పోతుందా? అంత్యపుష్కరాల సమయంలో నర్మదా నది తీరంలో చేయవచ్చా?

– కరణం శివానందరావు, బెంగళూరు

జ. నర్మద- అన్న నదీమతల్లి నామధేయాన్ని ఎక్కడ మనస్సులో స్మరించినా, నర్మద నదీ సాన్నిధ్య ఫలం ప్రాప్తిస్తుంది. పెద్దలకు పిండ ప్రదానాలు ఎక్కడ చేసినా ఆ స్మరణచేత నర్మదా నదీ తీరంలో నిర్వహించిన విశేషఫలం లభి స్తుంది. అవకాశం ఉన్నవారు అంత్య పుష్కరాల సమయంలో నర్మదానదీ తీరంలో చేసుకోవచ్చు.

ప్ర. శ్రీమద్రామాయణంలో గౌతముడు అహ ల్యకు ఇచ్చిన శాపమేమిటి? శిలగా మారిపొ మ్మనా? అదృశ్య రూపంలో సంచరించమనా?

– డా. సి. జనార్దనసింగ్, నల్లకుంట, హైదరాబాద్

జ. శ్రీమద్రామాయణంలో గౌతమ మహర్షి అదృశ్యరూపంలో ఉండవలసినదిగానే అహల్యను శపించినాడు. అదృశ్యరూపములోనున్న అహల్య శ్రీరాముని ఆగమనంతో శాపవిమోచనం పొంది దివ్యతేజస్సుతో ప్రకాశించినది- అని వాల్మీకి రామాయణం పేర్కొంటూ ఉన్నది. అదృశ్యరూప

ములోనున్న అహల్య ఒక శిలను ఆవహించి యుండగా శ్రీరాముడు ఆ శిలను తన పాదముతో స్పృశించి శాపవిముక్తి కల్గించినట్లుగా అధ్యాత్మ రామాయణం పేర్కొంటూ ఉన్నది.

ప్ర. మంచి ముహూర్తాలు చూసి, జాతకాలు పరిశీలించి, అటు ఏడుతరాలు.. ఇటు ఏడుత రాలు నిర్ధారణ చేసుకొని మరీ వివాహాలు జరి పించినా కాపురాలు కూలిపోతున్నాయి.. కారణం?

– అద్దంకి సీతాదేవి, మలక్‌పేట, హైదరాబాద్

జ. ఎన్ని ముహూర్తాలు చూచినా, ఎన్ని తరాలు పరిశీలించినా, ఎన్ని జాగ్రత్తలు తీసికొని వివాహములు చేసినా, ఆయాజీవుల కర్మబంధా లకు సంబంధించిన ఆగామి, ప్రారబ్ధం, సంచితం ఉన్నాయి కదా! కాబట్టే ముహూర్తబలాలు, గ్రహ బలాలకంటే దైవబలం గొప్పది- అన్న విశ్వాసం అందరికీ మేలు చేస్తుంది.

ప్ర. పాతబడిన దేవుని ఫొటోల స్థానంలో కొత్తఫొటోలుంచి పూజ చేస్తున్నాం. పాత ఫొటో లను ఏం చేయాలి?

– ఎస్. విజయలక్ష్మి, ఒంగోలు, ప్రకాశం జిల్లా

జ. కొత్త ఫొటోలు ఉంచినప్పుడు, పాతవానిని పెద్దపెద్ద చెరువుల్లోగాని, నదీప్రవాహాలలోగాని వదిలి వేయడం సముచితం.

ప్ర. దేవుని గదిలో ప్రతిరోజూ అందరు దేవు ళ్లను పూజించడం సాధ్యంకాని పని. మరి ఒక దేవుని పూజించి మరొకరిని పూజించక పోవడం సరైందేనా?

– టి. సుధీర, కోట, నెల్లూరు జిల్లా

జ. దేవుని గదిలో ప్రధాన దేవతామూర్తికి పూజాదికాలు నిర్వహిస్తూ, మిగిలిన దేవతామూ ర్తులకు హారతి, నివేదనలు సమర్పించడం సము చితం. అలా చేయటం వల్ల సకల దేవతలనూ ఆరాధించినట్లే.

ప్ర. కరణములు ఎన్ని? వాటిలో మంచివి ఏవి? వాటి ప్రయోజనం? అసలు పంచాంగం ఉపయోగం ఏమిటి?

– కె. సృజన, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా

జ. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు - అను ఐదు అంశాలను 'పంచాంగం' అంటాం. కాలం తత్త్వాన్ని ఈ ఐదు అంశాల ద్వారా వివే చన చేసికొనే విషయాలను పంచాంగం ద్వారా తెలుసుకోవాలి. ఇందులో కరణములు 11. బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వణజి, భద్ర, శకుని, చతుష్పాత్, నాగవం, కిమస్తుఘ్నం.

## రూ.116/- బహుమతి పొందిన
# ఉత్తమ ప్రశ్న

ప్ర. హిందూ సంప్రదాయం ప్రకారం మరణం.. శరీరానికే కానీ ఆత్మకు కాదు. మరణించిన వారికి ఆత్మే కానీ శరీరం ఉండదు. ఆత్మ ఏ విధంగా యమలోకంలో బాధలు అనుభవిస్తుంది?

– డా. పి. నరసింహారావు,
గాజువాక, విశాఖపట్నం

జ. హైందవ సంస్కృతి, శాస్త్రవాఙ్మయ ప్రబోధానుసారం జీవుని ఆత్మతత్త్వం సువి శాలమైనది. జీవుడు విరివిగా పాపకార్యాలు చేసి ఉంటే శరీరాన్ని వదలిన పిదప పాప భారంతో కూడిన యాతనా శరీరాన్ని ధరించి యమలోకం చేరుతాడని ప్రాచీన గ్రంథాలు పేర్కొంటున్నాయి. యమలోకంలో ఆ యాతనా శరీరంతోనే బాధలు అనుభవింప వలసి ఉంటుంది.

మంచి చెడులు కేవలం వీటి పైనే గాక మిగిలిన నక్షత్ర యోగాదులపై ఎక్కువగా ఆధారపడి ఉంటాయి.

ప్ర. 'శివాయ విష్ణురూపాయ, విష్ణురూపాయ శివయే నమః' అని తిక్కన నుడివినా, నేటి సమాజంలో శైవ, వైష్ణవ మతాల్లో ఊహించినంత మార్పు రాకపోవడానికి కారణం?

– ప్రతాపురం రామానుజాచారి,
హన్మకొండ, వరంగల్ జిల్లా

జ. తిక్కన మహాకవి హరిహరాద్వైతం ప్రబో ధించక మునుపు ఈ శైవ వైష్ణవ భేదాలు ఇంకా ఎక్కువగా ఉండేవి. ఇప్పటికీ సమాజంలో ఊహించినంత మార్పు రాకపోవడానికి కారణం కొందరు మతపెద్దల ఛాందస భావాలే.

ప్ర. ఏదైనా పుణ్యక్షేత్ర సందర్శనం, దైవద ర్శనం అనంతరం తిరిగి ఇంటికే వెళ్లాలని అంటారు. ఎందుచేత?

– నెక్కల చిరంజీవి, ఏలూరు, ప.గో. జిల్లా

జ. పుణ్యక్షేత్ర సందర్శనం, దైవదర్శనం చేసిన పుడు ఆయా క్షేత్రాలు, దేవతామూర్తుల దివ్యత్వం, భవ్యత్వం తదితర లక్షణాల ప్రభావం మనపై తప్పక ఆవహించి ఉంటుంది. అటు వంటి దేవతానుగ్రహంతో సరాసరి ఇంటికే

వెళ్ళడం మంచిది. ఆ ప్రభావం గృహప్రాంగణం పైన కూడ తప్పక ప్రసరిస్తుంది.

ప్ర. అవధాన ప్రక్రియలో అవధానికి, పృచ్ఛకునికి క్లిష్టమైన అంశాలేమిటి? అవధాన పూర్తికి సమయ నియమం ఏదైనా ఉందా?

**– వి.ఎస్. మూర్తి,**
గుడిమల్కాపూర్, హైదరాబాద్

జ. అవధాన ప్రక్రియలో సిద్ధహస్తుడైన అవధానికి ఫలానా అంశం క్లిష్టం, ఫలానా అంశం సులభం - అన్నది లేదు. గజ ఈతగానికి నీటి లోతుతో పనిలేనట్లే ఇది కూడ. అనుభవజ్ఞులైన పృచ్ఛకుల విషయంలో కూడా ఇంతే. సహజంగా అష్టావధానాన్ని రెండు గంటల్లో పూర్తిచేయడం సముచితం.

ప్ర. స్వర్గస్థులైన నా తల్లిదండ్రుల ఫొటో ఇతర దేవుళ్లతో పాటు పూజామందిరంలో ఉంచి పూజించాలనుకుంటున్నా. ఇది సబబేనా?

**– తటవర్తి రామకృష్ణ,** తాళ్లగూడ, హైదరాబాద్

జ. స్వర్గస్థులైన తల్లిదండ్రులను మనం సంబంధిత పర్వదినాలలో, శ్రాద్ధాదులలో పితృదేవతలుగానే ఆరాధిస్తాం. దేవతామూర్తులకు శ్రాద్ధాదులు చేయం గదా! అందువల్ల తల్లిదండ్రుల ఫొటోలను ప్రత్యేకంగా ఉంచి పూజించడమే సముచితం.

ప్ర. పిల్లి ఎదురైనా, తుమ్మినా శుభకార్యాలకు వెళ్లకూడదంటారు. అలాగే ముగ్గురు కలిసి కూడా వెళ్లకూడదంటారు. ఈ సరి, బేసి సంఖ్యల వ్యవహారాలు నిజమేనా?

**– బి. రవీందర్,** ఖమ్మం

జ. ఇలాంటి వాటిలో ఎవరి విశ్వాసాన్ని బట్టి వారు నడుచుకొంటారు. ఇటువంటి నమ్మకాలకు శాస్త్రీయ నిబద్ధత లేదు. 'దేవ దేవార్చనం కృత్వా సర్వత్ర విజయీభవేత్' - అన్న విశ్వాసం ప్రబలంగా ఉంటే ఇవేవీ లెక్కకు రావు.

ప్ర. ఒక్కొక్కసారి అమృత ఘడియలు, దుర్ముహూర్తం కలిసిపోయి ఏకకాలంలో వస్తాయి. అప్పుడు దేన్ని పాటించాలి?

**– టి. సుందరరామయ్య,** రాజమండ్రి

జ. అమృత ఘడియలలో దుర్ముహూర్తం వచ్చినపుడు అమృత ఘడియలకే ప్రాధాన్యం ఇవ్వాలి. ఒకసారి అమృతత్వాన్ని పొందినది ఔన్నత్యాన్ని సంతరించుకొంటుంది. ఇక దుర్ముహూర్తంతో పనిలేదు.

ప్ర. శ్రాద్ధకర్మల వల్ల ఫలితం ఉంటుందా? అయితే కొన్ని కులాలు, మతాల వారు ఆచరించరు కదా? గయలో పిండప్రదానం చేస్తే, మళ్లీ చెయ్యనక్కర లేదా?

**– పి.వి. లక్ష్మీసుజాత,** నేరేడ్‌మెట్, సికింద్రాబాద్

జ. శ్రాద్ధకర్మల వల్ల తప్పక ఫలితం ఉంటుంది. కొన్ని కులాలు, మతాలు - అవి ఆచరించకపోవడం వారి వారి విశ్వాసాలకు సంబంధించిన అంశం. గయలో పిండ ప్రదానం చేస్తే మరలా చేయనక్కరలేదన్నది శాస్త్ర సమ్మతమే. కాని అలా చేసినా సత్ఫలితాలనే ఇస్తుంది.

ప్ర. శమంతకోపాఖ్యానంలో జాంబవంతుడు తన పుత్రిక జాంబవతిని, మణిసహితంగా శ్రీకృష్ణునికిచ్చి వివాహం జరిపిస్తాడు. శమంతకమణిని ఊయలకు కట్టినట్లుగా చెప్పబడింది. మరి అపుడు జాంబవతి వయసు ఎంత ఉంటుంది?

**– ఎం. అరుణరేఖ,** బెంగళూరు

జ. ప్రాచీనకాలంలో ఒక మోస్తరుగా సంపన్నులైన వారంతా పెద్దవాళ్ళు కూడ ఊయలపై ఊగే వారు. ఊయలకు శమంతక మణిని కట్టి ఉన్నంత మాత్రాన జాంబవతిని పసిపాప అనలేం. సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుని ప్రణయానికి నోచుకొన్నది - అంటే, అప్పటికే ఆమెకు యౌవన ప్రాదుర్భావం జరిగి ఉంది.

ప్ర. తండ్రికి పెద్దకొడుకు, తల్లికి చిన్నకొడుకు అంతిమ సంస్కారంలో ముఖ్యపాత్ర వహించాలంటారు. ప్రతియేటా పెట్టే ఆబ్దికాలకు కూడా ఇదే క్రమం పాటించాలా? ఆబ్దికాన్ని ఎలా నిర్వహించాలి?

**– ధరణికోట శివరాం ప్రసాద్,**
బోరబండ, హైదరాబాద్

జ. తల్లిదండ్రులకు చిన్న పెద్ద - ఎవరు అంతిమ సంస్కారాలు చేసినా ఆబ్దికాలు అందరూ చేసుకోవచ్చు ఎందుకంటే సంతానానికంతా వారు పితృదేవతలే గదా!

ప్ర. వధూవరులకు ఆరు సంవత్సరాల కంటే ఎక్కువ తేడా ఉండకూడదని విన్నాను. ఎంత భేదం ఉండవచ్చో శాస్త్రీయంగా తెలియజేయండి?

**– గుదిబండి శివకిశోర్ రెడ్డి,**
కొల్లిపర, గుంటూరు జిల్లా

జ. స్త్రీ పురుషుల శరీర ప్రకృతులకు సంబంధించిన సౌకుమార్య, సౌందర్య, గాంభీర్యాది లక్షణాలను, వారి ఎదుగుదలలోని అంశాలను అధ్యయనం చేసిన నిపుణులు ఇద్దరి మధ్య ఐదారు సంవత్సరాల భేదం ఉండడం సముచితం -

అన్నారు. వారి వారి వైయక్తిక శరీర విన్యాసాలను బట్టి ఈ నియమంలో కొంత తేడాలున్నా శాస్త్రీయతకేమీ లోటుండదు.

ప్ర. గాంగేయునికి స్వచ్ఛంద మరణం అనుగ్రహించడంలో శంతనుడు పూర్వజన్మలో చేసిన అశ్వమేధ, రాజసూయ యాగాలు అర్హత కలిగించాయా?

**– డా. తూములూరి పార్థసారథి,**

చైతన్యపురి, హైదరాబాద్

జ. గాంగేయునికి స్వచ్ఛంద మరణం అనుగ్రహించిన శంతనుడు స్వతస్సిద్ధంగా యోగశక్తి సంపన్నుడు. అతనికా యోగశక్తి లభించడానికి పూర్వజన్మలో నిర్వహించిన అశ్వమేధ, రాజసూయాదులొక కారణమైతే, మరొక కారణం ఆ జన్మలో అతడనుసరించిన పవిత్ర ధర్మనిష్ఠ. ఉదాహరణకు తాను యోజనగంధిపై మనసు పడినప్పుడు ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలలో 'కామం' అనే పురుషార్థం ద్వారా ఆమెను పొందాలనుకున్నాడు గానీ అరిషడ్వర్గాలలో ఒకటైన కామం ద్వారా పొందే ప్రయత్నం చేయలేదు. తాను మహారాజైనందువల్ల ఆమెను తన అధికారబలంతో అనుభవించడానికి ప్రయత్నిస్తే తనను ఎవరూ అడ్డుకోలేరు. శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో ధర్మబద్ధమైన కామాన్ని తన విభూతులలో ఒకటిగా పేర్కొన్నాడు. అటువంటి ధర్మబద్ధమైన కామంతో ప్రవర్తించే జీవులెవరికైనా భగవద్విభూతి సంబంధమైన యోగశక్తి లభిస్తుంది. అటువంటి యోగులు నిగ్రహానుగ్రహ సమర్థులు కాగలరు.

ప్ర. తిరుమలలోని శ్రీవేంకటేశ్వర స్వామి ఎత్తు ఎంత? ఎంతకాలమైనా ఆ విగ్రహం చెక్కుచెదరకుండా ఉండటానికి కారణం ఏమిటి?

**– యాండ్ర కృష్ణ,**

పెదమామిడిపల్లి, ప.గో. జిల్లా

జ. తిరుమలలోని శ్రీ వేంకటేశ్వరస్వామి ఏడు అడుగుల ఎత్తు కలిగిన అర్చామూర్తి. స్వయంభూమూర్తి యైనందువల్ల, నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వివిధోత్సవానందుడైనందు వల్ల ఆ ఆనంద నిలయవాసుడు చెక్కు చెదరని దేదీప్యమాన దివ్యమంగళ విగ్రహుడై ప్రకాశిస్తుంటారు. ©

# చతుర ప్ర.జ. 5

**ఉత్తమ ప్రశ్నకు రూ.116/-**

ప్రశ్న: ..........................................................

..........................................................

..........................................................

..........................................................

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా: ----------------------------------------

----------------------------------------

----------------పిన్ : ----------- ఫోన్ : ----------------

**సూచనలు**

✸ ఉత్తమ ప్రశ్నను అవధాని డా. మేడసాని మోహన్ ఎంపిక చేస్తారు ✸ మీ ప్రశ్న ద్వారా రాబట్టే సమాధానం పదుగురికీ ఉపయోగపడేలా ఉంటే మేలు ✸ ఏ నెల ప్రశ్నలు ఆ నెల కూపన్‌లోనే నింపి పంపాలి ✸ ప్రశ్న స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలి ✸ ఒకరు ఎన్ని ప్రశ్నలయినా పంపవచ్చు. ఒక కూపన్‌పై ఒక్క ప్రశ్న మాత్రమే రాయాలి ✸ తుడుపులు, కొట్టివేతలొద్దు ✸ ప్రశ్నల ఎంపికలో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం ✸ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు ✸ ఈ కూపన్ను కూడా తక్కిన వాటితో కలిపి ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

# విలక్షణ రచనా దీక్షావ్రతుడు

# అమర్‌కాంత్


అమర్‌కాంత్

**ఆధునిక హిందీ కథా ప్రక్రియను ఇతివృత్తం, పాత్రలు, భావజాలం, కథన పరంగా విలక్షణ మార్గంలో ఉన్నత శిఖరాలకు చేర్చిన సాహితీ విరాణ్మూర్తి అమర్‌కాంత్. యవ్వనప్రాయం నుంచే వెంటాడుతున్న అనారోగ్యాన్నీ, తదనంతరం వృద్ధాప్యాన్నీ ఏమాత్రం లెక్కచేయకుండా నిరంతరం రచనలు సాగిస్తూ పాఠకలోకాన్ని రంజింపజేస్తున్న సాహితీ తపస్వి ఆయన. శ్రీలాల్ శుక్లాతో సంయుక్తంగా అమర్‌కాంత్ 2009లో జ్ఞాన పీఠపురస్కారాన్ని అందుకున్నారు.**

అమర్‌కాంత్ ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బలియా జిల్లా భగమల్ పుర్ (నగారా) గ్రామంలో 1925 జులై 1న జన్మించారు. తల్లిదండ్రులు అతనికి పెట్టిన పేరు శ్రీరామవర్మ. అది తర్వాత అమర్‌కాంత్‌గా మారింది. తండ్రి సీతారామవర్మ వృత్తి రీత్యా న్యాయవాది. తల్లి గిరిజా దేవి. వీరిది మధ్యతరగతి కుటుంబం. అమర్‌కాంత్ బలియాలో ఉన్నత పాఠశాల స్థాయి వరకు చదువుకున్నారు. సాహిత్యాభిమానం, జాతీయ భావాలు ఆయనకు బాల్యంలోనే అలవడినాయి. పత్రికలు బాగా చదివేవారు. అలహాబాదులోని ఇర్వింగ్ క్రైస్తవ కళాశాలలో ఇంటర్మీడియెట్ లో చేరారు. అప్పటికే దేశంలో స్వరాజ్యోద్యమం ముమ్మరంగా సాగుతోంది. అమర్‌కాంత్ పై గాంధీ, నెహ్రూ, జయప్రకాశ్ నారాయణ్ తదితర ప్రఖ్యాతుల ప్రభావం బలీయంగా ఉంది. 'క్విట్ ఇండియా' ఉద్యమం అమర్‌కాంత్‌ను విశేషంగా ఆకర్షించింది. ఆ ఉద్యమంలో క్రియాశీలకంగా పాల్గొనే నిమిత్తం 1942లో ఇంటర్మీడియెట్ ఫైనల్ పరీక్ష రాయకుండానే స్వాతంత్ర్య పోరాట సమరాంగణంలోకి ఉత్సాహంగా దూకారు. టాల్‌స్టాయ్, దోస్తోయేవ్‌స్కీ, చెకోవ్, మాగ్జిమ్ గోర్కీ, శరత్‌బాబు, రవీంద్రుడు, ప్రేమ్‌చంద్ మొదలైనవారి రచనలు అధ్యయనం చేశారు. కమ్యూనిస్టు భావజాలం వైపు మొగ్గు చూపారు. ప్రగతిశీల దృక్పథం అలవడింది. 1948లో తిరిగి చదువు కొనసాగించి బీఏ పట్టా స్వీకరించారు. తన ఆలోచనా సరళి దృష్ట్యా జీవికకు పత్రికా రంగం అనువుగా ఉంటుందని ఆయన భావించారు. అలహాబాదులోని 'అమృత' పత్రికలో చేరారు. ఆ తర్వాత ఆయన వివాహమయింది. జర్నలిస్టుగా మంచి పేరు తెచ్చుకున్నారు. అస్వస్థతకు గురైనా కొంతకాలం పనిచేయక తప్పలేదు. 1954లో గుండెపోటు రావడంతో ఉద్యోగాన్ని వదలాల్సి వచ్చింది. చికిత్స పొందిన మీదట తనకు ఎంతో అభిమానపాత్రమైన పత్రికా రంగంలోకి తిరిగి ప్రవేశించారు. ఆగ్రాలోని 'సైనిక్' పత్రిక సంపాదకవర్గంలో చేరారు. తర్వాత 'భారత్', 'కహాని', 'ఉజాలి', మనోరమ' తదితర పత్రికలలో పనిచేశారు. 1995లో 'ఆస్టియొమెలాసియా' అనే ఎముకలకు సంబంధించిన క్షయవ్యాధికి లోనవడంచేత ఉద్యోగం మానుకున్నారు. కాని వజ్రసంకల్పుడైన ఆయన మాత్రం తన రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తూనేవున్నారు. 'బహామ్' అనే త్రైమాసిక పత్రికకు గౌరవ సంపాదకత్వం వహిస్తున్నారు.

నవలలు, బాలసాహిత్యం తదితర ప్రక్రియల్లో ప్రసిద్ధ రచనలు వెలువరించినప్పటికీ, అమరకాంత్ ప్రధానంగా కథకుడు. అద్వితీయ ఇతివృత్తం, శిల్పం ఒకదానితో ఒకటి పోటీపడతాయి. మొదటి కథ 'బాబు' సైనిక్ పత్రికలో వెలువడింది. పాఠకలోకానికి కొత్తస్వరం వినిపించింది. మధ్యతరగతి ప్రజలు, అభాగ్యుల జీవితాలను కూలంకషంగా అధ్యయనం చేసిన అమర్‌కాంత్ తన కథలకు ఆ సమస్యలను ప్రధాన నేపథ్యంగా చేసుకున్నారు. ఆయన కథల్లో ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. పేదలు, బడుగు జీవులు, దళితులపట్ల తీవ్రమైన ఆర్తి, భావోద్వేగం వ్యక్తమవుతుంది. అదృష్టహీనులు, పీడితులపట్ల ఆయనకు ఎంతో జాలి. వారి దీనగాథల్ని ఆయన కథగా మలిచే విధానం చాలా విలక్షణంగా ఉంటుంది. నేటికీ ఉత్తరప్రదేశ్‌లో ఐ.ఎ.ఎస్. పరీక్షకు హాజరయ్యే అభ్యర్థులు ఆయన రాసిన 'డిప్యూటీ కలెక్టర్' అనే కథతో స్ఫూర్తి పొందుతారు. ఆ కథ నారాయణ్ అనే యువకుని చుట్టూ అల్లింది. ఎంతో శ్రమించి రాసినా సివిల్ సర్వీసు ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణత సాధించలేకపోతాడు. అయితే అమర్‌కాంత్ తన ఈ రచనను చదివే పాఠకులలో అకుంఠిత దీక్ష, పట్టుదల పెరిగే రీతిలో కథనమంతా ఆద్యంతం కొనసాగించారు.

అన్నార్తుల బాధలను రసార్ద్రంగా చూపే కథ 'దోపహార్‌కా భోజన్'. ప్రగతిశీల లేఖక్ సంఘ్' సభలో ఆయన వినిపించిన 'ఇంటర్వ్యూ' అనే కథలో తన జీవితానుభవాలను క్రోడీకరించారు. దానిపై ఆహూతులు, చదువరులు ప్రశంసల వర్షం కురిపించారు. 'మౌత్ కా నగర్', 'హత్యారె' వంటి ఆయన రాసిన అనేక కథలు పాఠకుల హృదయంలో సుస్థిర స్థానం చేకూర్చుకున్నాయి. సామాన్యుని జీవితాన్ని అమర్‌కాంత్ తన కథల్లో వివిధ కోణాల్లో చిత్రించారు. దళితుల విషయంలో ఆయన ప్రగతిశీల భావాలను తన కథల్లో ప్రతిబింబింప చేశారు. దళితులతో సన్నిహిత సంబంధాలు నెరపిన పాత్రలను సృష్టించారు. ఉత్తినే కూర్చుని కబుర్లు చెప్పడాన్ని ఆయన నిరసించారు. చిత్తశుద్ధితో ఆ దిశగా ముందుకు సాగాలని జాతిని హెచ్చరించారు. 'బహుత్ ప్రయాస్ కర్నేకీ జరూరత్ హై/ బైఠకర్ బహస్ కర్నే నహీ హోగా/ యహ్ మెల్-మిలాప్, ఆపస్ మె షాదీ- వివాహ్ ద్వారా హ సామాజిక్ రూప్‌సె హో సక్తా హై' అంటారు.

ఇంతవరకూ 'జిందగీ ఔర్ లోక్', 'దేశ్ కె లోగ్ కళాప్రేమి', 'జాంచ్ ఔర్ బచ్చే', 'సుఖ్ ఔర్ దుఃఖ్ కా సాథ్', 'ఏక్ ఘన్ వ్యక్తి కా బయాన్' మొదలైన పదమూడు కథా సంపుటాలు వెలువరించారు.

అమర్‌కాంత్ మంచి నవలాకారుడు కూడా. 'ఇన్హీ హథియారోంసె' నవల విశేష జనాదరణ పొందింది. గాంధీజీ పిలుపు నందుకుని అమర్‌కాంత్ ఇంటర్మీడియెట్ చదువు మానేసి, 'క్విట్ ఇండియా' ఉద్యమంలో దూకి తీవ్రంగా పనిచేశారు. అప్పటి అనుభవాలను అత్యంత ఉద్విగ్నంగా నవలలో పొందుపరచారు. ఇందులోని ఇతివృత్తం బలియా నేపథ్యంగా జరుగుతుంది. 'హతియార్' అంటే ఆయుధం. ముఖ్యఘట్టం చదువుతున్నప్పుడు పాఠకులు ఆగ్రహోద్రిక్తులవుతారు. ఉద్యమంలో పాల్గొనే యోధులు ఒక పోలీసుస్టేషను ముట్టడించారు. ఆ స్టేషను నిర్వహించే సబ్ ఇన్‌స్పెక్టరు భారతీయుడే. అయినా బ్రిటిష దొరల ఆజ్ఞను శిరసావహించి సోదర భారతీయులపై తుపాకితో కాల్పులు జరిపాడు.




ఎందరో యువకులు ప్రాణాలు కోల్పోతారు.

అమర్‌కాంత్ రచించిన 'బిదాకీ రాత్', 'సుఖ్ జీవి', 'లహరె', 'గ్రామ సేవిక', 'సుభాపత్రా', 'బీచ్‌కీ దీవార్', 'కాటి ఉజలె దిన్' మొదలైన నవలలు కూడా ఆయనకు మంచి పేరు తెచ్చాయి. కథలు, నవలలే కాకుండా, 'మంజరి', 'వానరసేన', 'దో హిమ్మత్ బచ్చే' వంటి పది బాల సాహిత్య గ్రంథాలు, 'కుచ్ యాదేం - కుచ్‌బాతేం, 'దోస్తే' అనే జ్ఞాపక కృతులు రచించారు. ఇప్పుడు ఒక నాటకం, అలాగే 'ఆంధీ' అనే మరో నవలా రచనలో నిమగ్నులయ్యారు.

అమర్‌కాంత్ ఇంతవరకు యశ్‌పాల్, సోవియట్ ల్యాండ్ నెహ్రూ, ఉత్తరప్రదేశ్ హిందీ సంస్థాన్, మైథిలీ శరణ్ గుప్తా, జన సంస్కృతీ మంచ్, సాహిత్య అకాడమీ, వ్యాస్ సమ్మాన్ ఇత్యాది పురస్కారాలెన్నో అందుకున్నారు. ఆయన నిరంతర రచనా దీక్షావ్రతుడు.

**– గోవిందరాజు రామకృష్ణారావు**

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**రామకూరు నాగేశ్వరరావు**
ఇం.నెం. 16-2-111, తోటవీధి,
గుజరాతీపేట పోస్టు,
శ్రీకాకుళం పిన్: 532005

## చతురంగం - 22 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 తె | లు | 2 గు | 3 వె | లు | 4 గు | | 5 ఆ | రా | 6 ధ్య |
| లి | | 7 ఆ | ట | | 8 బా | లి | క | | యో |
| 9 వి | 10 జీ | | 11 కా | ది | ళిం | | 12 సం | 13 ర | స |
| | 14 వా | 15 స | రం | | 16 పు | 17 రం | | తు | |
| 18 సీ | | క్క | | 19 ప | | 20 భ | 21 ద్రా | చ | 22 లం |
| 23 తా | 24 నం | | 25 అ | ల్ల | 26 రి | | క్ష | | గ |
| 27 రా | య | లు | | 28 ము | ద | 29 రా | | 30 ఆ | రు |
| 31 మ | వా | | 32 తా | | 33 డో | రి | 34 మం | ద | |
| రా | | 35 ఓ | వి | 36 రా | మం | | 37 ప్ర | ర | 38 వ |
| 39 జు | లా | య్ | | ధ | | 40 మ | ణా | ము | ప్ర |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. అద్దంకి సీతాదేవి, మలక్‌పేట, 2. వి.డి. భవాని, న్యూనల్లకుంట, 3. నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖ, 4. మహమ్మద్ తహసీన్ అలి, వడ్డేపల్లి, వరంగల్ జిల్లా, 5. కె.వి.యల్. నరసింహ శాస్త్రి, చందానగర్, 6. అత్తిలి కస్తూరిబాయి, తిరుపతి, 7. అవ్వారి సామ్రాజ్య లక్ష్మి, మోతీనగర్, 8. డా. సి. జనార్ధనసింగ్, నల్లకుంట, 9. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 10. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 11. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 12. ఎ. అరుంధతి, పూనె, మహారాష్ట్ర, 13. ఆలూరి పార్థసారథి, చెన్నై, 14. ఆర్. లక్ష్మీరంగరాజన్, చెన్నై, 15. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 16. బి. శాంతి, విజయవాడ, 17. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 18. ఇందన మల్లిఖార్జున్‌రావు, ఏలూరు, 19. డా. శివభూషణం, కర్నూలు, 20. ఎం.ఎం. నీహార్ కుమార్, బోరబండ, 21. ఎం. వసంత, బోరబండ, 22. ఎ. మాధురి, నిజాంపేట, 23. కన్నేపల్లి విజయలక్ష్మి, శ్రీకాకుళం, 24. పత్రి సంధ్యాశ్రీలక్ష్మి, గుంటూరు, 25. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 26. ఎం.వి. జోగేశ్వరశర్మ, అర్సవిల్లి, 27. ఎ. బుచ్చం నాయుడు, మెరకముడిదం, విజయనగరం జిల్లా, 28. సాధనాల పద్మావతి, విజయవాడ, 29. గేదెల రామారావు, ఏలూరు, 30. నోముల సురేందర్‌రావు, హబ్సిగూడ, 31. ఆదుర్తి విజయామూర్తి, విశాఖ, 32. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 33. తటపర్తి రామకృష్ణ, హైదరాబాద్, 34. నందుల మహలక్ష్మి, రామంతాపూర్, 35. పి. వెంకటరాములు, ధర్మపురం, మహబూబ్‌నగర్ జిల్లా, 36. భాగ్యశ్రీ రాజేష్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 37. ముదిగొండ అరుణరేఖ, బెంగళూరు, 38. బందెల ప్రణవ్, వుయ్యూరు, కృష్ణాజిల్లా, 39. పి. జయశ్రీ, మౌలాలి, 40. పాలగుమ్మి విశ్వనాథం, కానాజిగూడ, సికింద్రాబాద్, 41. కె. జానకి, కాప్రా, 42. కె. పద్మావతి, అనంతపురం,43. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 44. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 45. కె. వాణీసుజాత, గుంటూరు, 46. సి. విజయ భాస్కర్‌రెడ్డి, ప్రొద్దుటూరు, 47. వి.వి. సుబ్బారావు, రాజమండ్రి, 48. పి. రాజశేఖర్, సంగారెడ్డి, 49. గన్నోజు పద్మావతీ శ్రీనివాసాచారి, మహబూబ్‌నగర్, 50. కరణం శివానందరావు, బెంగళూరు, 51. పెద్దింటి శ్రావ్య, వనస్థలిపురం 52. అవధానం రంగనాథం, బెంగళూరు, 53. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, 54. పి. ప్రభావతి, మియాపూర్, 55. డి. ఇందుమతి, ఎ.ఎస్. రావు నగర్, 56. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, 57. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 58. కోనె నాగవెంకట ఆంజనేయులు, విశాఖ, 59. సి హెచ్. ఉమాబాల, దోమల్‌గూడ, 60. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 61. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 62. నందూరి నాగేశ్వరరావు, బేగంపేట, 63. కొక్కెరగడ్డ శ్రీదేవి, మానేపల్లి, తూ.గో.జిల్లా, 64. చిట్టిపెద్ది కోటయ్యశాస్త్రి, కాకినాడ, 65. పి. సుజాత, గుంటూరు, 66. బి.యస్. రంగ, తాడేపల్లిగూడెం, 67. వెల్చేరు సూర్యకుమారి, విజయనగరం, 68. వి. రెడ్డివంశీకృష్ణ, రాయచోటి, 69. డా. తూములూరి పార్థసారథి, చైతన్యపురి, 70. గుర్రాల శ్రీనివాసరావు, కాకినాడ, 71. వి.యస్. మూర్తి, గుడిమల్కాపూర్, 72. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణాజిల్లా, 73. కాశీపట్నపు వి.ఎస్.ఎన్. మూర్తి, విశాఖ, 74. బి. సుబ్బారావు, రిట్టపాడు, శ్రీకాకుళం జిల్లా, 75. వి.కె. రావు, నాచారం, 76. యం.వి.యన్. ధనలక్ష్మి, నరసాపురం, ప.గో.జిల్లా, 77. చి.పు. శాస్త్రి, నిజామాబాద్, 78. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 79. ఎం. రామచంద్రరావు, హిల్‌కాలనీ, నల్గొండ జిల్లా, 80. వి.వి. రత్నం, విశాఖ, 81. పి. శ్రీదేవి, మెట్టపల్లి, విజయనగరం జిల్లా, 82. అబ్బయ్యవారి దుర్గాప్రసాదరావు, కర్నూలు, 83. కె.ఎల్.ఎన్. రావు, నల్లకుంట, 84. పప్పు శ్రీదేవి, అమలాపురం, 85. కొండుపర్తి వేంకటజగన్నాథదాసు, సికింద్రాబాద్, 86. శ్రీపెరంబుదూరు నారాయణరావు, హైదరాబాద్, 87. యు. చిట్టిబాబు, కొత్తపాల్వంచ, 88. యు.వి.ఎస్. శివకుమార్, హైదర్షాకోట్ 89. ఎన్.కె. ఆరవెల్లి, సిరోంచ, మహారాష్ట్ర, 90. చుండూరు అప్పలనరసింహం, బాచుపల్లి, 91. వానపల్లి వెంకటసత్యగంగరాజు, విశాఖ, 92. అనిలరేణు, వరంగల్

# చతురంగం - 23 ఆధారాలు

**అడ్డం**

1. 'ఎక్కు'కు వ్యతిరేకం (2)
3. కాశీనే ఇలా కూడా అంటారు (4)
6. నేత్రం (2)
8. 'ఈనాడు'గ్రూపు వ్యవసాయ పత్రిక (4)
10. కార్చిచ్చు (5)
11. ప్రాణం కన్నా ఇది ఎక్కువంటారు (2)
13. సువాసన (2)
14. మహిళలకు ఇవంటే ఇష్టం (3)
17. ఇది కానివాడు మోక్షగామి కాలేడు అన్నాడు వేమన..?? (2)
18. వాల్మీకి విరచితం (4)
20. కోకిల గుడ్లను పొదిగేది అటునుంచి (2)
22. రుషులు చేసేది (3)
25. తిరుపతిలోని ఈ ఆసుపత్రిలో ఇటీవల పసికందులు ఎక్కువగా చనిపోయారు (2)
26. పండు కాదు (2)
28. 'తింటాము' కి వ్యతిరేకం (3)
30. దూషణ (2)
33. ఆపద (2)
34. దండ (3)
36. సంఘటన వంటిదే (3)
38. ఉత్తరం (2)
39. పగలు, రోజు (2)
41. వంకర (2)
42. గుర్రము (2)
43. నూరు, వంద పద్యాలతో తెలుగులో ఒక సాహితీ ప్రక్రియ (4)

**నిలువు**

1. 'ఇది' కి వ్యతిరేకం.. కిందినుంచి (2)
2. లేత మామిడి చెట్టు (4)
3. కాల్చినా, కొట్టినా తేలేది (2)
4. పశువులకు పెట్టేది తిరగబడింది (2)
5. మరాఠా మహాయోధుడు, రజనీకాంత్ సినిమా (3)
6. వ్యాకులత, క్షోభ (3)
7. ముందు.. కిందినుంచి (2)
9. రాష్ట్ర మంత్రి ఒకరి ఇంటిపేరు (2)
12. అడ్డం 3 లో ప్రవహించే నది (2)
13. రాముడు తొలుత చంపిన రక్కసి (3)
14. వెండితెర అందాల బొద్దుగుమ్మ (3)
15. ఉజ్జాయింపు, రమారమి (3)
16. యుద్ధం (2)
19. శుక్రాచార్యుని అల్లుడు (3)
21. పొగడ్త, ఉబ్బేయడం (2)
23. భర్త (2)
24. తె.దే.పా. ప్రభుత్వం రాక పూర్వం కరణంతోపాటు ఉండే గ్రామాధికారి (4)
27. దేశరాజధానిలో ప్రవహించే నది (3)
29. చంద్రగుప్తుని తల్లి (2)
31. సోపానం తలకిందులు (2)
32. సులువు, తేలిక (3)
35. స్త్రీ (3)
37. పేజీ తిరగబడింది (2)
38. పరిమళ భరితమైన ఒక పుష్పం (2)
40. చూడం.. కిందినుంచి (2)

**నిబంధనలు**

✦ చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు. ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 23

రూ.150/- బహుమతి

గడువు తేది : ఫిబ్రవరి 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | 4 | 5 | | 6 | 7 |
| 8 | | 9 | | | 10 | | | | |
| | 11 | | | 12 | | | | | |
| 13 | | | 14 | | | | 15 | | 16 |
| | | 17 | | | | 18 | | 19 | |
| 20 | 21 | | 22 | 23 | 24 | | 25 ర | | |
| | 26 | 27 | | 28 | | 29 | | 30 | 31 |
| 32 | | 33 | | | 34 | | 35 | | |
| 36 ఘ | 37 | | | 38 | | | 39 | 40 | |
| 41 | | | 42 | జి | | 43 | | | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------

------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : --------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# ఓ ఉద్యమం



తెలుగు సాహితీ చరిత్రలో గొప్ప ఉద్యమం విపుల, చతుర పత్రికలు. మూడున్నర దశాబ్దాలపాటు ప్రపంచ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేస్తూనే మౌలిక రచనకూ గొప్ప ఉపకారం చేసే దృష్టికీ తృష్ణకీ నిలువెత్తు సాక్ష్యంగా నిలుస్తాయి. కేవలం సంపాదనే లక్ష్యంగా కాక ఒక సేవగా, ఒక ఆదర్శంగా సాగించిన కృషి రామోజీరావుగారిది. ఎన్నో భాషలలో ఎందరో రచయితల మణిపూసల్ని పరిచయం చేసుకునే వేదికని 24 సంవత్సరాలు నిర్వహించిన చలసాని ప్రసాదరావుగారికీ, ఇప్పటికీ ఆ లక్ష్యం వేపుకే ప్రయాణం చేస్తున్న ఈ పత్రికలు తెలుగునాట చరిత్ర కావాలని మనసారా ఆశిస్తున్నాను. క్లుప్తత, గుప్తత, సాంద్రత, విస్తృతి పెట్టుబడులుగా, సత్సంప్రదాయం ఒరవడిగా నిలిచే ఈ పత్రికలు తెలుగు సాహిత్యానికి ముందు ముందు కూడా కరదీపికలు కావాలనికోరుతున్నాను.

– **గొల్లపూడి మారుతీరావు,** సినీ నటులు, రచయిత, వైజాగ్

# 'చతుర' తొలి నవల నాదే!



తెలుగు సాహితీలోకాన్ని నవల ఏలుతున్న రోజుల్లో 'చతుర' తొలి నవలా మాసపత్రికగా వెలువడింది. అప్పట్లో నవలా రచనలో స్త్రీలదే పైచేయి. అలాంటి సమయంలో చలసాని ప్రసాదరావు నన్నో నవల రాయమన్నారు. అప్పటికి కథలు తప్ప చెప్పుకోదగ్గ నవల ఏదీ రాయలేదు నేను. పేరున్న రచయితలెందరెందరో ఉన్నా 'చతుర'కు తొలినవల నాచేతే రాయించాలనుకున్నారాయన. ఓ పక్క ఆనందం.. మరోపక్క ఏం రాయాలనే ఆలోచన! 'ఓ కథను ఇస్తా, చూడండి.. నచ్చితే దాన్నే విస్తృతపరుస్తాన'ని, అప్పటికే ఓ మాస పత్రికలో ప్రచురితమైన 'బంగారమ్మ కమతం' కథను చెప్పాను. అప్పటికే ఆ కథను చలసాని కూడా చదివే ఉండడంతో దాన్ని నవలగా రాయడానికి అంగీకరించారు. అలా 'కమలమ్మ కమతం' పేర నాతొలి నవలతో 'చతుర' ప్రారంభమైంది. తరువాత ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారు ప్రత్యగాత్మ దర్శకత్వంలో దాన్ని సినిమాగా కూడా తీశారు. అలా అప్పుడప్పుడూ మరో నాలుగు నవలలు 'చతుర'లో ప్రచురితమయ్యాయి. విశేషమేమంటే 'చతుర'లోనే వచ్చిన 'శివగంగ' అనే మరో నవలను 'మల్లెమొగ్గలు' పేర, వి. మధుసూదన్‌రావు దర్శకత్వంలో ఉషాకిరణ్ మూవీస్‌వారు అట్లూరి రామారావు పర్యవేక్షణలో సినిమాగా తీయడం మరపురాని ఒక తీయని అనుభూతి.

ఆది నుంచి 'చతుర'కు కొన్ని ప్రమాణాలు, విలువలు ఉన్నాయి. కాలక్షేప నవలలు కాదు 'చతుర'కు కావాల్సింది. ఆలోచింపజేసే నవలలు కావాలి. వైవిధ్య నవలలు కావాలి. మూడున్నర దశాబ్దాలుగా నవలకు 'చతుర', ప్రపంచ కథాసాహిత్యానికి 'విపుల' చేస్తున్న సేవలు నిరుపమానం. ప్రశంసనీయం. అభినందనలు.

– **సి.ఎస్. రావు,** సుప్రసిద్ధ సీనియర్ రచయిత, హైదరాబాద్

